అపరాధ పరిశోధన అనుబంధం — 54

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మారువేషం ముప్పు

రచన : అజీజ్

## వర్షించని మేఘాలు

రచన : మల్లేశ్వరరావ్

## అందరూ మోసగాళ్లే

రచన : సంపత్

## లక్షకోక మామిడి మొక్క

రచన : వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —54
జూన్, 1978

వెల : 3-00 రూపాయలు

ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మారువేషం ముప్పు!

అజీజ్

"మావయ్యా! నామాట విను. ఇప్పటికీ మించిపోలేదు ఇల్లు ఖాళీచేసేయ్. ఇక్కడ దెయ్యాలున్నాయ్."

ఫెళ్ళున నవ్వాడు ప్రొఫెసర్ ప్రకాశరావు. "చూడబ్బాయ్! నేను మహాబలిపురంనించి వచ్చి, ప్రయోగశాల కోసం ఈ ఇల్లు కొనడానికి ప్రయత్నిస్తున్నప్పట్నించీ నువ్విలా హెచ్చరిస్తూనే వున్నావ్!

ఇల్లు కొనడంతోబాటు ఈరోజు గృహప్రవేశంకూడా జరిగిపోయింది. నా ప్రయోగాలకి సంబంధించిన సైంటిఫిక్ ఎక్విప్‌మెంట్సన్నీ లేబరేటరీలో సర్దటంకూడా జరిగిపోయింది.

ఐనా, ఈ లోకంలో దెయ్యాలుండటం ఏమిటి, నాన్సెన్స్! మద్రాసులో క్రిమినల్ లాయర్‌గా పేరుపడ్డ నువ్వే యిలా మాట్లాడుతోంటే, ఇహ చదువుకోని పామరుల సంగతేమిటో ఊహించలేకుండా వున్నాను!" అన్నాడు.

హృదయనాథ్ నిట్టూర్చాడు. అతని వాల్కనులు ప్రకాశరావుపక్కన కూర్చున్న ద్రాక్షవేణి వేపుమళ్లాయి.

ద్రాక్షవేణి ప్రకాశరావు ఏకైక సంతానం. ఈమధ్యే ఎమ్మెస్సీ ఫస్టు డివిజన్‌లో పాసయింది. తనలాగే ఆమె కూడా గొప్ప సైంటిస్టుగా రూపొందాలని ప్రకాశరావు ఆకాంక్ష.

ఆయన స్వస్థలం మహాబలిపురం. ద్రాక్షవేణి మద్రాసులో సేవుండి ఎమ్మెస్సీ చేసింది. హృదయనాథ్, ప్రకాశరావుకి వేలువిడిచిన మేనల్లుడు.

మహాబలిపురంనించి మద్రాసుకు షిఫ్టు కావాలని మొదటినుంచి అనుకుంటున్న ప్రకాశరావు చిరకాల వాంఛ ఈనాడు ఈడేరింది. ఇప్పుడు ద్రాక్షవేణి యూనివర్సిటీ పట్టభద్రురాలయింది గనక, ఆమె సహాయ సహకారాలతో తన ప్రయోగాలు నిరాటంకంగా కొనసాగించవచ్చని ఆయన అభిప్రాయం!

ఆ వుద్దేశంతోనే, మద్రాసుకు మూడు మైళ్ళదూరంలో ఎలాంటి డిస్టర్బెన్సూ లేని ప్రదేశంలో ఒంటరిగా పాడుపడున్న ఈ భవనం కొనేసి, మరమ్మత్తులు చేయించి, ఈ రోజు గృహప్రవేశంకూడా చేశాడు.

హృదయనాథ్ ఇల్లు మద్రాసులోవుంది. అక్కడే అతను గత ఐదేళ్ళనుంచీ ప్రాక్టీసుచేస్తూ, రెండుచేతులా సంపాదిస్తున్నాడు.

"మామయ్యా! మీరన్నట్టు నేను చదువుకున్నవాణ్ని. లాయర్ని. నిజమే. అలాగే మీ ఆత్మీయుణ్ని, బంధువునీ కూడా. మీ క్షేమాన్ని కాంక్షించడం సహజమే కదా?

ఒక్కవిషయం ఆలోచించండి మామయ్యా! ఈ మద్రాసు చుట్టుపక్కల ఇళ్ళకొరత యెంత తీవ్రంగా

వుంటుందో మీకు తెలిసిందేకదా? అలాంటిది నగరానికింత చేరువలోవున్న ఈ లంకంత భవనం ఇన్నేళ్ళుగా మనిషి ఛాయలేకుండా దేనికుంది? దీని జోలికి ఎవ్వరూ దేనికి రారు? కారణం వుండాలిగా?''

''ఔను డాడీ! నేనూ విన్నాను. సెగలేనిదే పొగ రాదుకదా? బావ చెప్పేది నిజమేనేమో!''

ప్రకాశరావు మొహంచిట్లిస్తూ కూతురువైపుచూసేడు. ''ఎమ్మెస్సీ పట్టభద్రురాలివైన నువ్వేనా యిలా మాట్లాడేది? సిగ్గుచేటు! మీ కాకమ్మ కబుర్లు నమ్మి భయపడటానికి నేనేం పసిపిల్లాడ్నికాను. ఈజుత్తు ఊరికేఎండలో పండలేదు!''

''మీకు మామీద నమ్మకం లేకుంటే, ఈ చుట్టుపక్కల గ్రామాల్లో యెవరినయినా అడిగి తెలుసుకోండి మామయ్యా!''

''ఎవర్నో అడిగి తెలుసుకోటానికి నాదగ్గర టైంలేదు. వాళ్ళంతా చవటలు, దద్దమ్మలు!''

''కనీసం మీ నమ్మకమైన నౌఖరు నరసయ్యనయినా అడగండి, ఏమంటాడో?''

ప్రకాశరావు పకపక నవ్వి—''మంచి వుదాహరణే ఇచ్చావ్! వాడు ముందే మీ మాయమాటల్లోపడి హడలి చస్తున్నాడు. వాణ్నడగట మేమిటి?

నన్ను మభ్య పెట్టడానికి నువ్వెందుకింత తాపత్రయ పడుతున్నావో నేనూహించ లేననుకున్నావా...''

''డాడీ!''

''నువ్ నోర్ముయ్! నోరు మూసుకోడం యిష్టం లేకుంటే, వెళ్ళి నీగదిలో పడుకో!'' కసిరాడు ప్రకాశ

రావు కూతుర్ని.

ద్రాక్షవేణి ముహం ముడుముకుని, అక్కణ్నించి వెళ్ళిపోయింది.

"హృదయనాథ్! మీ యిద్దరి ప్రేమ గొడవ నాకు తెలీదనుకోకండి. ద్రాక్షవేణి మద్రాసులో వుండి చదువు కుంటున్నప్పుడే నీ పిచ్చిలో పడింది. నువ్వు బుద్ధిమంతుడివే. కావలసిన వాడివే. ఒప్పుకుంటాను.

కాని, నేను సైంటిస్టుని కాకుండా వుండివుంటే, నాకో కొడుకే వుండివుంటే, ద్రాక్షవేణిని నీ చేతుల్లో పెట్టి, నా చేతులు దులుపుకునేవాణ్ణే! దురదృష్టవశాత్తూ నాకున్న ఒకేఒక ఆశాదీపం ఆ అమ్మాయి.

నేనా జవసత్వాలుడిగి, చరమదశలోవున్న ముసలాణ్ణి. నా తరవాత, నేను అసంపూర్తిగా వదలిపోయిన నా ప్రయోగశాల గతేంకాను? అవి సామాన్యమైన యెక్స్‌పెరిమెంట్సు కావే! వాటిని పూర్తిచేసి, లోక కళ్యాణానికి పాటుపడేదెవ్వరు?

అందుకే నాకూతురు పెళ్ళి, సంసారంకంటి తాత్కాలిక మోహ పాశాలవలోనయి, అనామకురాలిగా రాలిపోకుండా, తన మేధాశక్తితో యెన్నెన్నో నూతన విషయాలు కనిపెట్టి, చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోవాలని కోరుకుంటున్నాను.

ఆ వుద్దేశంతోనే ఈ నూతన లేబరేటరీ నిర్మించాను. నగరానికింత దూరంలో దేనికి కొన్నానో తెలుసా? అమ్మాయి నీ ప్రేమ పిచ్చికి దూరంగా వుండాలనే!"

"ప్రేమను మీరు పిచ్చికింద జమకడుతున్నారా మామయ్యా!"

"లేకుంటే మరేమిటి? నువ్వు దేన్నైతే ప్రేమ అంటు న్నావో అది కేవలం తాత్కాలిక భావోద్రేకం మాత్రమే! పిల్లకవులూ, పిచ్చి రచయితలూ తాత్కాలిక ప్రేరణ చుట్టూ సాలెగూడులాంటి రంగులవలలల్లి యువతీ యువకుల్ని ప్రలోభంలో పడేస్తున్నారు.

ఆ ఉద్రేకం కాస్తా చప్పబడ్డాక, ప్రేమా గీమా గాలి కెగిరి, కలతలూ కార్పణ్యాలూ ప్రారంభమవుతాయి. ద్రాక్షవేణిని నువ్వొక ప్రేయసిగానూ, భార్యగానూ, తల్లి గానూ మార్చగలవు. అంతేకదా? కాని నా బిడ్డ గొప్ప శాస్త్రవేత్త కావడానికి జన్మించింది!"

నిట్టూర్చాడు హృదయనాథ్. "మామయ్యా! మీరు నన్నపార్థం చేసుకుంటున్నారు. మిమ్మల్ని మభ్యపెట్టి ఈ ఇల్లు విడిపించాలని నేను ప్రయత్నించడం లేదు. కావల సిన వారు. కోరి ప్రాణాపాయం కొని తెచ్చుకుంటున్నా రనే ఆందోళనతో ఇంతగా ఆరాటపడుతున్నాను. ఈ ఇంట్లోవున్న దెయ్యాలు ఎంత ప్రమాదకరమైనవో తెలిస్తే మీరిలా మాట్లాడరు..."

ప్రకాశరావు గొల్లున నవ్వి—ప్రమాదకరమైనవా? ఐతే, నీ కాకమ్మ కబుర్లింకా మిగిలి వున్నాయన్నమాట. సరే, కానివ్వు. ఇంతకీ, ఈ ఇంట్లోవున్నవి ఆడదెయ్యాలా? మగదెయ్యాలా?"

"రెండే రెండు ఆడదెయ్యాలు!"

"వెరీ గుడ్! ఒకత్తిరిని వంటమనిషిగా, ఒకత్తిని పని మనిషిగా వాడుకుంటాను."

ఆయన ఎగతాళి మాటలు ఆ దెయ్యాలెక్కడ వింటు న్నాయో అన్నట్టు చుట్టూ పరికించి చూసాడు హృదయ నాథ్.

"మామయ్యా! ఊడిగం చేయించుకోడానికి వాళ్ళు మామూలు మనుషులు కాదు. రాజకుమార్తెలు!"

పకపక నవ్వాడు ప్రకాశ్‌రావు. "రాజులకాలంపోయి చాలా రోజులైంది. గనక, ఇప్పుడా దెయ్యాలుకూడా పోయుంటాయి."

"అవింకా పోలేదు మామయ్యా! ఇక్కడే వుండి ప్రతీకారం తీర్చుకుంటున్నాయి!"

"ప్రతీకారమా? ఎందుకో?"

"పదిహేడవ శతాబ్దంలో ఈ చుట్టుపక్కల చిన్న సంస్థానం వుండేదిట. ఆ రాజుకు అపురూప సౌందర్యవతులైన ఇద్దరు కుమార్తెలుండేవారుట..."

"అలాగా! ఐతే వాళ్ళని తప్పకుండా ఒకసారి చూసి తీరాలి!"

"...ఆ రాకుమార్తెలు ఈ భవనంలోనే నివసించేవారుట. ఒకసారి శత్రుసైనికులు ఈ సంస్థానంమీద దండెత్తి, విజయం సాధించి, రాజధానిని కొల్లగొడుతూ ఈ భవనంలో ప్రవేశించారుట.

ఆ రాకుమార్తెలు కనిపించగానే వాళ్ళ మతులుపోయి పశువులకన్న హీనంగా, కిరాతకంగా వాళ్ళను చెరిచేరుట. ఆ పాశవిక చర్యలోనే వాళ్ళు ప్రాణాలు కోల్పోయి, ప్రేతాలుగా మారి, ఆ నాటినించీ, ఈ నాటివరకూ ఈ భవనంలో అడుగెట్టిన ప్రతి మనిషిపై ప్రతీకారం తీర్చుకుంటున్నాయిట!"

"పాపం! వాళ్ళది చాలా విషాదగాథే మరి! నేను యువకుణ్ని కాను. పండు ముసలాణ్ని. వాళ్ళు నన్నేం చెయ్యలేరు. నువ్వు నిశ్చింతగా వుండు."

"ఈ నమ్మకంతోనే ఇదివరకు చాలామంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. అందులో ఒకతను కాకతాళీయంగా కొద్దిరోజులపాటు బ్రతగ్గలిగాడు. నేనతన్ని చూశాను కూడా!"

ప్రకాశరావు చుట్ట వెలిగించుకుని "అతనేమన్నాడేమిటి?" అడిగాడు నిర్లక్ష్యంగా.

"ఆ దెయ్యాలు రాత్రిపూటే తమ చర్య ప్రారంభిస్తాయట. నిదరపోతున్న వ్యక్తి అర్ధరాత్రి హఠాత్తుగా కళ్లు తెరుస్తాడుట. మరుక్షణం అతని మాట పడిపోతుందిట. ఎంత అరవడానికి ప్రయత్నించినా నోట్లోంచి అరుపు ఇవతలికి రాదుట.

తరవాత ఏదో అజ్ఞాత శక్తి ఆ వ్యక్తిని మంచంమీంచి ఎత్తి కింద పడేసిందిట. విచిత్రమేమిటంటే, అతను కాళ్ల మీద కాక, చేతులమీద తలకిందులుగా లేచి నిల్చుని, ఇల్లంతా తిరగడం ప్రారంభించాడుట.

అలా తిరిగి తిరిగి అలిసిపోయి, చివరికి తన చేతులతోనే తన గొంతు నులుముకోడం ప్రారంభించాడుట. అలా నులుముకుంటూ ప్రాణాలు పోగొట్టుకోవలసిన వాడు, అదృష్టవశాత్తూ మూర్ఛపోయాడు.

మళ్ళీ కళ్ళు తెరిచి చూస్తే, మంచంమీద దుప్పటితో సీలింగ్ ఫాన్‌కు కట్టేయబడి, తలకిందులుగా వేళ్లాడుతున్నాడుట. అంతేకాదు, రాత్రి అతను పడుకున్న మంచం, కుర్చీలూ, టేబిల్సూ, ఇంట్లోని ప్రతి సామానూ తలకిందులుగా వున్నాయిట.

వెంటనే అతన్ని హాస్పిటల్లో చేర్చారు. కాకతాళీయంగా నేనూ అవే రోజుల్లో అక్కడ అడ్మిటయి

వున్నాను. అప్పుడు చూశానతన్ని. మూడు రోజుల తరవాత అతను మరణించాడు!''

''చా.చా! నా కిప్పుడప్పుడే వాళ్ళలా చావాలనే వుద్దేశం లేదు. అంతేకాదు. చేతులమీద తలకిందులుగా నడిచే అలవాటూ నాకు లేదు. కనక, ఆ దెయ్యాల ఎక్స్పెరిమెంట్ నామీద పనికిరాదు.

ఐనవాడివి గనక, ఏదో మా క్షేమంకోరి చెయ్యవలసిన ప్రయత్నాలన్నీ చేశావ్. థాంక్స్. ఇహ మా మానాన మమ్మల్ని వదిలి ఇంటికెళ్ళు. ఇప్పటికే రాత్రి బాగా పొద్దు పోయింది. అవతల వాతావరణంకూడా బాగులేదు'' అన్నాడు ప్రకాశరావు పూర్తయిన చుట్టని ఏష్ట్రేలో నొక్కుతూ.

నిట్టూరుస్తూ లేచి నిల్చున్నాడు హృదయనాథ్. ''సరే, మీ ఇష్టం! వస్తాను. గుడ్ నైట్.'' అన్నాడు వెనుదిరుగుతూ.

అడుగులో అడుగు వేసుకుంటూ నీరసంగా ఇవతలికి వచ్చాడు హృదయనాథ్.

బైట చీకటి! ఆకాశంనిండా దట్టమైన కారు మేఘాలు కమ్మి వున్నాయి. ఆగి ఆగి ఉరుములూ, మెరుపులూ తమ ప్రత్యేకతను చూపిస్తున్నాయి. కాసేపట్లో పెద్ద వర్షం వచ్చేట్టుంది.

వడివడిగా అడుగులువేస్తూ కాంపౌండ్ గేటువైపు నడిచాడు.

గేటుముందు ఆగివుంది అతని కారు. గేటుదాటి కారు దగ్గరికెళ్ళాడు. అదే క్షణంలో తళుక్కుమంది మెరుపు.

ఆ లిప్తపాటు వెలుగులో కారు దగ్గర ఏదో ఆకారం

నిల్చున్నట్టు కనిపించి ఆదిరిపడ్డాడు.

"నేను బావా! ద్రాక్షవేణిని!!"

"నువ్వా ఇక్కడేం చేస్తున్నావ్?

"నీకోసమే ఎదురుచూస్తున్నాను బావా! నాన్నగారే మన్నారు? దారికొచ్చారా?"

హృదయనాథ్ పెదవి విరిచి, "ఆయన పట్టు ఉడుంపట్టులా వుంది. ఎంత మొత్తుకున్నా వినిపించుకోడంలేదు. మన ప్లానంతా తలకిందులైంది. ఈ ఇంటిమీదున్న ఆ భూత కల్పనలకీ, అవాకులూ చెవాకులూ చేర్చి, ఆయన ప్రయోగాలూ, చచ్చుబండలూ మాన్పించాలని మనం చేసిన ప్రయత్నాలన్నీ వమ్మయ్యాయి."

ఉన్మూరుమంది ద్రాక్షవేణి. ఆ తండ్రీ కూతుళ్ళ స్వభావాలు ఉత్తర దక్షిణ ధృవాలు. ద్రాక్షవేణికి లక్షణంగా పెళ్ళిచేసుకుని, పిల్లా పాపలతో సుఖంగా సంసారపక్ష జీవితం గడపాలనుంది.

"ప్రతి మనిషికీ కొన్ని ఆశలూ, ఆశయాలూ, దృక్పథాలూ వుంటాయి. నిజమే. తన ఆశయాలని ఒకరిమీద బలవంతంగా రుద్దే అధికారం ఆయనకులేదు. నీ వాయన కన్నకూతురివి. ఒప్పుకుంటాను, అంతమాత్రాన కోరికల్ని కూలదోసే హక్కు ఆయనకెక్కడిది?

"ఇప్పుడేం చేద్దామంటావు బావా?"

"చెయ్యాలి. ఏదో ఒకటి చేసి తీరాలి. లేకుంటే, మనం భగ్న ప్రేమికులమై జీవితాంతం కుళ్ళికుళ్ళి చావక తప్పదు. అందుకే నేనో నిర్ణయానికొచ్చాను."

"ఏమిటది?"

"అది చెప్పేది కాదు. చేసి చూపేది!" అంటూ

డోర్ తెరిచి, డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు హృదయ నాథ్.

మరుక్షణం కారు స్టార్టయి కదిలిపోయింది.

నిట్టూరుస్తూ గేటుమూసి, ఇంటివైపు నడిచింది ద్రాక్ష వేణి.

# 2

"ధాం!"

"ధాం!!"

రెండుసార్లు మారుమోగింది, పిస్తోలు పేలిన చప్పుడు. భవనమంతా!!!

మగత నిదరలో ఉన్న ద్రాక్షవేణి త్రుళ్ళిపడి లేచింది, దడదడలాడే గుండెలో, ఒక్క ఉదుటున మంచం దిగి తలుపువైపు పరిగెత్తింది.

తలుపు తెరిచి 'కవ్వ్'మంది!

"నేనమ్మా నరసయ్యని! ఆ చప్పుళ్ళు విని నిదర లేచాను."

నౌఖర్ని చూడగానే ద్రాక్షవేణి ప్రాణం కుదుట పడింది.

"ఎక్కణ్ణించి వచ్చాయి ఆ చప్పుళ్ళు?" అడిగింది వణికే కంఠంతో.

"కింద పెయోగశాలలోంచమ్మా!"

"మైగాడ్!" అంటూ మెట్లవేపు పరిగెత్తింది ద్రాక్ష వేణి.

ఇద్దరూ గబగబ కిందికిచేరుకున్నారు. లేబరేటరీ తలుపు మూసుంది.

"డాడీ!..." అంటూ తలుపు తట్టబోయింది ద్రాక్ష వేణి.

చెయ్యి పడగానే 'కిర్రు' మంటూ తెరుచుకుంది తలుపు.

లోపల చీకటి!

మందుగుండు వాసన!!

గోడ తడిమి లైటు వెయ్యబోతూ గావుకేక పెట్టింది ద్రాక్షవేణి.

"ఏయ్, ఎవరు? ఆగు!" అంటూ చీకట్లో తెరిచిఉన్న కిటికీవైపు పరిగెత్తేడు నరసయ్య.

అదే క్షణంలో ఓ నల్లని ఆకారం కిటికీగుండా అవతలికి దూకింది.

నరసయ్య వెనకాముందు యోచించకుండా ఆవేశంలో తనూ కిటికీగుండా బైటికి దూకాడు.

బైట వర్షం పడుతుంది. నేలంతా బురదమయం! మసక చీకట్లో ఆ నల్లని ఆకారం రోడ్డువైపు పరిగెత్తుతూ కనిపించింది. క్షణం వృధా చెయ్యకుండా తనూ పరుగుతీశాడు నరసయ్య.

ద్రాక్షవేణి కూడా నరసయ్య వెనుక పరుగెత్తుకు రాసాగింది. క్షణ క్షణానికి ఆ ఆకారం వాళ్ళకు దగ్గరవుతోంది.

వాళ్ళ బారినుంచి తానిక తప్పించుకోలేననుకున్నాడేమో, రోడ్డువైపు పరిగెత్తుతున్నవాడల్లా చటుక్కున చింతతోపువైపు తిరిగి, వేగం హెచ్చించేడతను.

తనూ అటు తిరగబోయి, బురద నేలలో కాలుజారి పడిపోయేడు నరసయ్య. ద్రాక్షవేణి అతన్ని సమీపించింది.

"ఇక లాభంలేదు. పద, డాడీ సంగతి చూద్దాం!" అంది

అతని భుజం పట్టి లేపుతూ.

ఇద్దరూ తడబడే అడుగులతో ఇల్లు చేరుకున్నారు.

ప్రయోగశాలలో ప్రవేశించగానే నరసయ్య గోడ తడిమి లైటు వెలిగించాడు.

గదిలో కనిపించిన భీకర దృశ్యం చూసి, గావుకేక పెట్టింది ద్రాక్షవేణి.

లోపలి వస్తువులన్నీ తల కిందులుగా పడున్నాయి. టేబిలూ, కుర్చీలూ, టెలిఫోన్‌లతో సహా గోడమున్న పటాలు సైతం తిరగవేసి ఉన్నాయి.

అన్నిటికన్నా దిగ్భ్రాంతి కలిగించే విషయం, ప్రొఫెసర్ ప్రకాశరావు శరీరం, ఓ గోడవారగా తలకిందులుగా నిటారుగా నిల్చునుంది, శీర్షాసనం వేసినట్టు!

కళ్ళు యేదో భీభత్స దృశ్యం చూస్తున్నట్టు బైటికి ఉబికి వచ్చివున్నాయి. సరిగ్గా గుండెదగ్గర రెండు రంధ్రాలు. ఆ రంధ్రాల గుండా స్రవించి, నేలమీద మడుగుకట్టిన రక్తం!

ఆయన కుడిచేతిలో నిగనిగ మెరుస్తున్న రివాల్వర్. అదికూడా తిప్పి పట్టుకోబడింది ఆత్మహత్య భంగిమలో.

ఆయన ఆత్మహత్య చేసుకున్నాడా? ఎందుకు? ఏమిటీ విపరీత సంఘటన? దిగ్భ్రాంతినించి తేరుకోగానే, పసిపిల్లలా ఏడుస్తూ శవం దగ్గరికెళ్ళబోయింది ద్రాక్షవేణి.

నరసయ్య వెంటనే ఆమె భుజం పట్టి ఆపి, "వద్దమ్మా! త్వరగా పోలీసులకి ఫోన్ చెయ్యండి. వాళ్ళు వచ్చేవరకూ శవాన్ని అట్టాగే ఉండనివ్వండి!" అంటూ ఆమెని పొదివి పట్టుకుని హాల్లోకి తీసుకొచ్చాడు.

అప్పుడుగానీ ఆమెకు గుర్తురాలేదు తన తక్షణ కర్తవ్యం ఏమిటో.

గబగబ టెలిఫోన్ డైరెక్టరీ తిరగేసి, పోలీస్ హెడ్ క్వార్టర్స్ నెంబర్ కనుక్కుని, తక్షణం తెలియజేసింది వాళ్లకి, జరిగిన విషయం!

# 3

గంట లోపల ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డీ, సార్జంట్ డేవిడ్, నలుగురు కానిస్టేబుళ్లతో సహా, అంబులెన్స్ వచ్చి ఆగింది ఇంటిముందు.

డాక్టరూ, ఫోటోగ్రాఫరూ, ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్సూ అందరూ బిలబిల లోనికి వచ్చారు.

ద్రాక్షవేణి వాళ్ళకి శవం ఉన్న గది చూపించి, మళ్ళీ ఆ దృశ్యం చూసే ధైర్యం లేక, హాల్లోనే కూర్చుండి పోయింది. నరసయ్య వెంట అందరూ ప్రయోగశాలలో కెళ్ళారు.

లోపల వాళ్ళ హడావుడీ, మాటలూ వినిపిస్తున్నా యామెకి.

పది నిమిషాల తరవాత ఇన్‌స్పెక్టర్ గబగబ ఆమెని సమీపించి, "మీరొకసారి లోపలికొస్తారా?" అడిగాడు ఆత్రుతగా.

ద్రాక్షవేణి త్రుళ్ళిపడి, "ఏం జరిగింది?" అంటూ లేచి నిల్చుంది.

"ఎలా చెప్పాలో అర్థంకావడంలేదు. నా సర్వీసులో యింతవరకూ యిలాంటి వైచిత్ర్యం చూళ్లేదు. రండి. ఒకసారి వచ్చి చూడండి!"

ద్రాక్షవేణి హడావుడిగా అతనితో లేబరేటరీలో అడుగుపెట్టి నిర్ఘాంతపోయింది!

ఎదురుగా కనిపిస్తున్న శవం తన తండ్రిదేనా అన్న మీమాంసతో చూస్తున్నాయి ఆమె కళ్ళు, రెప్ప వెయ్యకుండా!

"ఇన్‌స్పెక్టర్ గారూ! ఏమిటీ మాయ? నేనూ, నర సయ్యా చూసినప్పుడు..."

"రండి బైట కూర్చుందాం!" అంటూ ఆమెని హాల్లోకి తీసుకొచ్చాడు రాజా రెడ్డి.

సోఫాలో చతికిలబడ్డాక చెప్పసాగాడు. "శవాన్ని మీరు ఏ రెండుగంటల క్రితమో చూసుంటారు. నేను పది నిమిషాల క్రితం చూశాను. అంతవరకూ మీ నాన్నగారి జుత్తు తెల్లగానే ఉంది.

తరవాత మేము చూస్తుండగానే కొద్దికొద్దిగా నల్ల బడడం ప్రారంభించింది. మేమంతా ఆశ్చర్యంగా చూడ సాగాం! పది నిమిషాల్లోనే జుత్తంతా పాతికేళ్ళ యువ కుడిలా నల్లబడిపోయింది' ఇప్పుడు చెప్పండి ఈ రాత్రి మీ ఇంట్లో యేం జరిగింది?"

ద్రాక్షవేణి దాచకుండా, మొదటినించీ చివరివరకూ జరిగిందంతా అతనికి వివరించింది.

"ప్రొఫెసర్ గారు ఈమధ్య ఏదైనా ప్రముఖవిషయం మీద ప్రయోగాలు జరుపుతున్నారా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ అంతా విన్నాక.

"ఒకటి కాదు. రెండు ప్రయోగాలు! వాటి గురించి డాడీ నాకింకా పూర్తి వివరాలు చెప్పలేదు. మహాబలి పురంలో ఉన్నప్పుడే ఆయన ఆ ప్రయోగాలు ముగించే రుట. అవి అత్యంతనూతనమైన రెండు కొత్త కెమికల్స్‌కు సంబంధించినవని మాత్రం చెప్పేరు నాతో..." ద్రాక్ష వేణి మాట ఇంకా పూర్తికాలేదు.

అంతలో సార్జంట్ డేవిడ్ హడావుడిగా అక్కడికి వచ్చి, "సార్! ఈ ఇంటికి ఫర్లాంగు దూరంలో ఉన్న

మెయిన్ రోడ్డుమీద ఓ ఫియట్ కారు ఆగి ఉంది. కార్లో ఎవ్వరూ లేరు" అన్నాడు.

ఇన్ స్పెక్టర్ భృకుటి ముడిపడింది. "చూద్దాం రండి!" అంటూ లేచి బైటికి నడిచాడు.

ద్రాక్షవేణి కూడా వాళ్ళ ననుసరిస్తూ రోడ్డును సమీపించింది.

చీకట్లో రోడ్డుపక్క ఆగివుంది కారు. ఇన్ స్పెక్టర్ ఆ కారుమీద టార్చి వెయ్యగానే ద్రాక్షవేణి అదిరిపడింది.

"ఇది ఎవ్వరిదో తెలుసా మీకు?" అడిగాడు ఇన్ స్పెక్టర్ ఆమె వాలకం చూసి.

"తెలుసు! మా బావ హృదయనాథ్ కారు. ఎలా వచ్చిందిక్కడికి? బావ తొమ్మిది గంటలకే, నా కళ్ళ ముందే ఇక్కణ్ణించి వెళ్ళిపోయాడే!" అంది ద్రాక్షవేణి ఆశ్చర్యంగా.

అప్పుడు జ్ఞాపకం వచ్చాయి ఆమెకి, హృదయనాథ్ అన్న చివరి మాటలు. 'చెయ్యాలి! ఏదో ఒకటి చేసి తీరాలి. లేకుంటే మనం భగ్నప్రేమికులమై జీవితాంతం కుళ్ళి కుళ్ళి చావక తప్పదు. అందుకే, నేనో నిర్ణయాని కొచ్చాను...'

సాలోచనగా తలూపాడు రాజారెడ్డి. "కేసు చాలా తొందరగా తేలిపోయింది. దీని కంతటికీ మూలకారకుడు హృదయనాథ్ అన్నమాట! మీ నాన్నగార్ని, ఆయన పిస్తోలుతోనే చంపి, ఆ పని దెయ్యాలు చేసినట్టు నమ్మించడానికి, శవంతోబాటు వస్తువులన్నీ తలకిందులు చేశాడు.

నరసయ్యా, మీరూ లేబొరేటరీలో ప్రవేశించగానే, చీకట్లో కిటికీ దూకి పారిపోయాను. మనుషుల్ని చూసి, దెయ్యాలు పారిపోవనీ, అదృశ్యమౌతాయనీ పాపం అతనికి తెలీదు కాబోలు. మీరూ నరసయ్యా అతన్ని వెంబడించేసరికి, ఎక్కడ పట్టుబడతానో అని చింతలో పులాకి పారిపోయాడు.''

''బావ ఇంతపని చేశాడంటే, నేను నమ్మలేకుండా ఉన్నాను'' అంది నీరసంగా ద్రాక్షవేణి.

''రండి!'' అంటూ యింటివైపు దారి తీసాడు ఇన్‌స్పెక్టర్.

అప్పటికే ఫోటోగ్రాఫర్స్, ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్స్ తమ తమ పనులు పూర్తిజేశారు. పరీక్ష నిమిత్తం ద్రాక్షవేణి వేలిముద్రలూ, నరసయ్య వేలిముద్రలూ, కార్లోని ముద్రలూ తీసుకోబడ్డాయి.

అప్పుడే మెరుపులా ఓ విషయం తట్టింది ఇన్‌స్పెక్టర్‌కు.

ద్రాక్షవేణిని సమీపించి, ''ఈమధ్య మీ నాన్నగారు కొత్త కెమికల్స్ గురించి పరిశోధన జరిపారన్నారు కదూ? ప్రతి సైంటిస్టూ తాను జరిపిన ప్రయోగాలగురించి యెప్పటికప్పుడు వివరాలు రాసిపెట్టుకుంటాడు. ఆయన జరిపిన ఆ రెండు పరిశోధనల గురించికూడా వివరాలుండి తీరాలి. ఒకసారి వాటిని చూపిస్తారా నాకు...?'' అడిగాడు.

''తప్పకుండా! డాడీ తన ప్రయోగాలగురించి కేవలం రంగు డైరీలో నోట్ చేసి పెట్టుకునేవారు. అది సైన్సు పరిభాష, సామాన్యుల కర్థంకాదు. లేబొరేటరీలోనో,

ఆయన గదిలోనో ఉండివుంటుంది ఆ డైరీ!"

అందరూ కలిసి లేబొరేటరీ, ప్రకాశరావు గదీ అణు వణువూ శోధించారు. డైరీ జాడ లేదు!

"నా అనుమానం నిజమే అయింది. హంతకుడు ఆ డైరీతో సహా పరారయ్యాడు" అన్నాడు ఇన్స్పెక్టర్ సాలోచనగా తలూపుతూ.

"బావ ఇంత ఘాతుకానికి పాల్పడ్డాడంటారా?" అంది ద్రాక్షవేణి అప్రతిభురాలై.

"అతని సంగతి మాకొదిలేయండి. మీరు నరసయ్యతోడున్నాడు. నిర్భయంగా ఉండండి. వీలైతే మళ్ళీ నేను వస్తాను..." అన్నాడు రాజారెడ్డి ఆమెకి ధైర్యం చెబుతూ.

ప్రొఫెసర్ శవం అంబులెన్స్‌లోకి చేర్చబడింది. రోడ్డు మీద ఆగివున్న ఫియెట్ కారుతో సహా, మద్రాసుకు తరలివెళ్ళింది పోలీస్ బలగం!

బితుకు బితుకుమనే ఆ బంగళాలో నరసయ్యా, ద్రాక్షవేణీ మిగిలిపోయారు శోకదేవతల్లా.

అప్పటికే రాత్రి రెండు గంటలు దాటింది!

## 4

సార్జంట్ డేవిడ్‌నీ, వేలిముద్రల నిపుణుణ్ణీ వెంట బెట్టుకుని హృదయనాథ్ యింటికెళ్ళాడు రాజారెడ్డి.

వాళ్ళ యిల్లు కనుక్కోవడం కష్టంకాలేదు. అయితే తలుపుకి తాళం వేళ్ళాడుతోంది.

మాస్టర్ కీతో దాన్ని తెరిచి లోనికెళ్ళారు. వేలిముద్రల నిపుణుడు చకచక ఇంట్లో ఉన్న వస్తువులమీది వేలిముద్రలు తీసుకున్నాడు.

సార్జంట్, ఇన్‌స్పెక్టర్ కలిసి యిల్లంతా సోదా చేశారు. ఏమీ దొరకలేదు.

ఇంటికి యథాతథంగా తాళంవేసి, హెడ్‌క్వార్టర్స్ చేరుకున్నారు.

గంటలోపల ఫింగర్ ప్రింట్స్ రిపోర్టు అందింది. లేబొరేటరీ కిటికీమీద లభించిన మూడు జతల వేలిముద్రల్లో రెండు ద్రాక్షవేణివీ, నరసయ్యవీ, మూడోజత హృదయనాథ్ వేనని స్పష్టమైంది!

అప్పుడు తట్టింది ఇన్‌స్పెక్టర్‌కు ఓ ఆలోచన

"సార్జంట్! మనం హృదయనాథ్ చేతిలో మరో హత్య జరక్కుండా చూడవలసి ఉంది!" అన్నాడు గంభీరంగా.

"మరో హత్యా!"

"ఔను! అతనిప్పుడు నరసయ్యని హత్యచేసే అవకాశాలున్నాయి. దేనికో తెలుసా? ప్రొఫెసర్ హత్యానంతరం, నరసయ్య అతన్ని వెంబడించేడు. అతను హృదయనాథ్ వెంటబడకపోంటే, అతను కారెక్కి పారిపోయేవాడే!

ఆ కారువల్లేకదా మనకతని గురించి తెలిసింది? తన పథకం పారకుండా చేసిన నరసయ్యమీద అతను పగ తీర్చుకోవచ్చు. నరసయ్య సాక్ష్యాన్ని నిర్మూలించవచ్చు..."

ఇన్‌స్పెక్టర్ మాట పూర్తికాకముందే, బల్లమీది ఫోన్ మోగింది.

"ఎస్! ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి స్పీకింగ్!"

"నేను ద్రాక్షవేణిని మాట్లాడుతున్నానండీ!"

"ఏం జరిగింది? ఎందుకంత ఖంగారుపడుతున్నారు?"

"నరసయ్యా నెవ్వరో ఎత్తుకుపోయారు. అతను రాత్రి నా గదిముందు తలుపుదగ్గర పడుకున్నాడు. తెల తెలవారుతుండగా బైటికొచ్చి చూస్తే, నరసయ్యా పడుకున్నచోట రక్తపు మరకలు కనిపించాయి.

అంతేకాదు. ఓ ఉత్తరంకూడా పడుంది. మీరు తక్షణం బైలుదేరి రండి. నాకు చచ్చే భయంగా ఉంది క్కడ!" అవతల ద్రాక్షవేణి కంఠం వణుకుతోంది.

"ఇప్పుడే వస్తున్నాం!" అంటూ రిసీవర్ని దించి, సార్జంట్‌తో హుటాహుటిన బైలుదేరాడు ఇన్‌స్పెక్టర్.

అరగంటలో కేరుకున్నా రక్కడికి!

ద్రాక్షవేణి ఇన్‌స్పెక్టర్‌కు ఆ ఉత్తరం చూపెట్టింది.

హాండ్ రైటింగ్ గుర్తుపట్టకుండా ఎడంచేత్తో గజిబిజిగా రాసినట్టుంది ఉత్తరం! మూడే మూడు పంక్తులున్నాయి.

"అతి తెలివికిపోతే, ఎటువంటి అనర్థాలు దాపురిస్తాయో నరసయ్యాద్వారా గుణపాఠం నేర్చుకోవాలి. వాణ్ణి చిత్రవధచేసి చంపుతాను!"

ఉత్తరం చదివి, సాలోచనగా తలూపాడు. ఇన్‌స్పెక్టర్. "నిద్రపోతున్న మనిషిని తలమీద బాది, మూర్ఛపోగొట్టి తీసుకెళ్ళుంటాడు. ఇక మీరక్కడుండటం ప్రమాదం! హృదయనాథ్ ఇల్లు ఖాళీగా ఉంది. కేసు ముగిసేవరకు మీ రక్కడుంటే ప్రమాదంలేదు. ఆ ఇంటిమీద ఇద్దరు కానిస్టేబుళ్ళ నిఘా యేర్పాటు చేస్తాను."

ద్రాక్షవేణికి తలూపింది.

ఆ భవనాని సీలువేసి బయలుదేరారు.

అరగంటలో మద్రాసు చేరుకుని, హృదయనాథ్ ఇంటిముందు జీప్ దిగారు. ఇంటి తలుపుముందు, మెట్ల మీద ఓ ముసలాడు కూర్చునున్నాడు, చుట్ట కాలుస్తూ.

"ఎవరు నువ్వు? ఇక్కడేం జేస్తున్నావ్?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"నేను .. యర్ గారి దగ్గర పనిచేస్తున్నానండి. ఇంటికి తాళంవేసి ఆయనెక్కడికో వెళ్ళినట్టున్నారు. పొద్దుట్నించీ యెదురుచూస్తున్నానండి. ఇంకా రాలేదు."

"నీ పేరేమిటి?"

"నారాయణండి!"

ఇన్స్పెక్టర్ ద్రాక్షవేణివైపు తిరిగి, "మీకు నౌఖరు ప్రాబ్లమ్ తీరిపోయింది. ఇతను మీ అవసరాలు చూస్తాడు. నిశ్చింతగా ఉండండి" అంటూ ఆ ముసలాడికి చెప్పాడు. "ఈ అమ్మగారు యిక్కడే ఉంటారు. మీ అయ్యగారొచ్చేవరకూ యీమెని కనిపెట్టుకుని ఉండు! తెలిసిందా?"

నారాయణ తలూపాడు.

ఇన్స్పెక్టర్ మాస్టర్ కీతో తాళం తెరిచి, ద్రాక్షవేణిదగ్గర సెలవుతీసుకుని జీపెక్కాడు.

# 5

ఇన్స్పెక్టర్ బుర్ర తీవ్రంగా ఆలోచిస్తోంది. పోలీసుల బారినుంచి తప్పించుకు తిరిగే నేరస్తులకు ఆశ్రయం కల్పించి, వాళ్ళచేత చాకచక్యంతో తమ కార్యకలాపాలు జరిపించుకునే ఒక రహస్య సంస్థ పనిచేస్తోంది మద్రాసులో.

దాని పేరు 'సెర్చిలైట్!'

ఆ సంస్థ సభ్యులకు పేర్లుండవు. నెంబర్లతో వ్యవహారిస్తారు. ఆ సంస్థను నడిపే లీడర్ని యితర్లే కాదు, అందులోని సభ్యులే ఇంతవరకూ చూల్లేదు.

వాళ్ళకు తెలిసిందల్లా ఓ. ఫోన్ నెంబర్. ఫోన్లోనే వాళ్లకు ఆదేశాలివ్వబడతాయి.

ఇన్ స్పెక్టర్ రాజా రెడ్డికూడా అందులో ఒక సభ్యుడు. మారువేషంలో, మారుపేరుతో చాకచక్యంగా అందులో సభ్యత్వం సంపాదించి, వారిలో ఒకడిగా మసులుతూ, పోలీసుల కన్నుగప్పి అక్కడ ఆశ్రయం పొందేవారి కూపీలూ, ఆ సంస్థ కార్యకలాపాలూ గమనిస్తూ, అవసరమైనప్పుడు ఇన్ స్పెక్టర్ రూపంలో మెరుపుదాడి జరిపి, కావలసినవాళ్లని పట్టుకుంటున్నాడు.

లాయర్ హృదయనాథ్నికూడా వాళ్ళు తమ ఆశ్రయంలోకి తీసుకున్నారా? ఈ ఆలోచన రాంగానే హెడ్ క్వార్టర్స్నించి హుటాహుటిన యింటికి బయలుదేరాడు ఇన్ స్పెక్టర్.

ఇంట్లో తలుపులు మూసుకుని, బీరువాలోంచి మేకప్ బాక్స్ తీశాడు. అందులో రకరకాల విగ్గులూ, గెడ్డాలూ, మీసాలూ, ఇతర మేకప్ సామానూ ఉన్నాయి.

మిర్రర్ ముందు కూర్చుని చకచక మేకప్ ప్రారంభించాడు. గంటలోపల మనిషి పూర్తిగా మారిపోయాడు. భుజాలవరకు యెదిగిన హిప్పీజుత్తు. దట్టమైన కనుబొమలు. కిందికి వంగిన గుబురు మీసాలు. చెవి కిందా, ముక్కు మీద కత్తిగాట్లు!

ఇప్పుడతన్ని ఇన్ స్పెక్టర్ రాజా రెడ్డి అంటే ఎవ్వరూ నమ్మలేరు. బట్టలు మార్చుకుని, ఓ బ్రీఫ్ కేస్లో కావలసిన

సామాను సర్ది, యింటికి తాళం వేసి రోడ్డుమీదికి వచ్చాడు.

"ఎంగేసార్?" అడిగాడు డ్రైవర్.

"హోటల్ మయూర!"

టాక్సీ కదిలింది.

పావుగంటలో మయూర ముందు ఆగింది.

మీటర్ డబ్బులిచ్చి లోనికి నడిచాడు.

"హలో మిస్టర్ అరుణ్! ఇదేనా రావడం? చాలా రోజులు పట్టింది ఈసారి!" పలకరించాడు మేనేజర్ అతన్ని చూడగానే.

"పనిమీద సింగపూర్ వెళ్ళాను. ఇంతవరకూ అక్కడే వున్నాను. మీ అద్దె డబ్బులు ప్రతినెలా ముడుతున్నాయి కదా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ.

"అద్దె చెల్లించడంలో మీ వెనకే అందరూ! ఠంచనుగా ముడుతున్నాయి. థాంక్స్! కాఫీ తీసుకుంటారా?"

"నో థాంక్స్!" అంటూ బ్రీఫ్‌కేస్‌తో మెట్లవైపు నడిచాడు ఇన్‌స్పెక్టర్. రెండో అంతస్థులో ఉన్న రూం నెంబర్ 22 ముందాగాడు. జేబులోంచి తాళంచెవి తీసి, లాక్ తెరిచి లోనికి నడిచాడు.

తన సెర్చ్‌లైట్ కార్యకలాపాలకోసం, గత ఏడాది నించీ అరుణ్ పేరుతో ఆ గది అద్దెకి తీసుకున్నాడు. గది అవసరం యెప్పుడోగానీ కలగదు. ఐనా, ప్రతినెలా అద్దె చెల్లిస్తున్నాడు.

తలుపు మూసి, టెలిఫోన్ వైపు నడిచాడు. ఆలోచిస్తూ ఓ నెంబర్ రింగ్ చేశాడు..

"హలో, ఎవరు మాట్లాడుతోంది?" అవతలినుంచి వినిపించింది ఓ పురుష కంఠం.

"నేను బాస్! మీ పాత సేవకుణ్ణి. నెంబర్ టూని...!"

"నువ్వా! ఇంతకాలం ఏమయ్యావ్? నీకోసం ఎంత వెతికించానో తెలుసా? హఠాత్తుగా యెక్కణ్ణించి ఊడిపడ్డావ్?"

"సారీ బాస్! మీతో చెప్పకుండా అనుకోకుండా సింగపూర్ వెళ్ళిపోయాను. ఇంత వరకూ అక్కడే ఉన్నాను."

"పెద్ద చెయ్యే కొట్టావన్నమాట! ఏమాత్రం దొరికిందేమిటి?"

"ఏదో దొరకడం అటుంచి, ప్రాణాలు పోగొట్టుకునే పరిస్థితి వచ్చింది. అతి కష్టంమీద బైటపడగలిగేను."

"ఇప్పుడైనా నీకు బుద్ధొచ్చిందనుకుంటాను. నేను చెప్పని పనులు నెత్తినేసుకుంటే ఏమౌతుందో తెలిసిందిగా? ప్రస్తుతం నీకు డబ్బవసరం చాలా ఉందనుకుంటాను. సమయానికి వచ్చావ్. ఓ కొత్తపని రెడీగా వుంది నీకోసం! విజయవంతంగా ముగించావంటే, ఏభై వేలు ముడతాయి. ఏమంటావ్?"

"ఇప్పుడు నాకు పదిరూపాయలుకూడా ఎంతో విలువైనవి బాస్! చెప్పండి. ఏమిటాపని?"

"చెవులు రిక్కించి విను! అజంతా హోటల్లో, రూం నెంబర్ పదహారులో ఓ వ్యక్తి ఉన్నాడు. వాడి పేరు జో గేంధర్! మన సంస్థ మాజీ సభ్యుడే.

ఏడాది క్రితం వాణ్ణి విలువైన ఓ రహస్యం కనిపెట్టడానికి నియమించాను. ఈమధ్యే వాడా రహస్యం చేజిక్కించుకోగలిగాడు. అప్పుడు తిరిగింది కథ అడ్డం!

ఆ రహస్యం చేజిక్కగానే వాడి మనసు మారిపోయింది. దాన్ని పొందాలనుకుంటే నాలుగులక్షలు చెల్లించవలసి ఉంటుందనీ, లేదా, దాన్ని ఇతర్లకి అమ్మేస్తాననీ ఫోన్ చేశాడు వాడు.

అప్పుడు నా రక్తం యెలా మరిగి వుంటుందో నీవే ఊహించుకోవాలి. విధిలేక అప్పటికి సరేనని, మరో సభ్యుడిద్వారా డబ్బు పంపి, వాడా రహస్యం యిచ్చిన మరుక్షణం మట్టుబెట్టి, డబ్బుతో తిరిగిరమ్మని పురమాయించాను.

వెళ్ళిన ఆ సభ్యుడు మళ్ళీ తిరిగి రాలేదు. కొంపదీసి నా పథకం తారుమారు కాలేదుకదా? జోగేంధరే అతన్ని చంపి, డబ్బు కాజెయ్యలేదు కదా?''

''అర్థమైంది బాస్! ఆ సందేహాలు తీర్చుకోడానికే నన్ను నియమిస్తున్నారన్నమాట. నిశ్చింతగా ఉండండి. నా శాయశక్తులా ప్రయత్నించి, ఆ రహస్యాన్ని సంపాదిస్తాను. అంతేకాదు, జోగేంధర్నికూడా సఫాజేసి పారేస్తాను. ఇంతకీ, ఆ రహస్యం యేమిటో నాకు తెలియందే ఎలా కనుక్కోమంటారు దాన్ని?''

''అదొక నల్లరంగు డైరీలో నిక్షిప్తమై ఉంది. దాని కవరుమీద బంగారు రంగుతో 'పి'అనే అక్షరం ముద్రించి ఉంటుంది!''

ఇన్స్పెక్టర్ ఆలోచలు తీవ్రరూపం దాల్చాయి. ద్రాక్షవేణి చెప్పిన డైరీ రంగుకూడా నలుపే! 'పి' అంటే ప్రకాశరావు కాదుకదా?

ఆ హత్యకీ, ఈ సంస్థకీ సంబంధం లేదుకదా? కాక తాళీయం అంటే ఇదే కాబోలు. జోగేంధర్ ఎవ్వరు? ఆ

డైరీ వాడిదగ్గరి కెలా వచ్చింది? హృదయనాథ్ ఏమయ్యాడు?

ఆలోచిస్తూ, "ఓ. కే, బాస్! వాణ్ణి చంపి, ఆ డైరీ, మీ డబ్బూ రెండు సంపాదిస్తాను. నా ఫోన్ కోసం ఎదురుచూడండి."

"విష్ యూ బెస్టాఫ్ లక్!"

రిసీవర్ దించి, బ్రీఫ్ కేస్ తెరిచాడు ఇన్స్పెక్టర్. మారు తాళాలు అందుకుని జేబులో వేసుకుంటూ బైటికి నడిచాడు.

## 6

హోటల్ అజంతాముందు టాక్సీదిగి, డ్రైవర్ కు డబ్బిచ్చేసి లోనికి నడిచాడు.

థర్డ్ ఫ్లోర్ లో రూం నెంబర్ 16 కనుక్కోడం కష్టం కాలేదు.

తలుపు మూసుంది. కాస్త పరీక్షగా చూసాక, లాక్ వేసున్నట్టు స్ఫురించింది.

అంటే, జోగేంధర్ గదిలో లేడన్నమాట. మంచిదే. వాడు తిరిగివచ్చాక మెరుపుదాడి చెయ్యొచ్చు. మాస్టర్ కీతో లాక్ తెరిచి గదిలో ప్రవేశించాడు. గదిలో సూది పడితే వినిపించే నిశ్శబ్దం!

తిరిగి తలుపుమూసి, లోపలినుంచి యథాతథంగా లాక్ వేశాడు. టేబిల్ మీద రెండుసూట్ కేసులున్నాయి. జోగేంధర్ వచ్చేలోగా ఒకసారి గదంతా వెతికి చూడాలి.

సూట్ కేసులు తెరిచి క్షుణ్ణంగా చెక్ చెయ్యసాగాడు. నిత్యావసర వస్తువులు తప్ప మరేం లేవందులో. రహస్య అరల్లాటివికూడాలేవు. మంచం, పరుపూ, దిళ్ళూ, టేబిలూ,

కుర్చీలూ గదిలో ఉన్న సామానంతా గాలించాడు. ఏమీ కనిపించలేదు. ఇహ బాత్‌రూం ఒక్కటే మిగిలింది. తృప్తికోసం అదికూడా వెతకడం మంచిది.

బాత్‌రూంవైపు నడిచాడు. తలుపు మూసుంది. పిడి తిప్పి తోశాడు.

కిర్రుమంటూ తెరుచుకుంది. లోన అడుగు పెట్టి కొయ్యబారిపోయాడు.

వేరొకరైతే ఆ దృశ్యం చూసి, కెవ్వుమనే వారే!

నేలమీద బోర్లా పడుంది శవం!!

ఫుల్ సూటులో ఉన్న పురుషుడి శవం!!!

కణతలో పిస్తోలుగుండు చేసిన రంధ్రం కనిపిస్తోంది. చటుక్కున మోకాళ్ళమీద కూర్చుని, శవాన్ని వెల్లకిలా తిప్పాడు. అతను చనిపోయి చాలా సేపైనట్టుంది. శరీరం కర్రలా బిగుసుకుపోయింది.

ఇన్స్‌పెక్టర్ యింకా ఆ షాక్‌లోంచి తేరుకోకముందే బాత్‌రూం తలుపు దభీమంటూ మూసుకుంది వెనుక! పక్కలో పిడుగుపడ్డట్టు, అదిరిపడి వెనుదిరిగాడు. అదే క్షణంలో, అవతలి తలుపుకూడా మూసుకున్న చప్పుడు వినిపించింది!

ఎవ్వరు? లోగేంధరా? నిశ్శబ్దంగా లోనికి వచ్చి తనని చూడగానే తలుపులు మూసి పారిపోయాడా? ఇప్పుడు తనిక్కడుండటం తన ఉనికికే ప్రమాదం!

వాడు తనని ఈ హత్య గొడవలో ఇరికించడానికి, స్థానిక పోలీసులకు ఫోన్ కేసినా చెయ్యొచ్చు. అప్పుడు తన మారువేషం బైటపడే ప్రమాదముంది. శవాన్ని సోదా జేసి, ఎంత త్వరగా ఇక్కణ్ణించి జారుకుంటే అంత మంచిది.

గబగబ శవం దుస్తులు వెతకసాగాడు. కోటు లోపలి జేబులో వెడల్పాటి వస్తువేదో ఉన్నట్టు తగిలింది వేళ్లకి. వెంటనే దాన్ని ఇవతలికి లాగేడు.

అది డైరీ!

నలుపురంగు డైరీ!!

దానిమీద 'పి' అక్షరం చూడగానే రాజారెడ్డి ప్రాణం లేచి వచ్చింది. ఆతృతగా డైరీ పేజీలు తిరగేసి చూసాడు.

ఖాళీ! ఏమీ లేవు!!

డైరీలోంచి అనేక పేజీలు చింపేసినట్టుంది. అంటే, జోగేంధర్ అందులోని ముఖ్యమైన కాగితాలన్నీ చింపుకుని, బాస్ పంపిన ఈ మనిషిని చంపి, ఖాళీ డైరీ శవం జేబులో పడేశాడా?

ఆలోచిస్తూ బాత్‌రూం తలుపుని సమీపించాడు. అదృష్టవశాత్తూ బాత్‌రూం తలుపులకు డోర్ లాక్స్ గానీ, అవతల గడియలు గానీ వుండవు గనక, నిశ్చింతగా పిడి తిప్పి తలుపు తెరిచి గదిలో అడుగు పెట్టాడు.

అప్పుడు వినిపించింది, బయట పోలీసు వ్యాన్ సైరన్!...

అనుకున్నట్టే జోగేంధర్ పోలీసులకి ఫోన్ చేశాడన్న మాట. వెంటనే పారిపోవాలి.

మెరుపులా గది తలుపును సమీపించి, మాస్టర్ కీతో తాళం తెరిచి, వరండాలో అడుగుపెట్టాడు. అలోగా, పోలీసులు పైకి పరిగెత్తుకువస్తున్నట్టు మెట్లమీద బూట్ల శబ్దం మారుమోగసాగింది.

ఆ మెట్లు తప్ప మరోదారి లేదు హోటల్లోంచి బయట పడటానికి.

జేబులోంచి పిస్తోలు తీస్తూ, పక్క గదివైపు గెంతేడు. పిడి తిప్పి తలుపు తోసేడు. తెరుచుకుంది. పిస్తోలు రెడీగా పట్టుకుని లోన అడుగుపెట్టాడు.

డ్రెస్సింగ్ టేబిల్ ముందు నలభైయేళ్ళ స్త్రీ కూర్చుని మేకప్ చేసుకుంటోంది. తలుపు చప్పుడు విని, చటుక్కున వెనుదిరిగింది. చేతిలో పిస్తోలుతో తలుపుమూస్తున్న ఇన్స్‌పెక్టర్‌ని చూడగానే ఆమె కనుబొమలు ముడిపడ్డాయి.

"ఏం, పట్టపగలే దొంగతనానికొచ్చావా?" అడిగింది చాలా నింపాదిగా.

ఆమె నిశ్చలతకి నివ్వెరబోయాడు ఇన్స్‌పెక్టర్!

మరో ఆడదైతే, పరాయి మగాడలా గదిలోకి దూరగానే గావుకేకలు పెట్టి, నానా గోల చేసేది.

"షటప్! నేను చెప్పినట్టు విన్నావంటే నీకేం భయం లేదు. నేను దొంగని కాను!"

"దొరవా! భయపడుతున్నదెవరు? నువ్వా? నేనా?" అంది ఆమె చెంపలకి గులాబీ రంగు అద్దుకుంటూ.

"పరాచికాలకిది సమయంకాదు. గదిలో నువ్వొక్కరివే ఉన్నావా?" అడిగాడు ఇన్స్‌పెక్టర్ బాత్‌రూం వైపు చూస్తూ.

"కొద్ది నిమిషాల క్రితంవరకూ ఒక్కదాన్నే ఉన్నాను. ఇప్పుడు నువ్వొచ్చావుగా?"

"ఇంతక్రితమే నేనో హత్య చేశాను. ఇప్పుడు రెండో హత్య చెయ్యడం నాకు కష్టం కాదు. హంతకుల్ని రెండుసార్లు ఉరి తీయరు. తెలిసిందా?"

ఆమె ఏదో అనబోయింది. అదేక్షణంలో బైట పోలీ

సుల అడుగుల శబ్దం ఉధృతమయింది. బహుశా వాళ్ళు శవంవున్న గదిలో ప్రవేశించి ఉంటారు.

తరవాత, హంతకుడికోసం హోటల్లోని గదులన్నీ గాలిస్తారు.

ఆమె కూడా పోలీసుల రాక పసిగట్టి ఉంటుంది. "నువ్వింక తప్పించుకోలేవు. పోలీసులు నీకోసం గాలిస్తూ, కాసేపట్లో యిక్కడికి వచ్చేస్తారు!" అంది చాలా నింపాదిగా.

"అప్పుడు వాళ్ళకీ గదిలో రెండు శవాలు దొరుకుతాయి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

రెండు శవాలా? ఎవరివి?"

"ఇంకెవరివి? మనిద్దరివి!"

"నువ్వు చావదలచుకుంటే చావడానికి నాకేం అభ్యంతరం లేదుగానీ, నే నిప్పుడప్పుడే చావదలచుకోలేదు!"

"ఐతే, బుద్ధిగా చెప్పినట్టు చెయ్! కాసేపు నువ్వు నా భార్యగా నటించాలి! నీ పేరేమిటి?"

ఆ ప్రశ్నతో ఆమె ముహం జేవురించింది. "సెర్చ్‌లైట్ సభ్యులు తమ పేర్లు బైట పెట్టకూడదని తెలీదా నీకు?" అంది గంభీరంగా.

"నువ్వు సెర్చ్‌లైట్ సభ్యురాలివా?" అన్నాడు ఇన్స్పెక్టర్ దిగ్భ్రాంతితో.

ఆమె తలూపి, "నీకేదైనా ప్రమాదం వాటిల్లితే ఆదుకోడానికి బాస్ పంపేడు నన్ను. ఇంతకీ నీపనేమైంది?" అడిగింది కుతూహలంగా.

ఇన్‌స్పెక్టర్ పెదవి విరిచి "ఆ గేంగ్‌స్టర్ మనకంటే మూడాకులు యెక్కువ చదివినట్టున్నాడు. బాస్ పంపిన మనిషిని చంపి, ఆ డైరీలో ఉన్న కాగితాలన్నీ చింపు

కుని పరారయ్యాడు. నేను వెంటనే బాస్‌కు రిపోర్టివ్వాలి!''
అంటూ తలుపువైపు నడిచాడు.

# 7

మయూర హోటల్ చేసుకోగానే, తన గదిలో ప్రవేశించి, గబగబ టెలిఫోన్ వైపు నడిచాడు రాజారెడ్డి. ఆ సీక్రెట్ నెంబర్ రింగ్ చేసి, రిసీవర్ అందుకున్నాడు.

''ఎస్, స్పీకింగ్!...'' బాస్ కంఠం వినిపించింది అవతల.

''నేను! నెంబర్ టూని బాస్!!''

''పని సక్సెస్ అయిందా?''

''క్షమించండి. జోగేంధర్ నన్ను బోల్తా కొట్టించి తప్పించుకున్నాడు...'' అంటూ జరిగిన సంఘటన వివరించాడు ఇన్‌స్పెక్టర్.

''వాడు నా డబ్బుతోబాటు, మన సభ్యుణ్ణికూడా పొట్టనబెట్టుకున్నాడు. ఎట్టి పరిస్థితిలోనూ వాణ్ణి వదలకూడదు.''

''ఎక్కడున్నాడో తెలిస్తేకదా ప్రతీకారం తీర్చుకో డానికి?''

అవతల నవ్వు—''వాడెక్కడున్నాడో నాకు తెలుసు. నీవున్న హోటల్లోనే, రెండో అంతస్తులో, పన్నెండో గదిలో ఉన్నాడు. వెంటనే నీగు రంగం లోకి.''

''ఇక్కడే ఉన్నాడా? వెరీ గుడ్'' అంటూ రిసీవర్ దించి బైటికి నడిచాడు ఇన్స్పెక్టర్.

నిమిషంలో రెండో అంతస్తు చేరుకుని, రూం నెం 12 ముందు ఆగాడు. తలుపు మూసుంది. లాక్ వేసుంది.

కో గేంధర్ లోపల లేనట్టున్నాడు. ఈసారి తను మోస పోకూడదు. మారు తాళంతో లాక్ తెరిచి, రివాల్వర్ రెడీగా పట్టుకుని లోన అడుగుపెట్టాడు.

గదిలో నిశ్శబ్దం! తలుపు మూసి గబగబ గదంతా వెత కడం ప్రారంభించాడు. అలా వెదుకుతూ కిటికీదగ్గర కెళ్ళి అనుకోకుండా బైటికి చూశాడు. అక్కణ్ణించి హోటల్ ముందున్న రోడ్డూ, రోడ్డుమీద వచ్చేపోయే జనం స్పష్టంగా కనిపిస్తున్నారు.

ఆ జనంలో, ఫుట్ పాత్ మీద తల వంచుకుని హోటల్ వైపు వస్తున్న ఓ అరవైయేళ్ళ వృద్ధురాలిమీద దృష్టి పడగానే ఇన్ స్పెక్టర్ కళ్ళు పెద్దవయ్యాయి.

కారణం, ఆమె నెక్కడో చూసినట్టు స్ఫురించిందత నికి. అదే క్షణంలో ఆ ముసలామె తలెత్తి, క్షణంపాటు ఆ కిటికీవైపు చూసి తిరిగి తల దించుకుంది!

సందేహంలేదు. ఆ కళ్ళూ, ఆ చూపులూ తనకు బాగా జ్ఞాపకం!

ఎవ్వరామె? ఎక్కడ చూశాడు? గుర్తుచేసుకోడానికి తీవ్రప్రయత్నం చేస్తూ, ఇంకాస్త పరీక్షగా చూశాడు ఇన్ స్పెక్టర్.

అంతలో, ఆమె హోటల్ వైపు రావడానికి పేవ్ మెంట్ దిగి, రోడ్డుమీదికి వచ్చింది. అంతే!

ఇంకా ఆమె రోడ్ క్రాస్ చెయ్యకముందే, ఓ అంబా సిడర్ కారు రివ్వున దూసుకువచ్చి, ఆమెని గుద్దేసి, బాణంలా దూసుకుపోయింది!

రోడ్డుమీద హాహాకారాలు చెలరేగాయి! దారినపోయే జనం రోడ్డుమధ్య రక్తపుమడుగులో పడున్న ముసలామె

చుట్టూ ఈగల్లా మూగుతున్నారు...

ఊహించని ఆ హఠాత్సంఘటన ఇన్‌స్పెక్టర్ని అప్రతిభుణ్ణి చేసింది. ఆ ఘటన కేవలం కాకతాళీయమా? లేక, అందులో ఏదైనా మర్మం ఇమిడివుందా?

ఆమె నెక్కడో చూసినట్టు తనకి స్ఫురించడం, ఆమె తలెత్తి సరిగ్గా ఈ కిటికీవైపే చూడటం, అదే క్షణంలో ఆ కారు గుద్దేయడం...

కిందికెళ్ళి చూస్తే ఏమైనా తెలుస్తుందేమో, అనుకుంటూ వెనుదిరిగాడు ఇన్‌స్పెక్టర్.

"చేతులెత్తి అక్కడే నిల్చో! అంతకిమించి చిటికెన వేలు కదిపినా గుళ్ళతో గుండె జల్లెడ చేస్తాను జాగ్రత్త!" అన్న కంచు కంఠం విని, పక్కలో బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు.

గదిలోకి యెలా వచ్చేడో, ఎప్పుడొచ్చాడో తెలీదు. అతని ముందు ఓ వ్యక్తి నిల్చునున్నాడు, పిస్తోలు గురిపెట్టి!

"నాగుపాముతో చెలగాటం యెంత ప్రమాదమో, బహుశా, నీకిప్పుడు తెలిసివచ్చిందనుకుంటాను. ఈ జోగేంధర్ని చంపడం అంత సామాన్యమైన విషయమనుకున్నావా?" అతని కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి.

ఇన్‌స్పెక్టర్ రక్తం ఉరకలు వేసింది. "జోగేంధర్! నువ్వు బాస్‌ను మోసంచేసి బ్రతకడం కల్ల! బదిగా ఆ కాగితాలు నాకప్పగించి, బాస్‌ను క్షమాపణ కోరుకో" అన్నాడు తీక్షణంగా.

జోగేంధర్ విరగబడి నవ్వి— "బాస్ ఇప్పుడీ లోకంలో ఉంటేకదా, క్షమాపణ చెప్పుకోడానికి? ఆ

దుర్గతి పట్టకుండా మీ బాస్‌ను ఈ లోకంనించి కైలాసం పంపేశాను!'' అన్నాడు నవ్వుతూ.

"బాస్‌ను చంపేశావా? ఇంపాసిబుల్!''

"ఐదు నిమిషాల క్రితం రోడ్డుమీద చచ్చిన ముసల్ది ఎవరనుకున్నావ్? అదే, మీ బాస్! ఇంతకాలం మగ కంఠంతో మిమ్మల్నందర్నీ బుట్టలో వేస్తూ, తన కార్య కలాపాలు నిరాటంకంగా జరిపించుకుంది. అజంతా హోటల్లో నిన్ను పోలీసులబారినుంచి రక్షించింది కూడా ఆమే! మారు వేషాలు వెయ్యడంలోనూ, కంఠాలు మార్చడంలోనూ ఆమెని మించినవాడు లేడు!

నిన్నిక్కడికి పంపినట్టు పంపి, నీపై నిఘా వుంచటానికి, మారువేషంలో బైలుదేరింది. అటువంటి ఆడది సజీవంగా వుంటే, నా ప్రాణాలకి ప్రతిక్షణం ప్రమాదం గనక, కారుతో ఆ పిశాచిని పచ్చడిచేసి, పరలోకానికి పంపేశాను. ఆ కారు పక్క సందులో వుంది. నేనిక్కడున్నాను'' అన్నాడు లోగేంధర్ నవ్వుతూ.

"మైడియర్ ఇన్‌స్పెక్టర్! తెలివి నీ ఒక్కడి సొత్తే అనుకోక. ఎన్ని మారువేషాలు వేసినా, ఎన్ని పేర్లు మార్చుకున్నా, నువ్వు నా కళ్ళు గప్పలేవు. నీ నటనా జీవితం యిప్పుడు నా చేతిలో సమాప్తం కాబోతోంది. చచ్చేముందు, ప్రొఫెసర్ ప్రకాశరావును చంపిన హంతకుణ్ణి అరెస్ట్ చేయించి మరీ చావు. హంతకుడు హృదయనాథ్ యిప్పుడెక్కడున్నాడో నాకు తెలుసు. ఆ విధంగా పోతూ, పోతూ కర్తవ్యపారాయణత చూపించి పోయావన్న కీర్తి దక్కుతుంది నీకు!''

"ఎక్కడున్నాడతను?'' అడిగాడు ఇన్‌స్పెక్టర్ ఆతృతగా.

"నిక్షేపంగా తన యింట్లోనే వున్నాడు, నౌఖరు నారాయణ రూపంలో!"

నోరు తెరిచాడు ఇన్స్పెక్టర్.

"హృదయనాథ్ కూడా సెర్చ్‌లైట్ సంస్థ సభ్యుడే! నాయకురాలు ప్రకాశరావు కనుగొన్న కొత్త ఫార్ములాను తస్కరించడానికి నన్నూ, హృదయనాథ్‌నూ నియమించింది.

అంతేకాదు, దాన్ని తస్కరించినంత మాత్రాన సరిపోదనీ సృష్టించిన ప్రకాశరావుని కూడా చంపడం అవసరమనీ, అప్పుడే దానికి విలువ వుంటుందనీ ఆదేశించింది.

ప్రకాశరావు కనిపెట్టిన రెండు కెమికల్స్‌ని ఏకం చేసే ఒక హేర్ డయింగ్ మందు తయారవుతుంది. ఆ మందు ఒక్కసారి వాడితే చాలు, తెల్లజుత్తు శాశ్వతంగా నల్లబడుతుంది.

అటువంటి వినూతన మందును కొనడానికి ప్రపంచమంతా ఎగబడుతుందనడంలో ఎటువంటి సందేహం లేదు. తర్వాత కోటానుకోట్లు పోగుచేసుకోవచ్చు. అదీ ఆ నాయకురాలి పథకం!

మొదటినించీ ప్రకాశరావుకూ, హృదయనాథ్‌కూ ఆయన కూతురు విషయంలో మనస్పర్థలున్నాయి. హృదయనాథ్ ఆయన్ని చంపడానికి ఒప్పుకోడంలో ఆ కారణం కూడా ఒకటి!

వాళ్ళిద్దరూ ఘర్షణపడ్డ రాత్రి, హృదయనాథ్ వెళ్ళిపోయాక, ప్రకాశరావు లేబొరేటరీలో కెళ్ళి, తలుపులు మూసుకుని, ఆ కెమికల్స్‌ని తన జుత్తుమీదే పరీక్షించుకున్నాడు.

అవింకా తన ప్రభావం చూపించకముందే, హృదయ

వాథ్ కిటికీగుండా లోనికిదూకి, ప్రకాశరావు పిస్తోలుతోనే ఆయన్ని షూట్ చేసి, ఆ పని దయ్యాలుచేసినట్టు వాతావరణం సృష్టించాడు. తరవాత ఫార్ములా, డైరీ చేజిక్కించుకుని పారిపోయేడు. ప్రోగ్రాం ప్రకారం దాన్ని నా కప్పగించాడు.

నా ద్వారా అది నాయకురాలికందాలి. ఐతే, అది నా చేతికి రాగానే నా మనసు మారిపోయింది. ఆ సంస్థతో తెగతెంపులు చేసుకుని, ఆ ఫార్ములా ద్వారా లక్షలు ఆర్జించాలని నిశ్చయించాను. ఇప్పుడు నీ సందేహాలన్నీ తీరాయనుకుంటాను.

హృదయనాథ్ ను అరెస్ట్ చేయించాలనుకుంటే, అదుగో బల్లమీద టెలిఫోనుంది. వెంటనే మీ హెడ్ క్వార్టర్స్ కు ఫోన్ చేసి చెప్పు!'' అన్నాడు జోగేంధర్.

సాలోచనగా తలూపి, అడుగులో అడుగు వేసుకుంటూ ఫోన్ వైపు నడిచాడు ఇన్ స్పెక్టర్.

''జాగ్రత్త! ఆ విషయం తప్ప, నీ నోట్లోంచి మరో ముక్క యివతలికి వచ్చిందా, ఒక్క గుండు చాలు నీ నోరు శాశ్వతంగా మూతబడటానికి!'' హెచ్చరించాడు జోగేంధర్.

ఇన్ స్పెక్టర్ రిసీవర్ అందుకున్నాడు. తను ఫోన్ చేసిన మరుక్షణం జోగేంధర్ పిస్తోలు గర్జించడం ఖాయం!

రింగ్ చెయ్యడానికి డయల్ మీద చెయ్యి వెయ్యబోతూ, కన్నుమూసి తెరిచేలోగా, ఫోనెత్తి జోగేంధర్ మీదికి విసిరాడు. అది రాకెట్ లా దూసుకెళ్ళి జోగేంధర్ని గుద్దుకుంది.

అతనా పాక్లోంచి యింకా తేరుకోకముందే, చిరుతలా ఎగిరి బూటుకాలితో ఈడ్చి డొక్కలో తన్నేడు ఇన్స్పెక్టర్. నెప్పికి మెలికలు తిరుగుతూ కిందకూలేడు జోగేంధర్. బూటు మడమతో ఒక్క తన్నుతన్నేడు కణతమీద.

జోగేంధర్ చిన్నగా మూలిగి, మూర్ఛపోయాడు.

ఇదంతా జరగడానికి ఒకేఒక నిమిషం పట్టింది!

ఇన్స్పెక్టర్ క్షణం వృథా చెయ్యకుండా, జోగేంధర్ దుస్తులు వెతకడం ప్రారంభించాడు. కోటు లోపలి జేబులోంచి బైటపడింది ఓ బరువైన పర్సు!

ఆత్రంగా తెరిచిచూసేడు దాన్ని.

కనిపించేయి కాగితాలు!

ఆ డైరీలోంచి చింపిన కాగితాలు!!

హెడ్క్వార్టర్స్కు ఫోన్ చేసి, జోగేంధర్ని తీసికెళ్ళడానికి జీప్ తెప్పించాలి. కిందపడ్డ ఫోన్ వైపు చూసేడు. అక్కడక్కడా చితికి పాడైపోయింది. రిసెప్షన్లోంచి చెయ్యాలి.

అనుకుంటూ కాగితాలూ, పర్సూ, జోగేంధర్ పిస్తోలూ జేబులో వేసుకుని, బైటికి నడిచాడు. తలుపులు మూసి, బైట గడియలాగి, మెట్లవైపు నడిచాడు.

రిసెప్షన్లోంచి హెడ్క్వార్టర్స్కు ఫోన్ చేసి, ఐదు నిముషాల్లో పైకొచ్చాడు. గడియ వేసి, గదిలో అడుగు పెట్టి గతుక్కుమన్నాను.

జోగేంధర్ అదృశ్యం!

తెరిచి చిన్న కిటికీ వెక్కిరిస్తోంది ఇన్స్పెక్టర్ని!!

మెరుపులా అటు పరిగెత్తి, బైటికి తొంగిచూసేడు.

కిటికీ పక్కనే వుంది సిటీగార్డెం! ఈ సెంటర్ పారిపోడానికి అది సహకరించి వుంటుంది.

ఇహ అక్కడ చేసేదేమీ లేదు.

హోటల్లోంచి బైటపడి టాక్సీ ఎక్కాడు.

## 8

హృదయనాథ్ ఇంటిముందు టాక్సీ దిగగానే, గబగబ ఇంట్లోకి నడిచాడు ఇన్‌స్పెక్టర్.

సోఫాలో కూర్చున్న ద్రాక్షవేణికి టీ అందిస్తూ కనిపించాడు నౌకరు నారాయణ.

ద్రాక్షవేణి ఇన్‌స్పెక్టర్ని చూడగానే, చిరునవ్వుతో ఆహ్వానించి — "మరో కప్పు టీ పట్రా!" అంది నారాయణతో.

రెండు నిముషాల తరవాత టీ కప్పు ట్రేలో పెట్టుకు వచ్చాడు నారాయణ.

ఇన్‌స్పెక్టర్ కప్పందుకుని, కొద్దిగా టీ సిప్ చేసి, "మిస్టర్ హృదయనాథ్! నటనతో బాటు నీకు పాకశాస్త్రంలోనూ మంచి ప్రావీణ్యం వున్నట్టుంది!" అన్నాడు నవ్వుతూ.

హృదయనాథ్ పేరు వినగానే ద్రాక్షవేణీ నారాయణా ఉలిక్కిపడ్డారు!

"ఇన్‌స్పెక్టర్! ఏమిటి మీరంటోంది? నారాయణని పట్టుకుని హృదయనాథ్ అంటారేమిటి?" అంది ద్రాక్షవేణి నివ్వెరబోయి.

"మారువేషాలు మనుషుల్ని ఎంతగా మార్చివేస్తాయో ప్రత్యక్షంగా చూపిస్తాను. చూడండి!" అంటూ లేచి నారాయణ వైపు నడిచాడు ఇన్‌స్పెక్టర్.

అతను వేపాకులా వణుకుతూ వెనక్కి తగ్గసాగాడు.

ఇన్ స్పెక్టర్ అవేమీ పట్టించుకోకుండా, అతని తల పాగా, తెల్లమీసాలూ, కనుబొమ్మలూ అన్నీ ఊడదీసి ద్రాక్షవేణి వైపు చూసేడు.

"నువ్వా, బావా!" అంది నిశ్చేష్టురాలై.

హృదయనాథ్ తల దించుకున్నాడు నీరసంగా.

"మిస్టర్ హృదయనాథ్! ప్రొఫెసర్ ప్రకాశరావు హత్యానేరం కింద నిన్ను అరెస్ట్ చేస్తున్నాను" అన్నాడు ఇన్ స్పెక్టర్ గంభీరంగా.

"నేను మామయ్యని చంపలేదు ఇన్ స్పెక్టర్! నా మాట నమ్మండి. ఆ రాత్రి వాళ్ళింటినించి తిరిగొచ్చాక, మామయ్యని ఎలాగైనా వాళ్ళింట్లో దెయ్యాలున్నాయని నమ్మించాలని, నల్లదుస్తులు వేసుకుని, మళ్ళీ వాళ్ళ నక్కడికి.

ప్రయోగశాల కిటికీ తెరిచివుంది. ఆయన అందులోనే వుంటారని కిటికీ దగ్గరకెళ్ళాను. లోపల కనిపించిన దృశ్యం నన్ను దిగ్భ్రాంతుణ్ని చేసింది.

గదిలోని సామానుతోబాటు ఆయన శరీరంకూడా ఓ గోడనానుకుని, తలకిందులుగా నిల్చునుంది. నేను వెనకా ముందూ యోచించకుండా, కిటికీలోంచి లోపలికి దూకాను.

సరిగ్గా అదే క్షణంలో, ఎవ్వరో ప్రయోగశాలవైపు వస్తున్నట్టు అడుగుల శబ్దం వినిపించింది. నేను ప్రమాదాన్ని పసిగట్టి, వెంటనే గదిలోని లైటార్పి, కిటికీవైపు పరిగెత్తాను.

అప్పుడే తలుపు తెరుచుకుని, నరసయ్యా, ద్రాక్షవేణీ లోనికి వచ్చారు. వాళ్ళని చూడగానే కిటికీ దూకి పారి

పోయాను'' అన్నాడు హృదయనాథ్ జీవం లేని కంఠంతో.

''హత్య చెయ్యాలనివాడివైతే, ఇలా మారువేషంలో దేనికి సంచరిస్తున్నావ్?''

''పరిస్థితులన్నీ నాకు విరుద్ధంగా మారినందుకు భయపడి, ఈ సాహసానికి పూనుకున్నాను.''

ఇన్‌స్పెక్టర్ తల విదిలించి, ''నీ సంజాయిషీలు సంతృప్తికరంగా లేవు. ఏది ఏమైనా నువ్వు మా వెంట హెడ్ క్వార్టర్స్‌కు రాక తప్పదు''అంటూ టీపాయ్‌మీది టెలిఫోన్ అందుకున్నాడు.

హెడ్ క్వార్టర్స్‌కు రింగ్ చేసి, వెంటనే జీపు తీసుకు రమ్మని చెప్పాడు సార్జంట్‌తో.

అరగంట తరవాత బైట జీప్ ఆగిన శబ్దం వినిపించింది. నెమ్మదిగా ఓ వ్యక్తిని పొదివి పట్టుకుని, ఇంట్లో ప్రవేశించాడు సార్జంట్ దేవిడ్.

ఆ వ్యక్తిని చూడగానే అందరూ అప్రతిభు లయ్యారు.

''నరసయ్యా! నువ్వా...!'' అంది ద్రాక్షవేణి చేష్టలుడిగి.

ఒళ్ళంతా కట్లతో, పీక్కుపోయిన మొహంతో, జీవచ్ఛవంలా ఉన్నాడు నరసయ్యా.

''ఇంతవరకూ యెక్కడున్నావ్? ఈ గాయాలేమిటి? ఎవరు కొట్టారు నిన్ను?'' అడిగాడు ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యంగా.

''నరసయ్య హృదయనాథ్‌వైపు చూపి, ''ఆ రాత్రి బాబుగారే నన్ను మూర్ఛపోగొట్టి, ఎత్తుకుపోయి, ఓ యింట్లో బంధించేరు బాబూ! అక్కడ నన్ను చిత్ర

హింసలుపెట్టి, ఆకలిదప్పులతో చావమని, తాళ్ళతో కట్టి పడేసి వెళ్ళిపోయేరు.

నానా అవస్థలు పడి, నా నోటి కడ్డంగా కట్టివున్న గుడ్డని పళ్ళతో కొరికేసి, గావుకేకలు పెట్టేను. ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు ఆ కేకలు విని, ఇంటి తాళం పగుల గొట్టి, నన్ను రక్షించేరు బాబూ!'' అన్నాడు చెమ్మగిల్లిన కళ్ళతో.

హృదయనాథ్ తెగించాడు. ''నీచుడా! నేను నిన్ను ఎత్తుకుపోయానా? చావబాదానా? ఎప్పుడు, ఎప్పుడు?'' అంటూ పిచ్చిగా నరసయ్య మీదికి లంఘించి, పిడికిళ్ళతో మొహంమీద బాదసాగాడు.

ఇన్‌స్పెక్టర్ ఒక్క ఉదుటున లేచి, వాళ్ళను సమీపించే లోగా, ఎవ్వరూ ఊహించని ఓ చిత్రమైన సంఘటన జరిగింది!

హృదయనాథ్ పోట్లకు నరసయ్య మొహంమీది' నకిలీ ముక్కు ఊడి కిందపడింది! అంతేకాదు, మీసాలు కూడా కొద్దిగా ఊడి వేలాడసాగాయి!

''జోగేంధర్! నువ్వా!'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ నివ్వెరబోయి.

అతనితోబాటు మిగిలినవాళ్లు కూడా శిలాప్రతిమ లయ్యారు.

జోగేంధర్ మొహంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు!

ఐపోయింది.

# వర్షించని మేఘాలు!

మల్లేశ్వర్రావ్

"ఋతుపవనాల గురించి తెలుసా?" ఆరవ తరగతి కుర్రాడ్ని అడిగినట్టుగా అడిగాడు సి. బి. ఐ. డైరెక్టర్ శివరామ్.

"కొద్దిగా తెలుసు. చిన్నప్పుడు జాగ్రఫీలో చదువుకున్నదే" అన్నాడు జితేంద్ర ఆయన వేపు చూస్తూ.

"ఈ ఋతుపవనాలతోనే యిప్పుడు గొడవవచ్చింది. మనదేశం పూర్తిగా వర్షాధారమైంది. ఆ వర్షాలు మన కెక్కువగా నైఋతి ఋతుపవనాల ద్వారా ఏర్పడుతున్నయ్. ఈ ఋతుపవనాలు మనకి భూమధ్యరేఖ మించి వచ్చి సౌత్ యిండియా మీదుగా పయనించి హిమాలయాల చల్లదనంతో కురుస్తున్నయ్. వీటివల్ల దాదాపు కొన్ని లక్షల ఎకరాల భూమి సాగుచేయబడుతోంది. ఈ వర్షాలే లేకపోతే అస్సాం, త్రిపుర, మణిపూర్ ప్రాంతాల్లో తేయాకుపంట సర్వనాశనమైపోతోంది" కాస్సేపు ఊపిరి తీసుకున్నట్టుగా ఆగేడు డైరెక్టర్ శివరామ్.

ఇదంతా ఎందుకో అర్థంగాలేదు సి. బి. ఐ. ఏజెంట్ జితేంద్రకి.

"ఈ మధ్య కృత్రిమంగా వర్షాలు కురిపించడం గురించి విన్నావా?"

"ఆఁ విన్నాను. మద్రాసులో ఓ సారి ఈ ప్రయోగం చేసేరు కదా?"

"అవును. వర్షాభావం ఏర్పడ్డప్పుడు మేఘాలను హఠాత్తుగా చల్లబరచడానికి విమానాల ద్వారా సిల్వర్ సాల్ట్ అనే పదార్థాన్ని మేఘాల మీద వదుల్తారు. వెంటనే మేఘాలు చల్లబడి వర్షం కురుస్తుంది. వర్షాభావం వున్న ప్రతిదేశం ఈ ప్రయోగంమీద ఆశలు పెంచుకుంది. కానీ, యు. ఎన్. వో. ఈ రకమైన కృత్రిమ వర్షాల్ని కురిపించడాన్ని అంగీకరించలేదు."

"కారణం?"

"ఒకేచోట కురిసిన మేఘాలు మరోచోట కురవడం సాధ్యపడదు. ఏ దేశమైతే ఆ ప్రయోగం చేస్తుందో ఆ దేశంలో మాత్రం కృత్రిమ వర్షాలు కురుస్తాయి. ఆ దేశాన్ని ఆనుకునివున్న దేశాలు చుట్టుప్రక్కల ప్రాంతాలు వర్షాభావం వలన దెబ్బతినే అవకాశముంది. అందువలనే యు. ఎన్. వో. ఈ పద్ధతిని నిషేధించింది."

"యు. ఎన్. వో. అంతఃనిషేధించిన తర్వాత చేసేదేముంది? మానేస్తే సరి!"

"కరెక్ట్. పొరుగుదేశాల్ని దెబ్బతీయాలని ఏ దేశమన్నా ఈ ప్రయోగాలు ప్రారంభిస్తే?"

జితేంద్ర ఆలోచిస్తూ మౌనంగా తలూపేడు.

"ఇప్పుడదే జరుగుతోంది. ఇన్నాళ్లూ బంగ్లాదేశ్ మనకి సహాయంచేసే, మన సోదరుడిలాంటి పొరుగుదేశం

అనుకున్నాం. 1972 లో బంగ్లాదేష్ ఫ్రీడమ్ మూవ్ మెంట్ లో భారతదేశం యెంత సహాయం చేసిందో నీకు గుర్తుండి. అయినా వాళ్ళు కృతజ్ఞతను విస్మరించి, మనకి ఎదురుదెబ్బ తీసేరు. ఈ ప్రయోగాలను మానమని, యు. యన్. ఓ. వాటిని నిషేధించిందని మనం రిక్వెస్ట్ చేస్తే ఆ రిక్వెస్ట్ ని మన్నించలేదు.

బంగ్లాదేష్ ఉత్తర సరిహద్దులలో ఎక్కడో ఒక లాబరేటరీని నెలకొల్పేరు. అక్కడ్నుంచి విమానాల ద్వారా సిల్వర్ సాల్ట్ ని మేఘాలపైకి పంపి వర్షాన్ని కురిపింపజేస్తున్నారు.

అసలే నైఋతీ ఋతుపవనాలు వర్షాభావంతో యెక్కడ చల్లగాలి తగిలితే అక్కడ కురిసే స్థితిలో ఉంటాయ్. ఆ పరిస్థితుల్లో బంగ్లాదేష్ ప్రయోగాలవల్ల సిల్వర్ సాల్ట్ పదార్థాన్ని ఆకర్షించి, అక్కడికక్కడ చల్లబడి వర్ష కురుస్తోంది. అటు పిమ్మట తేలికైపోతున్నాయ్. తేలికైన ఋతుపవనాలు మళ్ళీ కురవటం సాధ్య పడదు. అందుచేతే మన హిమాలయా పర్వత పాదాల్లో వర్షం కురవడంలేదు. తేయాకుపంట గత మూడు నెలలుగా విపరీతంగా దెబ్బతింది.

భారతదేశపు ఆర్థిక వ్యవస్థలో ప్రథమ స్థానాన్ని ఆక్రమించుకుంది. ప్రస్తుతం తేయాకు ఎగుమతుల్లో మనదే అగ్రస్థానం. అంతే గాకుండా ప్రపంచ మార్కెట్ లో మన దేశపు తేయాకుకి విపరీతమైన డిమాండ్ వుంది. ప్రతి ఏటా తేయాకు ఎగుమతులవల్ల మనం ఎంతో విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జిస్తున్నాం.

ఇపుడే వర్షించని మేఘాలు మన ఆర్థిక వ్యవస్థనే

తారుమారు చేస్తున్నాయ్. మరి కొన్నాళ్ళు ఇలా సాగితే సాలీనా 500 సెం॥మీ॥ వర్ష పాతమున్న "చిరపుంజి" కూడా థార్ ఎడారిలా మారుతుంది. అలా జరగడానికి వీల్లేదు. అంచేత నువ్వు బంగ్లాదేష్ వెళ్ళి, ఆ లాబరేటరీని నాశనం చేయాలి.

బంగ్లాదేష్ ప్రభుత్వం ఈ విషయంలో ఏమీ చేయలేదు. నాశనమైతే ఊరుకోవడంతప్ప అంతర్జాతీయ నిబంధనల కతీతంగా యు.ఎన్.ఓ ని అతిక్రమిస్తున్నారు కాబట్టి ఏ దేశమూ క్షమించదు. యు.ఎన్.ఓ హర్షించదు. కేవలం ఈ సమస్యను మనమేకాకుండా నేపాల్, భూటాన్ దేశాలుకూడా యెదుర్కొంటున్నాయి మన సహాయాన్ని అర్థిస్తూ ఆయా దేశాల ప్రత్యేకదూతల్ని మన దేశానికి పంపేరు.

నువ్వు బంగ్లాదేష్‌కి జనపనార ఎగుమతుల విషయమై పరిశీలకుడిగా వెళ్తావ్. అందుకు తగ్గ యేర్పాట్లన్నీ చేసేను.

నీ పేరు జితేంద్ర కాదు. మనోహర్ ముఖర్జీ! వయసు నలభైసంవత్సరాలు. ది నార్త్ యిండియన్ కమర్షియల్ ట్రాన్స్‌పోర్టు అధిపతులు నిన్ను అక్కడ ఎగుమతుల రవాణాకి వీలున్న పరిస్థితుల గురించి చర్చలకి, పరిశీలన నిమిత్తం పంపుతారు. సి.ఐ.బి. ఏజంటువన్న సంగతి మర్చిపోవాలి. యు మస్ట్ టేక్ యువర్ ఓన్ రిస్క్ ఇన్ బంగ్లాదేష్."

అని ముగించేరు డాక్టర్ శివరామ్.

"ఆల్ రైట్! నన్నెప్పుడు బయల్దేరమంటారు? ఇప్పుడు వెళ్ళమన్నా సిద్ధమే" అన్నాడు జితేంద్ర.

"అవసరం లేదు. రెండ్రోజుల్లో నీ ప్రోగ్రామ్ వివరాలు నీకు తెలియజేయబడతయ్. ఆ వెంటనే నువ్వు వెళ్ళడానికి అన్ని ఏర్పాట్లూ జరుగుతయ్" అని చెప్పి డ్రాయర్ లోంచి ఓ ఫైల్ తీసి "ఇది మనోహరముఖర్జీకి సంబంధించిన ఫైల్. ఇందులో అన్ని వివరాలు ఉంటాయి. బాగా స్టడీ చెయ్" అంటూ ఫైల్ అందించేరు డైరక్టర్ శివరామ్.

"యస్ సర్!" అని ఫైలు అందుకున్నాడు.

"బంగ్లాదేష్ గూఢచారులు గుంటనక్కలు. పరమ కర్కోటకులు. జాగ్రత్త. ఈ ప్రయత్నంలో అనుకోనిది జరిగితే యు.ఎన్.ఓ. ముందు ఇండియా అపరాధిలా నిల్చోవాల్సి వుంటుంది. కనుక నువ్వు పట్టుబడకూడదు... నౌ యు కెన్ గో."

జితేంద్ర ఉత్సాహంగా బయటికి నడిచేడు.

## 2

ఢాకా!

బంగ్లాదేష్ రాజధాని. తూర్పు పాకిస్తాన్ విముక్తి పోరాటంలో భారత సైన్యాలచే చుట్టుముట్టబడ్డ ఢాకా!

ఢాకా ఎయిర్ పోర్టులో రాజహంసలా వాలింది ఇండియన్ బోయింగ్.

ఎయిర్ హోస్టెస్ తన స్వీట్ గొంతుతో గుడ్ బై చెబుతుండగా స్టెప్స్ మీదుగా దిగేడు జితేంద్ర.

కస్టమ్స్ చెక్ పూర్తి చేసుకుని ఆఫీసురూమ్ నుంచి బయటికి వస్తుండగా "హలో ముఖర్జీ" అని పిలిచేరెవరో.

వెనక్కి తిరిగేడు జితేంద్ర.

ఎదురుగా ఒక యువకుడు. సుమారు పాతికేళ్ళుం టాయి. నీట్ గా డ్రెస్ చేసుకున్నాడు. అప్పుడే శత్రువులు తనని పసిగట్టేరా అనుకున్నాడు.

"హలో!" అన్నాడు మొహంమీద నవ్వు పులుముకుని.

"మై నేమ్ యీజ్ గఫర్ ఖాన్. సూపరింటెంట్ ఆఫ్ ఎక్స్పోర్ట్స్" తనను తను పరిచయం చేసుకుని కరచాలనంకోసం చెయ్యి చాచాడతను.

"గ్లాడ్ టు మీట్ యూ" అన్నాడు జితేంద్ర ఆ వ్యక్తితో కరస్పర్శ చేస్తూ.

"మీరొస్తున్నట్లు కబురు తెలిసింది. అయామ్ యువర్ హోస్ట్! బయల్దేరుదామా?" అనడిగేడు గఫర్ ఖాన్.

"విత్ ప్లెజర్!" అంటూ సూట్ కేస్ తీసుకున్నాడు.

బయటికి గబగబ నడిచేడు గఫర్ ఖాన్. కారు పార్కింగ్ ప్లేస్ కి వెళ్ళి ఎర్రరంగు ఫియట్ ని జితేంద్ర ముందుకి తెచ్చేడు.

హోటల్ 'స్టోనార్ ంగ్లా' ముందు ఆగింది ఫియట్, పది నిముషాల తర్వాత.

ఢాకాలోనే పేరు పొందిన హోటల్ అది. ఎవరో ఖరీదైన మనుషులకు తప్ప సామాన్యులకు అందుబాటులో వుండని హోటల్ అది.

"వాట్ కెన్ అయ్ డూ ఫర్ యూ సర్?" రిసెప్షనిస్టు గొంతు తీయగా పలికింది.

"రూమ్" అన్నాడు జితేంద్ర.

ఇంతలో గఫర్ ఖాన్ ముందుకు వచ్చి "ఇంతకు ముందే రిజర్వు చేయబడ్డది. మనోహరముఖర్జీ ఫ్రం ఇండియా ఆన్ బిజినెస్ టూర్."

"ఎస్. ఎస్. రూం నెంబర్ ట్వంటీఫోర్, ఫ్లాట్ నెంబర్ ఫోర్ ప్లీజ్" అంది రిసెప్షనిస్టు రిజిష్టరు ముందుకి తోస్తూ.

సంతకం చేసేడు జితేంద్ర.

లిఫ్ట్ ఎక్కి ఫోర్త్ ఫ్లాట్ కి వచ్చి రూమ్‌లో ప్రవేశించారిద్దరూ.

"మరి నేను సెలవు తీసుకుంటానుసర్! రేపు ఉదయం తొమ్మిది గంటలకి మీటింగ్ ఎరేంజ్ చేసేం. ఎనిమిది నలభైఅయిదుకి మీకు కారు వస్తుంది" అన్నాడు గఫర్ ఖాన్.

"ఆల్ రైట్! థాంక్స్!" అన్నాడు షేక్‌హాండిస్తూ జితేంద్ర.

గఫర్‌ఖాన్ బయటికి వెళ్ళిపోయేడు.

# 3

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకి మీటింగ్ కి వెళ్ళేడు జితేంద్ర.

రవాణాశాఖామంత్రి ఆఫీసులో మీటింగ్.

కారు ఆఫీసుముందు ఆగింది. జితేంద్ర దిగగానే గఫర్ ఖాన్ చిరునవ్వుతో ఆహ్వానించేడు.

గఫర్ ఖాన్ ని విష్ చేసి ముందుకి నడిచేడు జితేంద్ర.

కారిడార్‌లో అడుగు పెడ్తుండగా "హలో ముఖర్జీ" అంటూ ఎదురయ్యేడు ఓ వ్యక్తి.

ఆ వ్యక్తిని చూస్తూనే గుర్తుపట్టేడు జితేంద్ర. బంగ్లాదేశ్ యింటలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌లో ప్రముఖుడు, ఆరితేరిన గూఢచారి అయిన ముజఫర్ ఖాన్.

జితేంద్ర గుండె దడదడలాడింది.

ముఖర్జీకి, ముజఫర్ ఖాన్ కీ పరిచయముంవున్నట్టు ఎక్కడా వ్రాయబడలేదు ముఖర్జీ డైరీలలో. 'తనను పోల్చలేదు కదా?' అనే అనుమానం కలిగింది. తన ఆందోళనని పైకి కనబడనివ్వకుండా, చిరునవ్వు నవ్వుతూ, "హలో" అన్నాడు.

"అయామ్ ముజఫర్ ఖాన్. బంగ్లాదేశ్ యింటలిజెన్స్ డిపార్ట్మెంటు అసిస్టెంట్ డైరెక్టర్ని" అన్నాడు ముజఫర్ ఖాన్ చెయ్యిచాపుతూ.

"గ్లాట్ టు మీట్ యూ" అన్నాడు జితేంద్ర షేక్ హాండ్ యిస్తూ. "మిమ్మల్ని యింతకుముందు చూసిన గుర్తులేదు."

"అఫ్ కోర్స్! ఈసారి తప్పనిసరై కలిసేను" అన్నాడు ముజఫర్ ఖాన్ నెమ్మదిగా.

జితేంద్ర గుండె మళ్ళీ దడదడలాడింది. 'అయిపోయింది తన పని' అనుకున్నాడు అప్రయత్నంగా!

"ఓ! యిట్సాల్ రైట్!" అన్నాడు తన ఆందోళనని అణుచుకుని.

"లెటజ్ గో యిన్టూ ద మీటింగ్" అన్నాడు ముజఫర్ ఖాన్.

ఇద్దరూ హాల్లో అడుగు పెట్టేరు. అప్పటికే హాలు సభికులతో కిటకిటలాడుతోంది.

బంగ్లాదేష్ రవాణామంత్రి ఎక్స్పోర్ట్స్కి సంబంధించిన అధికారులతో ఆ మీటింగ్ జరిగింది, రెండు గంటలపాటు.

ముందే వ్రాసి యివ్వబడిన స్పీచ్ని కంఠస్థంచేసి వుండటంవల్ల అలా అప్పజెప్పేసేడు. తరువాత వెయ్యబడ్డ ప్రశ్నలకి తనకు తోచిన రీతిలో జవాబు చెప్పేడు.

బయటికి వచ్చేడు జితేంద్ర మీటింగ్ అయిపోయిన తర్వాత.

ప్రెస్ రిపోర్టర్స్ చుట్టుముట్టేరు జితేంద్రని. గాభరా పడ్డాడు. ముందుగా అటువంటి పరిస్థితిని ఊహించక పోవడంవల్ల కాస్త కంగారుపడ్డాడు. దూరంగా చూసేడు.

ముజఫర్ ఖాన్!

ఓ స్తంభానికి చేరబడి విలాసంగా సిగరెట్టు కాలుస్తూ తనవేపే చూస్తుండడం గమనించేడు జితేంద్ర.

అర్థమైపోయింది జితేంద్రకి, అది ముజఫర్ ఖాన్ వేసిన ఎత్తేనని. కాన్ఫరెన్స్ హాల్లో సంభాషణలు టేప్ చేయనివ్వరు, అవి బయటికి వెలువడకూడదు కాబట్టి. అందుకే బయట ఈ తతంగం. మనసులో తిట్టుకోసాగేడు జితేంద్ర ముజఫర్ ఖాన్ని.

ఓపిగ్గా జవాబులిచ్చేడు ప్రెస్ రిపోర్టర్సందరికీ, తన యిష్టం వచ్చిన రీతిలో.

"థాంక్యూ సార్" అని వెళ్ళిపోయేరంతా.

గుండెల మీది బరువు దిగినట్టుగా వూపిరి వదిలేడు జితేంద్ర.

"అంతగా బెదరయిపోయేరా?" ముజఫర్ ఖాన్ గొంతు నెమ్మదిగా వినిపించింది వెనకనుంచి.

గతుక్కుమన్నాడు జితేంద్ర.

"ఓహ్! మీరా?" అన్నాడు అప్పుడే చూసినట్టు.

"మీ హోటల్కి పదండి. కారు రెడీగా వుంది" అన్నాడు ముజఫర్ ఖాన్ వినయంగా.

"నీ వినయం ఏడిసినట్టే వుంది" అనుకున్నాడు జితేంద్ర కారువేపు నడుస్తూ.

"మీరిదివరకు చాలాసార్లు వచ్చినట్లుంది ఈ ధాకాకు" కార్లో కూర్చుని సిగరెట్ ఆఫర్ చేస్తూ అడిగేడు ముజఫర్ ఖాన్.

"ఆఁ వచ్చేను" అంటూ సిగరెట్ వేపు చూసేడు.

ఇండియన్ రెడ్ విల్స్!

అదిరిపోయేడు జితేంద్ర.

ముజఫర్ ఖాన్ తనని పోల్చేసేడు. లేకపోతే పనిగట్టుకుని ఈ రెడ్ విల్స్ సిగరెట్ ని ఆఫర్ చేయడు.

"నో థాంక్స్. అయ్ హావ్ మై ఓన్ బ్రాండ్" అన్నాడు జేబులోంచి స్టేట్ ఎక్స్ప్రెస్ తీసి వెలిగిస్తూ.

కారు హోటల్ ముందు ఆగింది. జితేంద్ర కారుదిగి "థాంక్స్" చెప్పేడు.

"లెటజ్ మీట్ ఎగైన్" అంటూ డోర్ క్లోజ్ చేసేడు ముజఫర్ ఖాన్.

"వై నాట్! విత్ ప్లెజర్" అన్నాడు జితేంద్ర హోటల్ వేపు దారితీస్తూ.

జితేంద్ర చూపులు రిసెప్షనిస్ట్ ప్రక్కనవున్న టేబిల్ దగ్గర కూచున్న వ్యక్తిమీద పడేయ్. అతన్ని గుర్తుపట్టేడు జితేంద్ర.

సి.ఐ.డి.లో సీనియర్ ఏజంట్ అతను. నెంబర్ 242. కర్కోటకుడని పేరు పొందేడు. అతని చేతుల్లోంచి గత ఎస్సైన్ మెంట్ లో చాలా నేర్పుగా మిస్సయేడు జితేంద్ర. అప్పట్లో పాకిస్తాన్ యింటలిజెన్స్ డిపార్ట్ మెంట్ లో వుండేవాడు.

నెంబర్ 242 కూడా తనవేపు చూస్తుండడంతో చూపులు తిప్పుకున్నాడు జితేంద్ర. లిఫ్ట్ ఎక్కి తనప్లాట్ చేరుకున్నాడు.

తలుపు తీయబోయి అంతలోనే ఆగిపోయేడు జితేంద్ర. తనగదిలో యెవరో ప్రవేశించేరని పసిగట్టేడు. జేబులోంచి రివాల్వర్ తీసి, తలుపు కివతలే నిలబడ్డాడు.

కారిడార్‌లో జనం తిరుగుతున్నారు. అనుమానం రాకుండా చూసుకోవాలి. మరి కాసేపు రివాల్వర్‌తో గది బయట నిల్చుంటే ఏం జరిగిందని యెవరేనా అడగక మానరు. తెగించి డోర్ తెరిచి సుడిగాలిలా లోనికి దూసుకుపోయేడు, పిస్తోల్ని పొజిషన్‌లో వుంచుతూ.

మనిషిమాత్రుడెవడూ కనిపించలేదు రూంలో.

ఆశ్చర్యపోయేడు.

అంతకుముందు ఆ రూమ్‌లో యెవరో తిరిగినట్లుగా గుర్తులు కనిపిస్తున్నాయి. తన బాగ్‌లో వుండే బట్టలు అన్నీ బయట మంచంమీద పడివున్నాయి. ఒకటి రెండు సిగరెట్ పీకలు మంచంక్రింద చోటుచేసుకున్నాయి. అంటే వాళ్ళు దేనికోసమో వెదికేరన్న మాట. తనను అనుమానించేరా? తనెవరో తెలిసిపోయిందా? బహుశా తనని పట్టిచ్చే వివరాలేవీ వారికి దొరికివుండవు. ఉంటే తనను ఈపాటికే బంగ్లాదేశ్ బలగం చుట్టుముట్టివుండేది.

చటుక్కున బాత్‌రూమ్ తలుపులు తెరిచి చూసేడు. బాత్‌రూమ్ శూన్యంగా కనిపించింది, వెక్కిరిస్తూ.

ఒకవేళ తను సందేహిస్తూ బయట నిల్చున్నపుడు, ఆ అవకాశాన్ని వినియోగించుకుని వెళ్ళిపోయేరేమో అని అనుకుంటుండగా వెనక చప్పుడయింది.

గిరున తిరిగేడు.

నెంబర్ 242!

డోర్ దగ్గర విలాసంగా నిలబడి రివాల్వర్ చేతిలో వూపుతూ, చిరునవ్వు నవ్వుతూ చూస్తున్నాడు.

జితేంద్ర గతుక్కుమన్నాడు.

242 తనను గుర్తించేడా?

"హూ ఆర్ యూ?" అనడిగేడు గదమాయిస్తున్నట్లు "ఎందుకొచ్చేవిక్కడికి? నేను పోలీసుల్ని పిలుస్తాను"

"ముఖర్జీ సాబ్! నన్ను నెంబర్ 242 అంటుంటారు. బి. ఐ. డి.లో ఓ సీనియర్ ఏటంట్ని. ఇండియా నుంచి వచ్చినవాళ్ళ మీద కాపలా వుండడం నా డ్యూటీ! నాదో చిన్న సందేహం తీరుస్తారా ముఖర్జీసాబ్?" అడిగేడు 242.

"ముఖర్జీసాబ్" అనడంతో గుండెల మీద బరువు దింపినట్లయింది జితేంద్రకి.

"ఏమిటి?"

"ప్రస్తుతం మీకు రివాల్వర్తో పనేముంది?"

మరోసారి గతుక్కుమన్నాడు జితేంద్ర. ఓ ఎగుమతుల ప్రతినిధి దగ్గర రివాల్వర్ వుండడం అసహజం. 242 ప్రశ్నలోని అంతరార్థం అదే అని గ్రహించాడు.

"నేనీ రూమ్లో ప్రవేశించక ముందు ఎవరో ఈ గదిలో ప్రవేశించినట్లు అనుమానం కలిగింది. ప్రమాదం వుంటుందనిపించి, ఆత్మరక్షణకోసం పిస్తోలు తీసేను అంతే" అన్నాడు జితేంద్ర. మళ్ళీ అతనే అన్నాడు.

"అయినా గౌరవనీయమైన ప్రతినిధిని యిలా ప్రశ్నించి అవమానించడం చాలా అవమానకరం. నేను యిది మీ పార్లమెంటు దృష్టికి తీసుకెళతాను" అన్నాడు అధికార స్వరంతో.

పగలబడి నవ్వేడు నెంబర్ 242.

అతనెందుకు అంతగా నవ్వుతున్నాడో, తను అన్న మాటల్లో అంతగా నవ్వాల్సిందేముందో తెలియలేదు జితేంద్రకి. 242 వేపు విచిత్రంగా చూసేడు.

"పార్లమెంట్ వరకూ తీసుకెళ్తారా? ఎలా సాబ్? మనోహర్ ముఖర్జీగానా? లేక మీరు వేసిన వేషం విప్పేసి ఇండియన్ ఏజంట్ జితేంద్రగానా?"

అదిరిపడ్డాడు జతేంద్ర.

ఎలా తెలిసింది వీళ్ళకి? తను బంగ్లాదేష్ బయలేరిన విషయం డైరక్టర్ శివరామ్‌గారికి తప్ప వేరొకరికి తెలియదు. అంత రహస్యంగా ఏర్పాట్లు జరిగినా, తన గురించి తెలుసుకున్నారంటే ఏదో జరిగివుండాలి.

"ఎలా తెలిసిందని ఆలోచిస్తున్నావా మిస్టర్ జితేంద్రా?" మళ్ళీ నవ్వేడు 242. ఏర్‌కండిషండ్ రూమ్ కాబట్టి బయటికి వినబడే అవకాశం లేదు.

"ముఖర్జీ యింతకు ముందు చాలాసార్లు వచ్చినా, ప్రతిసారీ గఫర్‌ఖాన్ అతన్ని రిసీవ్ చేసుకునే వాడు. వాళ్ళిద్దరూ ముందుగా ఏర్‌పోర్ట్ కాంటీన్‌లో 'టీ' తాగేవారు. అసలు ముఖర్జీకి ఏర్‌పోర్ట్ కాంటీన్ 'టీ' అంటే యిష్టం. రెండు, ముఖర్జీ నడుస్తున్నప్పుడు మీద ఛాతీ కొద్దిగా స్వింగ్ అవుతుంది. నీ కది లేదు. మూడు, ముఖర్జీ ఎవరు ఏ సిగరెట్ ఆఫర్ చేసినా కాల్చేవాడు. నాలుగు, మా దేశం చిన్నదైనా మా యింటలిజెన్స్ డిపార్ట్‌మెంట్ కార్యకలాపాలు పెద్దవే! ఢిల్లీ నుంచి నీ రాకగురించి మా ఏజంట్లు సమాచారాన్ని అందించేరు."

తెగించేసు జితేంద్ర. ముందుకు వచ్చి విలాసంగా కూర్చున్నాడు. తన కాళ్ళు రెండింటినీ ఎదురుగావున్న

టీపాయ్‌మీదికి జార్చి, వెనక్కి జారగిలబడ్డాడు. రివాల్వర్‌ని వూపుతూ "ఆ తర్వాత" అన్నాడు.

నిర్ఘాంతపోయేడు 242. అతని గుండె నిబ్బరానికి అబ్బురపడ్డాడు. శత్రువు మృత్యువులా కబళించడానికి సిద్ధంగావున్నా మొక్కవోని ధైర్యంతో నిలబడ్డ జితేంద్రను అర్థం చేసుకోలేక తలమునకలయ్యేడు 242. అందుకే ఇండియన్ ఏజంట్స్ అంత పేరు తెచ్చుకుంటు న్నారనుకున్నాడు. నిజమే! ఇండియన్ ఏజంట్స్ చావుకి ఎప్పుడూ భయపడరు. ప్రక్కలోవున్న మృత్యువుని సహితం ఎదిరిస్తారు.

"ఒక ప్రశ్న అడుగుతాను సమాధానం చెబుతావా మిస్టర్ జితేంద్రా?" అని అడిగేడు 242.

జితేంద్ర జేబులోంచి స్టేట్ ఎక్స్‌ప్రెస్ సిగరెట్ పాకెట్ తీసి, ఓ సిగరెట్టు వెలిగించుకుని "అది నువ్వడిగే ప్రశ్ననుబట్టి వుంటుంది" అన్నాడు.

"నువ్వు మా దేశంలో ఎందుకు అడుగుపెట్టేవ్?"

తను వచ్చినపని వాళ్ళకి తెలిసిపోయిందేమోనని అంతవరకూ జితేంద్ర గాభరాపడ్డాడు. తెలియనందుకు సంతోషించేడు.

"ఏం? అదీ తెలుసుకోలేకపోయేరా?" అన్నాడు వ్యంగ్యంగా.

242కి వళ్ళు మండింది, ఆ వ్యంగ్యం చూసి.

"తప్పకుండా తెలుసుకుంటాం. కాకపోతే కాస్త ఆలస్యం. ఈలోగా నిన్ను చంపి, ఏదో నేరాన్ని నీమీద మోపి, యు.ఎన్.వో. ముందు నీ శవాన్ని వుంచుతాం. నీ దేశం పరువుప్రతిష్టల్ని గంగపాలు చేస్తాం."

"బేష్! చక్కని పగటికల! ఏ సినిమా నిర్మాతకో చెప్పు నీ కథ. నిన్ను మెచ్చుకుని అందలం ఎక్కిస్తాడు. కానీ ఒక్కమాట. నీలాగే ఎందరో ప్రబుద్ధులు నన్ను చంపుతానని ప్రగల్భాలు పలికేరు. కాని వాళ్ళందరూ నాకంటే ముందుగానే మట్టిలో కలిసిపోయేరు. ఇకపోతే నా దేశాన్ని దుయ్యబట్టాలని కలలు గంటున్న నిన్ను ఈ క్షణంలో గుండెలు చీల్చి చంపేవాడ్ని. కాని రక్తపాతం నా ధ్యేయం కాదు. అఫ్‌కోర్స్! అవసరమైతే ఎలాగూ తప్పదు!"

"గుడ్! నీ ధైర్యానికి మెచ్చుకోక తప్పదు. కాని నీకు చావు తప్పదు. అది నా చేతుల్లోనే!" పెద్దపెట్టున నవ్వేడు.

"అది నీ తరం కాదు. బహుశ నిన్ను పుట్టించిన బ్రహ్మ తరం కూడా కాదు. ఒట్టి ప్రగల్భాలు కట్టిపెట్టు."

"అయ్!" అరిచేడు. "తప్పించుకోగలనని భ్రమిస్తున్నావా? ఈ 242 గురికి యింతవరకు తిరుగులేదు. అడుగు కదిపినా యిందులోని బులెట్లు నీ శరీరాన్ని జల్లెడ చేస్తాయి."

"నువ్వలాగ చూస్తుండు. నీ కళ్ళల్లో కారంకొట్టి తప్పించుకుపోతాను" అన్నాడు జితేంద్ర.

"అసాధ్యం. ఒకవేళ తప్పించుకున్నా నువ్వు ఎక్కడికీ పోలేవు. ఎంతోదూరం పారిపోలేవు. అడుగడుగునా నీ ఉనికిని పట్టించే ఏజంట్లు వున్నారు. మా దేశపు కైంబ్రాంచి ఏజంట్లందరికీ నువ్వు కన్పిస్తే, కాల్చి చంపడానికి ఆర్డర్సు యివ్వబడింది. నిన్ను సజీవంగాగాని, శవంగాని పట్టిచ్చిన వారికి బహుమతి యివ్వబడుతుందని ప్రకటించబడింది. కనుక, ప్రజలు నీకు సహకరించరు."

"ప్రజలు మీ అంత విశ్వాసఘాతకులు కారన్న నమ్మకం నాకుంది. ప్రజలు మా దేశం చేసిన ఉపకారాన్ని అంత వేగంగా మర్చిపోరు."

"విశ్వాసం మాట దేవుడెరుగు. డబ్బు! మనిషి మానసిక బలహీనతలని జయిస్తోంది. ఆ డబ్బుకోసం ఎంత పనైనా చేయడానికి వెనుకాడడెవడూ. కృతజ్ఞత ప్రసక్తే లేదు."

"నీలాటి గుంటనక్క యిలాంటి ధర్మపన్నాలే చెబుతుందని తెలుసు. అందరూ నీలాంటివాళ్లే అని ఎలా అనుకున్నావ్?"

ఈడ్చికొట్టేడు జితేంద్ర చెంపమీద. సోఫాలోంచి ఎగిరిపడ్డాడు జితేంద్ర. దవడలో ఎముకలు కూలినట్టయింది. అతని కళ్లల్లో ఎర్రజీర కదిలింది. పళ్ళసందులోంచి రక్తం కారడం మొదలైంది. ఎడంచేత్తో రక్తం తుడిచి కళ్ళు జూసుకున్నాడు. అంతే.

మెరుపులా కదిలేడు. గాల్లోకి డైవ్ చేసి 242 మీద పడ్డాడు. పడుతూనే రివాల్వర్‌ని కాలితో తన్నేసి మెడ మీద ఒక్కటి కొట్టేడు.

బిత్తరపోయేడు 242.

కళ్ళముందు చీకటి నాట్యం చేసింది.

క్షణంలో తేరుకున్నాడు.

కాని జితేంద్ర అరచేత్తో మొహంమీద బలంగా చరిచేడు. ముక్కు బద్దలైంది. రక్తం బొటబొట కారింది. అయినా వెనక్కి తగ్గలేదు 242. పౌరుషంగా అతనిమీద విరుచుకుపడ్డాడు.

చెయ్యి చాచి జితేంద్ర డొక్కలో పొడిచేశు.

పేగులన్నీ కదిలినట్టయింది జితేంద్రకి. అరక్షణంలో తేరుకుని చేతిని కత్తిలా చేసి 242 మెడమీద దెబ్బ వేసేడు గట్టిగా.

తిరుగులేదా దెబ్బకి. కళ్ళముందు చీకటితెరలు కదులుతుండగా కూలిపోయేడు 242.

గబగబ కిటికీల దగ్గరకి వచ్చేడు. బయటికి చూసేడు.

జితేంద్ర కళ్ళకి ఎదురుగా వున్న బడ్డీకొట్టుదగ్గర మనుషులు తన రూమ్ వేపు చూస్తూ కనిపించేరు.

బాత్ రూమ్‌లోకి వెళ్ళి వెంటిలేటర్ గుండా అవతలికి చూసేడు. ఓ వ్యక్తి హోటల్ వెనుకభాగంలో వున్న పోల్ ని ఆనుకుని జితేంద్ర రూమ్ వేపే చూస్తున్నాడు.

తనచుట్టూ శత్రువులు వల పన్నేశారని అర్థమై పోయింది జితేంద్రకి.

ఏం చేయాలో తోచ లేదు.

అన్ని వేపులా గుంటనక్కల్లా కాచుకునివున్న యింత మందిని యెదిరించి పారిపోవడం కష్టం. ప్రాణాలకు తెగించి పోరాడినా అది అవివేకమే అవుతుంది. వాళ్ళు తనను హతమార్చడానికి ఆర్డర్స్ పొందివున్నారు. దేనికైనా తెగిస్తారు. ఎంత నేర్పుగా తప్పించుకోవాలనుకున్నా యింతమంది తుపాకుల్లో ఒకటైనా తన ధర్మం నెరవేర్చక తప్పదు. తను ఈ ఎస్సైన్ మెంట్ లో విజయం సాధించినా, లేకపోయినా తను సజీవంగా గాని, శవంగాగాని వీరికి చిక్కకూడదు.

ఆలోచనలు మస్తిష్కాన్ని వేడెక్కిస్తున్నాయ్.

ఉన్నట్టుండి మస్తిష్కంలో మెరుపు మెరిసింది.

భయం అన్నది యెరుగని జితేంద్రకి ఆ క్షణంలో

గుండెలు దడదడలాడేయి. నిజంగా అది గొప్ప సాహసం! బయటపడితే వెంటనే పిచ్చికుక్కని కాల్చినట్టు చంపుతారు. అయినా అంతకంటే గత్యంతరం కనిపించలేదు జితేంద్రకి. అతని ఆలోచనను చకచక అమలులో పెట్టేడు.

242 మెడమీద వున్న మరో నరాన్ని కూడా చివుక్కుమనిపించేడు జితేంద్ర.

ఫలితంగా అతను మరో నాలుగు గంటలువరకూ ఏనుగులు తొక్కినా లేవడు. అతనివల్ల జితేంద్రకి ఎట్టి ప్రమాదం ఉండదు.

గబగబ 242 డ్రెస్‌లోకి మారిపోయేడు.

242ని ఎత్తి మంచంమీద పడుకోబెట్టి దుప్పటిని పూర్తిగా కప్పేడు. ఇపుడెవరైనా చూస్తే మనోహర ముఖర్జీ నిద్రపోతున్నాడనుకుంటారు. తన మొహంమీద వున్న మేకప్‌ని తుడిచేసేడు. 242 ఎదురుగా కూర్చుని, అతనిలా మేకప్ చేసుకున్నాడు.

# 5

అద్దంలో మేకప్ చూసుకుని సంతృప్తిపడి బయటికి కదిలేడు జితేంద్ర.

లిఫ్ట్ ద్వారా క్రిందకు దిగి, బయట పార్క్ చేసివున్న కారుదగ్గర ఆగేడు. జేబులోంచి సిగరెట్ పెట్టె తీసేడు. అది ఇండియన్ రెడ్ విల్స్ కాదు. కనీసం స్టేట్ ఎక్స్‌ప్రెస్ కూడా కాదు. బంగ్లాదేష్‌లో తయారైన ఇంకేదో బ్రాండ్!

సిగరెట్టు వెలిగించి, అగ్గిపుల్ల బూటుక్రింద వేసి తొక్కేడు. అది 242 అలవాటుగా గ్రహించేడు జితేంద్ర. గుండెలనిండా పొగ పీల్చి చుట్టూ చూసేడు.

అలవాటులేని సిగరెట్ కావడంవలన వికారంగావున్నా, చేదుగా వున్నా త్రాగక తప్పలేదు జితేంద్రకి. 242కి ఆ సిగరెట్ ఎంత ఇష్టమో మరి?

242 వచ్చిన వాహనమేదో తెలియలేదు జితేంద్రకి. కార్లో వచ్చేడో, మోటారుసైకిల్ మీద వచ్చేడో అనూహ్యంగా వుంది. తప్పటడుగులు వేస్తే తల ఎగిరిపోతుంది. అందుకని తూచి తూచి అడుగు వేయాలి.

ఎందుకైనా మంచిదని గేటు దాటి టాక్సీని కేకేసేడు బంగ్లాదేష్ భాషలో.

ఓ టాక్సీ వచ్చి షడన్ బ్రేకుతో అతనిముందు వచ్చి ఆగింది.

"బ్యూరో" అనేసి టాక్సీలో కూర్చున్నాడు.

జితేంద్ర యింతకుముందు ఎన్నోసార్లు ఢాకా వచ్చేడు కాబట్టి అక్కడ ప్రదేశాలన్నీ అతనికి పరిచయమే.

"మిస్టర్ 242! ఇండియన్ ఏజెంట్ జితేంద్ర ఏమంటున్నాడు?"

టాక్సీడ్రైవర్ ఓరగా 242 వేషంలోవున్న జితేంద్రని చూస్తూ అడిగేడు.

పక్కలో బాంబు పడినట్లుగా అదిరి పడ్డాడు జితేంద్ర.

"నేను వచ్చేముందే యెక్కడికో వెళ్ళేడట. ఇంకా తిరిగిరాలేదు. నేను అక్కడ కాపలా వుంటే దూరంనుంచే గ్రహించి తప్పుకుంటాడని వచ్చేసేను" అతికినట్లుగా అబద్ధం చెప్పేడు.

"గుడ్! మంచిపని చేసేవ్..." అన్నాడు టాక్సీ డ్రైవరు.

బ్యూరో ముందు ఆగింది టాక్సీ.

జితేంద్రతోపాటు, టాక్సీ డ్రైవర్ కూడా దిగేడు.

టాక్సీ దిగుతూనే డ్రైవర్ని చూసి గుర్తుపట్టాడు జితేంద్ర.

ముజఫర్ ఖాన్!

గుండెలు దడదడ లాడేయ్. మృత్యుముఖంలోకి అడుగుపెట్టబోతున్నాడా? ముజఫర్ ఖాన్ తనను గుర్తించే నాటకమాడి యింతవరకు రప్పించేడా? తను 242 కాదని తెలుసుకున్నాడా? తనను గుర్తించడం జరిగితే యిక్కడ్నుండి తన శవం కూడా బయటికి రాదు.

"మిస్టర్ 242! నువ్వు వెంటనే ఏర్‌పోర్టుకి వెళ్ళు. ముఖర్జీ ఐమీన్ యిండియన్ ఏజంట్ జితేంద్ర పారిపోయే ప్రయత్నం చేయవచ్చు. అక్కడ తిష్టవేయ్."

"ఇండియన్ ఏజంట్స్ అంత పిరికివారంటూరా? మనం అతన్ని గుర్తించినట్లు అతనికి ఇంకా తెలీదుకదా? మరి, ఎందుకు పారిపోతాడు?"

"...అని నువ్వనుకుంటే సరికాదు. అతని ఆలోచనలు కనిపెట్టడం మన తరంకాదు. వెళ్ళినవాడు వెళ్ళినట్టే మధ్యలో యెక్కడో దిగి మళ్ళీ బంగ్లాదేష్ చేరుకుంటాడు. తను బంగ్లాదేష్ విడిచిపెట్టి వెళ్ళిపోయేనని మనల్ని నమ్మించి, మళ్ళీ వచ్చి తన పనిని చక్కా చేసుకుపోతాడు..."

"యూ ఆర్ కరెక్టు సార్" అన్నాడు.

"నా యుకెన్ గో" అన్నాడు ముజఫర్ ఖాన్ గేటువేపు దారి తీస్తూ.

"యస్ సార్...!" అని జితేంద్ర టాక్సీవేపు నడిచేడు.

టాక్సీ డ్రైవరు సీట్లో కూచుని ప్రక్కనేవున్న కేప్‌ని పెట్టుకున్నాడు.

కొంచెందూరం వెళుతుంటే ఎవరో రోడ్డు కడ్డంగా నిలబడి టాక్సీని ఆపమని సైగ జేసేడు.

జితేంద్ర గుండె వేగంగా కొట్టుకుంది. తనను పసి గట్టేరా? నెంబర్ 242 మేల్కొని ముజఫర్ ఖాన్ కి ఫోన్ చేసేడా? దాని ఫలితమేనా యిది?

ఆలోచిస్తూనే టాక్సీని ఆపేడు. టాక్సీ ఆపగానే ఎక్కడెక్కడో దాక్కున్న మనుషులందరూ వచ్చి తన కారుని చుట్టుముడుతారని అనుకున్నాడు కాని అదేం జరగలేదు.

ఆ వ్యక్తి టాక్సీ తలుపు తెరుచుకుని వెనకసీట్లో కూర్చుని—"వాతావరణ కేంద్రానికి పోనియ్!" అన్నాడు.

బంగ్లాదేష్‌లో అడుగు పెట్టిందగ్గర్నుంచీ తన మన సెందుకో అర్థంలేని అనుమానాలవేపు దారితీస్తున్నందుకు విసుక్కున్నాడు జితేంద్ర. తల విదిలించేడు. టాక్సీని ముందుకు దూకించేడు.

వాతావరణకేంద్రం ఢాకాకి అవలి సరిహద్దువేపువుంది. సుమారు అరగంట ప్రయాణం. ఆ వ్యక్తిని మాటల్లో పెడితే ఏవన్నా 'క్లూ'లు దొరుకుతాయేమో అనిపించింది జితేంద్రకి.

తారురోడ్డును మ్రింగేస్తూ పరుగెడులోంది కారు.

జితేంద్ర ఆలోచనలు అంతకంటే వేగంగా పరుగు లెడుతున్నాయ్.

"సాబ్! తుఫాన్‌ల గురించి ముందుగా ఎలా తెలుస్తుంది?" అనడిగేడు వీలైనంత అమాయకత్వాన్ని గొంతులోకి తెచ్చి.

జితేంద్ర అస్త్రం పనిచేసింది. ఆ వ్యక్తి ట్రాప్‌లో పడిపోయేడు. 'కీ' యిచ్చిన బొమ్మలాగా పదినిముషాలు మాట్లాడేడు. తుఫాన్‌లు ఎలా కనిపెడతారో వాతావరణాన్ని ఎలా కొలుస్తారో అన్నీ చెప్పేడు వివరంగా.

ఇంతలో ఓ జంక్షన్ దగ్గర కార్లు బారులుతీర్చి నిలబడిపోయేయి. అంటే 'వే' యివ్వలేదన్న మాట. అదీ తన మంచికే అనుకున్నాడు జితేంద్ర.

"సాబ్! వర్షాలు కురిపించగలరా మీరు?" అనడిగేడు మళ్ళీ.

గర్వంగా చూసేడతను. "తప్పకుండా. అదేం విచిత్రంకాదు" అన్నాడతను.

"అబద్ధాలు చెప్పకండి సాబ్! గాలి, నీరు దేవుడిచ్చినవంటారు. మరి మీరు దేవుడు కాకుండా ఎలా వర్షాలు కురిపించగలరు?"

"నిజం. వర్షాలు కురిపించడం చాలా తేలిక. విమానాల ద్వారా గాల్లోకి 'సిల్వర్ సాల్ట్' అనే పదార్థాన్ని పంపించి, మేఘాలను చల్లబరిచేమనుకో. వర్షం కురుస్తుంది. మన దేశంలో యిప్పుడు ఆ పని చేస్తున్నాం. ఈ ప్రయోగంకోసమే 'మిరగాన్'కి యిరవై కిలోమీటర్ల యివతలగా ఒక బిల్డింగ్‌ని కట్టించేం. అందులోనే ఈ ప్రయోగాలన్నీ జరుగుతున్నాయి."

ఇంకా ఏమైనా చెప్పేవాడేమో, అంతలోనే కార్లు కదిలేయ్. టాక్సీ కదిలింది. మరికొన్ని క్షణాల్లో ఆఫీసు ముందు ఆగింది టాక్సీ.

# 6

చీకటిపడింది.

ఢాకాలోని ఓ యిరుకుసందులో చీకటిగావున్న చోట

టాక్సీ ఆపి ఏం చేయాలో ఆలోచించసాగేడు జితేంద్ర.

తన ప్రస్తుతలక్ష్యం మిరగాన్!

మిరగాన్ వెళ్ళాలంటే ఎ—? అన్నదే అంతుపట్ట కుండా వుంది జితేంద్రకి.

దూరంగా హెడ్ లైట్లు వెలుగుతూ కనిపించేయి. ఏదో కారు రయ్‌మని దూసుకుంటూ వస్తోంది.

జితేంద్ర చటుక్కున టాక్సీదిగి రోడ్డుప్రక్క నున్న పోల్ వెనుక నక్కేడు.

జితేంద్ర ఊహ కరక్టయింది. ముజఫర్ ఖాన్ తనకోసం వేట ప్రారంభించేడు. కార్లోవున్నది అతని మనుషులే!

సడన్ బ్రేకుతో కారు జితేంద్ర టాక్సీ ప్రక్కన ఆగింది. నలుగురైదుగురు మనుషులు దిగి, జేబుల్లోంచి పిస్తోలు తీసి టాక్సీవేపు గురిపెడుతూ టాక్సీని చెక్ చేసేరు. వాళ్ళ భయానికి నవ్వుకున్నాడు జితేంద్ర.

కార్లో ఎవరూ కనిపించకపోవడంతో నిరాశగా వెనక్కి తిరిగేరు. పరిసరప్రాంతాల్లో ఎక్కడేనా దాక్కున్నాడేమోనని చుట్టూ కలయజూసేరు. బాగా వెనుకబడిన ఆ ప్రాంతంలో చీకటి తప్ప ఇంకేదీ కనిపించ లేదు వారికి. ఆ వీధిలో ఎలక్ట్రికల్ వున్నది ఒక్కటే ప్రస్తుతం. అది కూడా రాయి పుచ్చుకుని బ్రద్దలు కొట్టి నట్లుంది. వెలవెలబోతోంది. ఆ చీకటే జితేంద్రని కాపాడింది.

"ఇదే టాక్సీ. కాని మనిషి జాడలేదు..." అంటున్నా డొకడు.

"ఆ టాక్సీ వదిలేసి ఎంతసేపయిందో? పారిపోయుం టాడు. పదండి...ప్రక్కవీధిలోకి వెళ్దాం" అన్నాడు

మరొకడు.

అందరూ కారులో కూర్చున్నారు. కారు స్టార్టయింది. హెడ్ లైట్ల వెలుగు సందు చివరివరకూ పోతోంది.

జితేంద్ర పోల్ వెనుకనుండి బయటకు రావాలనుకుంటుండగా, కార్లో నుండి ఓ వ్యక్తి హడావుడిగా దిగి, టాక్సీలో ఎక్కి స్టార్ట్ చేసేడు. అది ముందుకు దూకింది. దాని వెనుక బయల్దేరింది కారు.

జితేంద్ర గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. ఆ శబ్దం అతని చెవులకి స్పష్టంగా వినిపిస్తోంది. ఎప్పుడైతే హడావుడిగా ఆ వ్యక్తి కారు దిగాడో పట్టుబడిపోయేననుకున్నాడు. ఊపిరి బిగపట్టి స్తంభం చాటున మరింత నక్కి దాక్కున్నాడు. అతని ఊహ తప్పయింది. టాక్సీ తీసుకు వెళ్ళడానికే వచ్చేడా వ్యక్తి.

గుండెల నిండా గాలి పీల్చుకుని బయటకు వచ్చేడు జితేంద్ర.

అప్పటికే చాలా దూరం వెళ్ళిపోయాయి కారు, టాక్సీ.

టాక్సీ తీసుకుపోయినందుకు బాధనిపించలేదు జితేంద్రకి. అతనెలాగూ టాక్సీని ఎక్కడైనా వదిలి పెట్టేయాలనుకుంటున్నాడు. నడక ప్రారంభించేడు.

అతని ప్రయాణానికి గమ్యం మిరగాన్!

కాని ఆ మిరగాన్ ఎక్కడుందో, అక్కడికి యెంత దూరముంటుందో అతని ఊహకి అందడంలేదు. చూస్తుండగానే నాలుగైదు సందులు తిరిగేడు. నడుస్తున్నాడన్నమాటేగాని ఆ దారిన గమ్యానికి దూరం వెళుతున్నాడో, దగ్గరౌతున్నాడో అర్థం కావడంలేదు.

కొంతదూరం నడిచేసరికి తనకు పరిచయమున్న దారి అనిపించింది.

అతని మనసులోకి ఓ ఆలోచన వచ్చింది.

రైల్వేట్రాక్స్ అతని కళ్ళముందు కదిలేయ్.

నాలుగైదు సందులు తిరిగేసరికి రైల్వేట్రాక్స్ కనిపించేయ్ జితేంద్రకి. ఆ ట్రాక్స్ వెంబడి చీకట్లో నడిచి రైల్వే ప్లాట్ ఫాం మీదకి చేరుకున్నాడు.

చటుక్కున ఆగిపోయేడు.

నెంబర్ 242!

అప్పుడే ప్లాట్ ఫాం మీద అడుగుపెట్టేడు. జితేంద్ర చప్పున పట్టాల పక్కనున్న పొదల్లోకి జారుకున్నాడు. పొదల చాటునుంచి 242ని చూడసాగాడు. ఇంతలో వేరుశనక్కాయలు అమ్ముకునే మనిషి బుట్టని ప్లాట్ ఫారమ్ మీద వుంచి, తన అవసరం తీర్చుకునేందుకు పొదలవేపు రాసాగేడు.

జితేంద్ర మరింత చాటుకి తప్పుకున్నాడు.

నెంబర్ 242కి ఎలా మస్కాకొట్టాలో ఆలోచిస్తుండగా అతని మస్తిష్కంలో ఓ ఆలోచన మెరిసింది.

## 7

ధాకా సెంట్రల్ స్టేషన్ ఎనౌన్సర్ స్వీట్ గొంతుతో మిరగాన్ వేపు పోయే పాసింజర్ రెండో నెంబర్ ప్లాట్ ఫాంమీద సిద్ధంగా వుందని చెప్తోంది.

వేరుశనక్కాయలు అమ్ముకునే మనిషి ఎనౌన్స్మెంటు విని గబగబ పొదలచాటు నుండి ప్లాట్‌ఫారమ్ మీదికి చేరుకున్నాడు.

రైలు కదలడానికి సిద్ధంగా వుంది.

వేరుశనక్కాయలు అమ్ముకుంటూ అతను ఒక్కో కంపార్ట్‌మెంట్ దాటుకుంటూ వెళ్ళిపోతున్నాడు.

"ఏయ్ వేరుశనక్కాయలూ యిలా రా."

నెంబర్ 242 గొంతు అది, ఖంగుమంటోంది.

వినిపించనట్టు వెళ్ళిపోయేడతను.

"ఏయ్! నిన్నే!" మళ్ళీ పిలిచేడు 242.

ఈ సారి అతను వెనక్కి తిరిగి 242 దగ్గరికి వచ్చేడు.

"పిలుస్తుంటే వెళ్ళిపోతావేం?" తీక్షణంగా చూస్తూ అడిగేడు.

"సాబ్! మాఫ్‌కిజియే సాబ్! మీరు పిలిచినట్లనిపించలేదు సాబ్! మీలాంటి సూటు, బూటు వేసుకున్న దొర బాబులు మా దగ్గర కొనరు సాబ్."

"సర్లే. కాయలివ్వు" అంటూ చిల్లర అతని చేతిలో పెట్టేడు.

వేరుశనక్కాయలు అతని చేతిలో పోసి వెళ్ళిపోయేడతను.

పాసింజర్ ట్రైన్ కదిలింది.

గబగబ నడుచుకుంటూ ఓ కంపార్ట్‌మెంట్‌లో ప్రవేశించేడు వేరుశనక్కాయలు అమ్ముకునే మనిషి.

ఇంచుమించు ప్రతిస్టేషన్లోనూ ఆగుతూ పోసాగింది పాసింజర్ ట్రైన్!

ఓ డోర్ ప్రక్కన కూలబడ్డాడు వేరుశనక్కాయలు అమ్ముకునే మనిషి. బుట్టను ప్రక్కనే వుంచుకుని వెనక్కి చేరబడి నిద్రపోసాగేడు.

ట్రైన్ మెల్లగా సాగిపోతోంది.

త్రుళ్ళిపడి లేచాడు వేరుశనక్కాయలవాడు. డొక్కలో ఎవరో బూటుతో పొడిచేరు.

కళ్ళు నులుముకుని చూసేడు.

టికెట్ కలక్టర్!

కోపంగా చూస్తూ "రేయ్! బద్మాష్! లైసెన్సేదిరా?" అనడిగేడు టి. సి.

గుండెలు బేజారైపోయేయి వాడికి.

"లేదు సాబ్! కనికరించాల. మీ పేరు చెప్పుకుని బ్రతుకుతాను" అంటూ జేబులోంచి ఓ పది టాకాలు (బంగ్లాదేశపు ద్రవ్యం) తీసి రమ్యంగా టి. సి. చేతిలో పెట్టేడు.

టి.సి. మొహం వెలిగిపోయింది.

"ఊఁ! సరే! యీసారికి క్షమించేను. లైసెన్సు లేకుండా యికముందు కనబడక" అంటూ వెళ్ళిపోయేడు.

గుండెలమీద బరువు దిగినట్లు తేలిగ్గా నిట్టూర్చి మళ్ళీ నిద్రలోకి జారిపోబోయేడు.

"గుడ్ ఈ వేషంలో కూడా అద్భుతంగా నటించేవ్! నీ నటనా ప్రాభవాన్ని మెచ్చుకోక తప్పదు మిస్టర్ జితేంద్రా!" అన్న మాటలు వినపడ్డాయి.

అదిరిపడి చూసేడు వేరుశనక్కాయలవాడి వేషంలో వున్న జితేంద్ర.

లాకెటరీ డోర్‌ని ఆనుకుని వున్నాడు నెంబర్ 242!

"హలో!" అని పలకరించేడు జితేంద్ర 242ని.

ఈ సారి ఆశ్చర్యపోవడం 242 వంతయింది.

"వెరీగుడ్! నీ ధైర్యానికి మెచ్చుకుంటున్నాను. కాని యీ సారి నువ్వు తప్పించుకోలేవు. యింపాసిబుల్!" అన్నాడు 242.

"ఊఁ! గతసారి యిచ్చిన డోస్‌నుంచి వేగంగానే కోలుకున్నావే!" అన్నాడు జితేంద్ర.

"మాటల్లో పెట్టి తప్పించుకుపోదామనుకుంటే అది నీ భ్రమే. గతసారి వెంట్రుకవాసిలో తప్పించుకు పోయేవ్. ఈ సారి అలా జరగదు" అది నిశ్చయమన్నట్టు చెప్పేడు.

"గతసారీ యిలాగే ప్రగల్భాలు పలికేవ్. యింకా ఎందుకీ ప్రగల్భాలు?"

"షటప్!" కోపంగా అన్నాడు 242. "చావుకి సిద్ధపడు" అన్నాడు పటుక్కున జేబులోంచి రివాల్వర్ తీసి జితేంద్ర గుండెలకు గురిపెడుతూ.

నవ్వేడు జితేంద్ర.

అతని నవ్వు చూసి వళ్ళు మండింది 242కి.

"మీ ఇండియెన్స్‌కి ఫూలిష్ సెంటిమెంట్స్ ఉంటా యనుకుంటాను. తొందరగా నీ యిష్టదైవాన్ని ప్రార్థించుకో" అన్నాడు వికటంగా నవ్వి.

రైల్లో ప్రయాణీకులందరూ నిద్రపోతున్నారు. కంపార్ట్‌మెంట్‌లో యింత గడబిడ జరుగుతున్నా వాళ్ళకేం తెలీదు.

జితేంద్ర వేరుశనక్కాయల బుట్టను కాలితో దగ్గరికి లాగి, గబుక్కున దాన్ని పైకి లేవనెత్తేడు. అంతే. అందులోని కాయలన్నీ 242 ముఖంమీదికి విరజిమ్మబడ్డాయి. కంగారుగా మొహంమీద చెయ్యి అడ్డుపెట్టేడు 242.

ఆ అవకాశం చాలు జితేంద్రకి.

పులిలా లంఘించి, లావెటరీ తలుపులు తీసి అందులోకి నెట్టేశాడు 242ని.

ఇద్దరూ లోపలపడ్డారు. మెడమీద అరచేతిని కత్తిలా చాచి కొట్టేడు. దాంతో 242 స్పృహ తప్పుతుండగా వాష్‌బేసిన్ మీద పడి తల చిట్లి రక్తం కారసాగింది.

నెంబర్ 242ని లావెట్రీ ఓ మూలకి చేర్చి చేతులు దులుపుకున్నాడు జితేంద్ర.

నెంబర్ 242 పూర్తిగా స్పృహతప్పిపోయాడని నిర్ధారణ చేసుకున్నాక, డోర్ లాక్ చేసి బయటికి వచ్చేడు.

గబగబ వేరుశనక్కాయల్ని బుట్టలోకి ఎత్తేసి ఒక కంపార్ట్‌మెంట్ నుండి మరో కంపార్ట్‌మెంట్‌కి మారుతూ ముందుకి పోయేడు జితేంద్ర.

# 8

మిరగాన్ స్టేషన్‌లో ఆగింది పాసింజర్ ట్రైన్.

వేరుశనక్కాయలవాడి వేషంలోనున్న జితేంద్ర బయటపడ్డాడు.

మిరగాన్!

బంగ్లాదేశ్ విముక్తి పోరాట సమయంలో పాక్ సైనికులను తరిమికొట్టడం మొదలయిన ప్రదేశం ఇదే!

చుట్టూ అడవులు, ఆ అడవుల నానుకొని ఎత్తయిన కొండలు. ప్రకృతి సంపద అపారంగా దొరుకుతుం దక్కడ.

మిరగాన్‌కి యిరవై కిలోమీటర్ల దూరంలో లాబరేటరీ ఉండటంవల్ల ఆ గ్రామందగ్గర సెక్యూరిటీ దళాలు ఎక్కువగా వున్నాయ్.

బంగ్లాదేష్‌కీ, పాకిస్తాన్‌కీ మధ్యవున్న అంతఃకలహాల వల్ల బంగ్లాదేష్‌లో అడుగుపెట్టిన ప్రతి మనిషినీ అనుమానిస్తారు. కొత్తవాడ్ని పట్టిపట్టి చూస్తారు. బంగ్లాదేష్ ప్రజాస్వామ్యదేశం కాకపోయినా మిలటరీ ఎక్కువ అధికారాల్ని పొందియున్నది. అందుకే మిలటరీ మనుషులంటే జడుస్తారు బంగ్లాదేష్ ప్రజలు.

స్టేషన్ నుంచి బయటికి వచ్చిన జితేంద్రకి ఎక్కడికి వెళ్ళాలో అర్థంకా లేదు.

ఆకలి కరకరమంటోంది.

మండుతున్న సెగలాగ, రగులుతున్న విప్లవంలాగ, బ్రద్దలైన అగ్నిపర్వతంలాగ వుంది అతని కడుపులో ఆకలి.

చుట్టూ చూసి తన నెవరూ గమనించలేదనిపించేక మెల్లగా ఓ పాత హోటల్లోకి అడుగుపెట్టేడు.

చీకటిగా, అపరిశుభ్రంగా వుందా హోటల్.

వాసన ముక్కుపుటాల్ని అదరగొడుతున్నా, ఆ హోటల్లో కూర్చోక తప్పిందికాదు జితేంద్రకి. పెద్దపెద్ద హోటల్లో కూర్చునే వేషంలో లేడతను. పైగా ఖరీదైన హోటల్లో ఏ అధికారులో తనని గుర్తుపట్టే అవకాశముంది. అందుకే అయిష్టంగా వున్నా జితేంద్రకి కూర్చోనక తప్పింది కాదు.

చపాతీలకు ఆర్డరిచ్చేడు.

రెండు నిముషాల తర్వాత జొన్నలతో చేసిన చపాతీలు అతనిముందు ప్రత్యక్షమయ్యేయి.

ఆకలి రుచి ఎరగదన్నట్టు ఆవురావురుమంటూ తినేసి, బిల్లు చెల్లించి, హోటల్లోంచి బయటపడ్డాడు.

కడుపులోకి ఆహారం పోగానే నిద్ర ముంచుకు రాసాగింది. బలవంతంగా నిద్రను తరిమేసి పేవ్‌మెంట్ మీద నడవసాగేడు.

"హలో!" దిక్కులు పిక్కటిల్లేలా వినిపించిందా గొంతు.

వెనక్కి తిరిగి చూసేడు.

24! తలమట్టూ బాండేజ్ వుంది. బాత్‌రూమ్ వాష్‌బేసిన్ పెట్టుకున్న ముద్దు అది!

"ఓరి పిశాచీ! మళ్ళీ దాపురించేవ్, నా ప్రాణాల మీదికి" అనుకున్నాడు జితేంద్ర అప్రయత్నంగా.

"ఏం కావాలి బాబూ!" అనడిగేడు.

"నీ ప్రాణాలు! ఎా యిస్తావ్?" అనడిగేడు 242 నవ్వుతూ.

"అవి నువ్ కానలేవు" అన్నాడు జితేంద్ర పెడసరంగా.

నెంబర్ 242 నిరాయుధుడై వున్నాడు. జితేంద్ర ఆలోచించేడు. రెండడుగులు ముందుకేసి మొహంమీదకు చెయ్యి విసిరేడు. కాని అదే సమయంలో సర్ మని అతని చేతిని రాసుకుంటూ పిస్తోలు గుండు వెళ్ళిపోయింది. గిర్రున వెనక్కి తిరిగిచూసేడు జితేంద్ర.

అప్పుడే అక్కడికొచ్చి ఆగింది పోలీస్ జీప్.

పోలీస్ అధికారి చేతిలోవున్న పిస్తోల్లోనుంచి ఇంకా పొగ బయటికి వస్తోంది. దాన్ని నోటితో ఊదుతూ జితేంద్ర వేపు చూసేడు అతను. నలుగురు పోలీసులు జితేంద్రని చుట్టుముట్టి సంకెళ్ళు వేసి జీపెక్కించేరు.

# 9

మిరగాన్ నగర సరిహద్దుల వేపు దూసుకుపోతోంది పోలీస్ జీప్.

నెంబర్ 242 ఆలోచనేమిటో అంతుబట్టడంలేదు జితేంద్రకి.

తనను చంపుతాడా?

చంపాలనుకుంటే జీపులో యెక్కించి యింతదూరం తీసుకెళ్ళాల్సిన పనిలేదు. పట్టుబడిన వెంటనే నడిరోడ్డు అయినా సరే కాల్చి చంపవచ్చు. పై అధికారుల అను

మతి లేదని భయపడనవసరంలేదు. ఎందుకంటే దేశంలో ప్రతి ఏజంట్ కి తను కనిపిస్తే కాల్చి చంపడానికి ఆర్డర్స్ యిచ్చేరు.

మరి తన నెందుకు తీసుకెళుతున్నాడు? బంధించి వుంచుతారా?

ఎందుకు? దానివల్ల ఏం ప్రయోజనాన్ని ఆశిస్తున్నారు. అదేనా?

తనను బంధించి యు.ఎన్. ఓ. ముందు నిలబెట్టి, తన మీద ఏదన్నా నేరం మోపుతాడా?

సి.బి.ఐ. డైరెక్టర్ శివరామ్ మాటలు గుర్తుకొచ్చేయి జితేంద్రకి.

యస్! తను పట్టుబడకూడదు. ఎలాగైనా తప్పించుకోవాలి. కానీ ప్రాణాలతో పట్టుబడకూడదు. తనను ఆసరాగా తీసుకుని, తన దేశంమీద దుమ్మెత్తిపోయాలని వీరు చేస్తున్న కుట్ర కొనసాగడానికి వీల్లేదు. జితేంద్రలో ఆవేశం ముంచుకొచ్చింది.

జీప్ టాప్ వేపు చూసేడు. ఆ జీప్ కి టాప్ లేదు.

తప్పించుకునే మార్గంకోసం ఆలోచించేడు. జేబులో వున్న మినీ గ్యాస్ బాంబ్ గుర్తుకొచ్చింది.

జేబులోంచి దాన్ని తీయడానికి సంకెళ్లు అడ్డువచ్చేయి. తీయడం ఆలస్యమైతే, తన ప్రాణాలు గాల్లో కలిసిపోవడానికి ఆలస్యం జరగదు.

క్షణం ఆలోచించేడు. ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా తల పంకించేడు.

చెయ్యిని జేబువరకూ తీసుకెళ్ళేడు జితేంద్ర.

ఓ కానిస్టేబుల్ అది గమనించేడు.

"ఏయ్! ఏమిటది?" అంటూ తుపాకీ బట్‌తో చేతి మీద కొట్టాడు.

"లేదుసార్! సిగరెట్ తీసుకుందామని" అన్నాడు నసుగుతూ.

"ఊఁ! కానీ!" అన్నాడా కానిస్టేబుల్ వెనక్కి వాలుతూ.

సిగరెట్‌తో పాటు మినీ గ్యాస్ బాంబ్‌ని బయటికి తీసి, పళ్ళతో బుడిపెను బయటికి లాగి ఊపిరి బిగించేడు జితేంద్ర.

గ్యాస్ బాంబ్ తన పని కానిచ్చింది.

గ్యాస్ జీపునిండా అలుముకుంది.

"వాటీజ్ దిస్?" అంటూ వెనక్కి తిరగబోయేంతలో నెంబర్ 242కి స్పృహ తప్పింది.

అందరూ స్పృహతప్పిపోతుండగా జితేంద్ర జీప్‌లో నుంచి క్రిందికి దూకేడు.

జీప్ కొంచెం ముందుకు వెళ్ళి ఓ చెట్టుకి గుద్దుకుని ఆగిపోయింది.

రోడ్డుమీద నుంచి పల్లంలోకి దొర్లుకుంటూ పోయేడు జితేంద్ర. దెబ్బలు తగల్లేదు. అక్కడక్కడా చెక్కుకుపోయింది.

జీప్ దగ్గరికెళ్ళి పరీక్షించేడు. డ్రైవర్‌కి, 242కి బాగా దెబ్బలు తగిలెయ్. నెంబర్ 242 తల ముందు అద్దానికి కొట్టుకుని దెబ్బ తగిలినట్టుంది. రక్తం సీటుమీదికి జారుతుంది.

నెంబర్ 242 వేపు జాలిగా చూసాడు జితేంద్ర.

నెంబర్ 242 వ్యక్తిగతంగా తనకు శత్రువుకాదు. అతను అతని దేశంకోసం చావుకి సహితం భయపడకుండా

యిన్నిసార్లు దెబ్బలుతిన్నా, తనను ఎదిరిస్తున్నాడు. తను తన దేశంకోసం ప్రతిసారీ అతన్ని దెబ్బతీస్తున్నాడు.

ఆలస్యంచేస్తే మళ్ళీ ఏం ప్రమాదం ముంచుకొస్తుందో అని అడుగువేయబోయేడు. అప్పుడే గుర్తుకొచ్చింది రెండుచేతులకు సంకెళ్లు వేయబడ్డాయన్న సంగతి!

పోలీసు ఒడిలోవున్న తుపాకిని అందుకుని, నేలమీద నిలువుగా నిలబెట్టి, బులెట్ విడుదలయ్యే ప్రదేశంలో సంకెళ్లను ఉంచేడు. కాలి బొటనవ్రేలితో తుపాకీ నొక్కేడు.

'ఢాం!' మని ప్రేలింది. సంకెళ్ళు తెగిపోయేయి.

స్వేచ్ఛగా గాలి పీల్చుకుంటూ మిరగాన్ వేపు నడక సాగించేడు జితేంద్ర.

రెండుగంటలు గడిచిన తర్వాత మిరగాన్ పొలిమేర ల్లోకి అడుగుపెట్టేడు.

వెనక ఏదో అలికిడైంది.

గిర్రున వెనక్కి తిరిగి చూసి కొయ్యబారిపోయేడు జితేంద్ర.

ముజఫర్ ఖాన్!!! అతని వెనుక సాయుధులైన సోల్జర్స్ అనేక మంది వున్నారు.

"వెల్ కమ్ మిస్టర్ జితేంద్రా! నువ్వీ ప్రాంతాల కొస్తావని ఊహించాను. నెంబర్ 242ని చంపిన నేరానికి నిన్ను ఈ క్షణంలో ఏదన్నా చేయవచ్చు. నిన్ను కాల్చి పారేయడానికి మా అధికారులు ఆర్డర్స్ యిచ్చేరు కూడా."

"అయితే యింకేం? వెంటనే కాల్చేయరాదూ?"

"కాని నేనలా చేయను. ఎందుకో తెలుసా? పరాయి దేశంలో ఆ దేశం అనుమతిలేనిదే ఏ దేశపు ఏజంట్

అయినా అడుగుపెడితే యు.ఎన్.వో. ముందు ఎటువంటి డిఫెన్స్ అయినా చేసుకోవచ్చన్న సంగతి నాకు బాగా తెలుసు'' అన్నాడు ముజఫర్ ఖాన్.

అచేతనంగా నిల్చుండిపోయేడు జితేంద్ర.

పగలబడి నవ్వేడు ముజఫర్ ఖాన్.

''తప్పించుకోవాలని ఆలోచిస్తున్నావా? వృథా ప్రయాసపడకు. ప్రతిసారీ మృత్యువుకి వెంట్రుక వాసిలో తప్పించుకుపోతున్నావ్. ఈ సారి నువ్వు తప్పించుకోలేవు''—అంటూ అరెస్ట్ చేయమన్నట్టు సైగ చేసేడు.

ఇద్దరు సోల్జర్స్ గబగబ ముందుకు వచ్చి జితేంద్ర చేతులకు సంకెళ్ళు వేసేరు.

జితేంద్ర మౌనంగా అనుసరించాడు.

పదినిమిషాల తర్వాత ఓ బిల్డింగ్ వచ్చింది. జితేంద్రని ఓ గదిలో త్రోసేసి చేతులు దులుపుకుంటూ వెళ్ళిపోయేరు. చుట్టూ చూసేడు ఎటువంటి దారీ కనిపించలేదు. పైనున్న చిన్న కన్నాల్లోంచి వెలుతురు వస్తోంది. ఏర్ కండిషన్డ్ చేయబడ్డ గది కావటంవల్ల గదిలో చల్లగావుంది.

గోడకేవో కొక్కేలున్నాయ్. వాటిని కదిలించి చూసేడు. చాలా గట్టిగా వున్నాయ్. వాటిని చూస్తూనే గ్రహించేను అది యింటరాగేషన్ రూమ్ అని.

ఏం చేయాలో ఆలోచిస్తూ ఓ మూల కూలబడ్డాడు.

పన్నెండు గంటలవుతుండగా తలుపులు తెరుచుకుంటున్న శబ్దమయింది.

తలుపులవేపు చూసేడు. తెరుచుకున్నాయవి.

ముజఫర్ ఖాన్! అతని వెంట నలుగురు సోల్జర్స్!!

జితేంద్ర చేతులకి గొలుసులు బిగించేరు సోల్జర్స్.

ముజఫర్ ఖాన్ జితేంద్ర ముందుకి వచ్చేడు.

"మిస్టర్ జితేంద్రా! మీరు మా దేశంలో ఎందుకు అడుగు పెట్టేరు? మీతో పాటు యింకెవరన్నా వచ్చారా?" అనడిగేడు.

జితేంద్ర సమాధానం చెప్పలేదు.

పిడికిలి బిగించి డొక్కలో పొడిచేడు ముజఫర్ ఖాన్.

జితేంద్రకి ప్రేవులు తెగిపోయినంత బాధకలిగింది. అతని మొఖంలో బాధ స్పష్టంగా కనిపించింది ముజఫర్ ఖాన్ కి.

"జితేంద్రా! మర్యాదగా అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు. లేకపోతే నీ చేత ఎలా చెప్పించాలో నాకు బాగా తెలుసు. నీ చేత చెప్పించే రాక్షస పద్ధతులెన్నో మా దేశం నేర్పింది మాకు. అవన్నీ ప్రయోగించైనా సరే నీ చేత చెప్పిస్తాను."

"ముజఫర్ ఖాన్! మీ దేశం మీకు హింసించడం మాత్రం నేర్పింది. కాని మా దేశం ఆ హింసల్ని భరించడం కూడా నేర్పింది. నువ్వెన్ని విధాల ప్రయత్నించినా నా నోట్లోంచి ఒక్క ముక్క బయటకు రాదు. అరిచి గీపెట్టినా నా చేత ఏం చెప్పించలేవు."

"నువ్వా, నీ తల్లో జేజమ్మ దిగివచ్చి చెబుతారు" అంటూ కాలెత్తి తొడలమీద తన్నేడు ముజఫర్ ఖాన్

బూటు నాడాలు కస్ మంటూ దిగేయ్.

బాధని పంటిబిగువున అణుచుకున్నాడు. తొడల్లోంచి రక్తం బుస్ మంటూ పొంగి, పంచ ఎర్రబడుతోంది.

ఒకటి... రెండు...మూడుసార్లు ముజఫర్ ఖాన్ బూటు జితేంద్ర శరీరాన్ని తాకింది.

జితేంద్ర స్పృహతప్పి పడిపోయేడు.

ముజఫర్ ఖాన్ వెనుదిరిగేడు. స్పృహతప్పినట్లు నటిస్తున్న జితేంద్ర కనుకొనుకల్లోంచి చూస్తున్నాడు.

చిత్రంగా శబ్దంచేసేడు ముజఫర్ ఖాన్.

కోడ్ వర్డ్ అది!

తలుపు తెరుచుకున్నయ్. అందరూ బయటికి వెళ్ళిపోయేరు.

జితేంద్ర పూర్తిగా తలెత్తాడు. ఆ కోడ్ వర్డ్‌ని పదేపదే గుర్తుచేసుకున్నాడు.

# 10

రెండురోజులు గడిచేయి.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచేడు జితేంద్ర.

ఎవరో తలుపుతీస్తున్న చప్పుడు.

చటుక్కున లేచినిలబడ్డాడు.

తలుపులు తెరుచుకున్నాయ్.

ముజఫర్ ఖాన్!

ఎదురుగా ఎవరెస్టు శిఖరంగా నిలబడివున్నాడు ముజఫర్ ఖాన్!! ఒంటరిగానే వచ్చాడు. అయినా అతని చేతిలో నల్లని పిస్తోలు ఉంది.

అంతే! జితేంద్ర కాలు ఎగిరి ముజఫర్ ఖాన్ చేతిని ముద్దు పెట్టుకుంది. అతని చేతిలోవున్న పిస్తోలు ఎగిరి ఓ మూల పడింది. ముజఫర్ ఖాన్ పిస్తోల్ని అందుకోవాలని పరిగెట్టేడు.

జితేంద్ర నోట్లోంచి విచిత్రమైన అరుపు ధ్వనించింది.

అది ప్రెంగ్ కిక్!

జితేంద్ర, ముజఫర్ ఖాన్ మీదికి గాలిలోంచి ఎగిరి దూకేడు. జితేంద్ర కాళ్ళు ముజఫర్ ఖాన్ గుండెల్ని

హత్తుకున్నాయి. అంతే ముజఫర్ ఖాన్ చెట్టులా విరుచుకు పడిపోయేడు. అతని నోట్లోనుండి పాలికేకలాంటిది విని పించింది.

ఫ్లయింగ్ కిక్ సాధారణమైనది కాదు. దాని తాకిడికి వజ్రకాయుడైనా, యినుప గోడలైనా విరిగిపడవలసిందే! ఆ కిక్‌లో అంత శక్తి వుంది. ఇది కరాటేలో ఒక భాగం.

క్షణం ఆలోచించి, జితేంద్ర ఏం చేయాలో నిర్ణయించుకున్నాడు.

ముజఫర్ ఖాన్‌కి తన డ్రెస్ వేసి, తను ముజఫర్ ఖాన్ దుస్తుల్ని ధరించేడు. తలుపులకి తాళం బిగించి ముజఫర్ ఖాన్ రూమ్‌లో దూరి, మేకప్ బాక్స్‌ని వెదికి పట్టుకుని అచ్చంగా ముజఫర్ ఖాన్‌లా తయారయ్యేడు.

జితేంద్ర చిన్నప్పుడు చేసిన 'మిమిక్రీ' ప్రాక్టీసంతా యిప్పుడు పనికొస్తోంది. ఎవరి గొంతైనా ఒకసారి వింటే చాలు, యిట్టే పట్టేస్తాడు జితేంద్ర.

డ్రాయర్‌లో వున్న ముజఫర్ ఖాన్ డైరీ తిరగేసేడు. అతని కళ్ళు మెరిసేయి. అతనికి కావలసిన 'కోడ్ వర్డ్' అందులో వుంది. కోడ్ వర్డ్ చెప్పనిదే యెవర్నీ లాబ్‌లోకి విడిచిపెట్టరు. ముజఫర్ ఖాన్ కోటు జేబులో ఐడెంటిటీ కార్డుకూడా వుంది.

తృప్తిగా నిట్టూర్చి బయటికి నడిచేడు.

సెక్యూరిటీ గార్డులు జితేంద్రని పోల్చలేదు.

"సోల్జర్స్! లోపల యిండియన్ ఏజంట్ బంధించబడి వున్నాడు. అతను అఖండుడు. నా గొంతును అనుకరిస్తూ మిమ్మల్నందర్నీ మోసగించవచ్చు. పొరపాటున తలుపులు

తెరిచేరా మీమీద పులిలా లంఘించి మీ పీకలు కత్తి రించేస్తాడు. తప్పించుకుపోయేడా మీ పీకలు తెగిపోతాయ్ జాగ్రత్త'' ముజఫర్ ఖాన్ గొంతును అనుకరిస్తూ చెప్పేడు జితేంద్ర.

సోల్జర్స్ మౌనంగా తలూపేరు.

# 11

జీపెక్కి స్టార్ట్ చేసి, బయటకి దూకించేడు జితేంద్ర.

రివ్వున దూసుకుపోతూ రెండు చెక్ పోస్టుల్ని దాటి పోయింది జీప్. జీప్‌లో వున్నది ముజఫర్ ఖాన్ కావడం వల్ల చెక్ పోస్టుల్లోని అధికారులు జీప్‌ని ఆపే ప్రయత్నం చేయలేదు.

మూడవ చెక్ పోస్టుదగ్గర గేటు వేసివుండటంతో జీప్ ఆపక తప్పింది కాదు జితేంద్రకి. అతని గుండెలు దడదడ లాడేయ్.

''యువర్ అయిడెంటిటీ ప్లీజ్!'' జీపుదగ్గరికి పరిగెట్టు కొచ్చి అడిగేడు ఓ అధికారి.

కోటుజేబులో వున్న అయిడెంటిటీ తీసి చూపించేడు. అతను చూసి యిచ్చేసేడు.

''సారీ సర్!'' వెనక్కి తప్పుకున్నాడు. గేటు లేచింది.

జీపు రయ్‌మని దూసుకుపోయింది.

ఒక గండం గట్టెక్కిందనుకున్నాడు జితేంద్ర.

లాబరేటరీ గేటుముందు జీపుని ఆపేరు మళ్ళీ.

ఆ ఒక్క గేటు దాటితే తన నెవరూ అడ్డగించలేరను కున్నాడు జీతేంద్ర.

ఒక అధికారి పరిగెట్టుకు వచ్చి "గుడ్ వర్డ్ ప్లీజ్" అని అడిగేడు.

"వర్షాలు బాగా పడుతున్నాయా?" అన్నాడు.

"జీ సాబ్!" అని గేటు తెరవమని సైగ జేసేడు.

జీప్ తిన్నగా లోనకి దూసుకుపోయింది. 'ఎక్స్ప్లోజివ్స్' అనే బోర్డు కనిపించింది. సడన్ బ్రేక్‌తో దాని ముందు ఆగింది.

జీపు దిగి ఎక్స్ప్లోజివ్స్ వేపు నడిచేడు. అక్కడ నిలబడివున్న గార్డుని తలుపు తెరవమని ఆజ్ఞాపించేడు.

ఆ గార్డు యెదురు చెప్పకుండా తలుపు తెరిచేడు.

లోపలికి వెళ్ళేడు జితేంద్ర. ఎక్స్ప్లోజివ్స్ క్లర్కు తన ముందు అకస్మాత్ గా ప్రత్యక్షమైన ముజఫర్ ఖాన్ ని చూసి కంపించిపోతూ లేచి సెల్యూట్ చేసేడు.

గంభీరంగా తల పంకించి "అన్నీ చెక్ చేయాలి" అన్నాడు జితేంద్ర.

"చెకింగ్ రేపటిరోజు కదా?" ఆశ్చర్యాన్ని మనసులో అణుచుకుంటూ అన్నాడు.

"అయితే! ఇవేళ చెక్ చేయకూడదా?" ఉరిమినట్టుగా చూసేడతని వేపు.

"మీ యిష్టం సార్" అని ముందుకి నడిచేడు.

లోపల అడుగుపెట్టడంతో నే ఒకే ఒక దెబ్బకొట్టేడు జితేంద్ర. అంతే! ఎక్స్ప్లోజివ్స్ క్లర్కు కూలిపోయాడు.

జితేంద్ర గబగబ లోపలికెళ్ళి రెండు రివాల్వర్స్, కొంత ఎమ్యూనికేషన్ తీసి, కోటుజేబులో నింపుకున్నాడు. 'టైంబాంబ్' అని స్లిప్ అంటించిన అరలోంచి

మూడు టైంబాంబ్‌లు తీసేడు. మరికొన్ని హేండ్ బాంబ్స్‌ని జేబులో కుక్కుకున్నాడు.

టైంబాంబ్స్ అన్నీ మరోగంట తర్వాత పేలేట్టు ఎరేంజ్ చేసి, ఒకటి ఆ గదిలో వుంచేను.

బయట గార్డుకి ఏం అనుమానం వచ్చిందో గబుక్కున లోపల ప్రవేశించేడు. లోపల జరుగుతున్నదంతా గ్రహించేడు.

"హేండ్సప్" అరిచేడు.

అంతే! యిక ఆలస్యం చేయలేదు జితేంద్ర. అతని చేతిలోని పిస్తోలు నిప్పులు గక్కింది. కుప్పలా కూలి పోయేడు.

గబగబ బయటికి నడిచేడు.

ఆ రూమ్‌కి కొంచెం దూరంలో వైర్ లెస్ స్టేషన్ వుంది. మరికొంచెం దూరంలో అసలైన లాబరేటరీ వుంది. వైర్ లెస్ స్టేషన్ వేపు అడుగులేసేడు.

బ్లడ్ హౌండ్స్ తనని గుర్తు పడతాయేమోనని గుండెలు దడదడలాడుతున్నయ్ జితేంద్రకి. అదృష్ట వశాత్తూ ఏవీ దరిదాపుల్లో లేవు.

వైర్ లెస్ స్టేషన్ ప్రక్కనవున్న గడ్డిపొదల్లో ఒక ఒక టైంబాంబ్ జారవిడిచేడు. చకచక లాబరేటరీ వేపు అడుగులేసేడు.

లాబ్‌లో ప్రతి ఒక్కరి సెల్యూట్ అందుకుంటూ ముందుకి సాగిపోయేడు.

లాబ్ అంతా తిరిగి ముఖ్యమైన చోట బాంబ్స్ యెరేంజ్ చేసేడు. అంతటితో తన పని పూర్తయినట్టుగా గాలి పీల్చి వెనక్కి తిరిగేడు.

అదిరిపడ్డాడు.

ఎదురుగా ఓ అధికారి!

అతని చేతిలో పిస్తోలు నిగ నిగ లాడుతూ మెరుస్తోంది.

"బద్మాష్! ఎవరున్నవ్?" జితేంద్ర గుండెల్లో రైళ్ళు పరిగెత్తేయి.

మెరుపులా కదిలేడు జితేంద్ర. చెంగున గెంతి, ఆ వ్యక్తి చేతిలోని పిస్తోలు యెగరగొట్టి, మెడమీద ఒక టిచ్చేడు, ఇంకో చేత్తో నోరు మూసి. కిక్కురుమనకుండా నేలకూలిపోయేడు. కూలిపోయిన అధికారిని వెనుక వేపు తలుపుగుండా బయటికి నెట్టేడు, యెవరూ చూడకుండా.

వెనుక నేంచో అలికిడయింది. గిర్రున వెనక్కి తిరిగేడు. గార్డు!

"సాబ్! డైరెక్టర్ సాబ్ మిమ్మల్ని రమ్మంటున్నారు" అని చెప్పేడు గార్డు.

"అచ్ఛా! తుమ్ జావ్" అని చెప్పి, వెంటనే బయల్దేరేడు డైరెక్టర్ దగ్గరికి.

గార్డు ముందర వెళుతుంటే అతన్ననుసరించి డైరెక్టర్ రూమ్‌లో ప్రవేశించేడు.

"పిలిచేరట..." అన్నాడు జితేంద్ర డైరెక్టర్ ఎదురు పడగానే.

"హూ ఆర్ యూ మిస్టర్?" తాపీగా అడిగేడు డైరెక్టర్ నవ్వి.

తను ముజఫర్‌ఖాన్ కాదని యెలా గుర్తుపట్టాడో అర్థంకాలేదు జితేంద్రకి.

"ఎలా తెలిసిందని ఆశ్చర్యపోతున్నావా మిస్టర్

జితేంద్ర! బంగ్లాదేష్ యింటలిజెన్స్ డిపార్ట్‌మెంట్ అసిస్టెంట్ డైరెక్టర్ ముజఫర్‌ఖాన్ యెప్పుడు లాబరేటరీలో అడుగుపెట్టినా నన్ను వెంట తీసుకెళ్ళేవాడు. ఇకపోతే ముజఫర్‌ఖాన్‌ని రమ్మని పిలిచేంత అధికారాలు నాకు లేవు. నిజంగా నువ్వు ముజఫర్‌ఖాన్ వయితే ఈ సరికి తన్ను రమ్మని పిలిపించినందుకు ఉగ్రుడై నామీద విరుచుకు పడేవాడు. అర్థమైందా?...'' అన్నాడు నవ్వి.

వాచీ చూసుకున్నాడు జితేంద్ర.

ఇంకో పది నిముషాల్లో టైంబాంబ్స్ పేలుతాయి. లాబరేటరీ ధ్వంసమైపోతుంది. ఈలోగా తను తప్పించుకోవాలి.

''అర్థమైంది... కాని తెలుసుకున్న నువ్వు బ్రతికుండవు'' చటుక్కున పిస్తోలు తీసి అతని గుండెలకి గురిపెట్టేడు. కాని పిస్తోలు అతని చేతిలో యెంతోసేపుండలేదు. పైనున్న మేగ్నెట్ అతని చేతుల్లోని పిస్తోల్ని ఆకర్షించి పైకి లాక్కుంది.

మేగ్నెట్‌ని చూస్తున్నట్టు చూసి ఒక్కదూకు దూకి డైరెక్టర్ పీక పట్టుకున్నాడు జితేంద్ర. జితేంద్ర చేతిలో విలవిలలాడిపోయేడు డైరెక్టర్. జేబులోంచి రెండో పిస్తోల్ని తీసి, దాని పిడితో డైరెక్టర్ తలమీద కొట్టేడు. అంతే! డైరెక్టర్ చిన్నగా మూలుగుతూ స్పృహతప్పి పడిపోయేడు.

పిస్తోల్ని మేగ్నెట్ రేంజ్ నుంచి తప్పిస్తూ బయటికి పరిగెత్తేడు జితేంద్ర.

## 12

డైరెక్టర్ ఆఫీసునుంచి ఏర్‌పోర్టువైపు పరిగెత్తేడు జితేంద్ర.

సెక్యూరిటీగార్డులు జితేంద్రని చూస్తూనే సెల్యూట్ చేసేరు.

"నాకో హెలికాప్టర్ కావాలి. పైలట్‌ని పిలవండి. క్విక్!" అని ఆజ్ఞాపించేడు జితేంద్ర గార్డ్సుని.

సెక్యూరిటీగార్డులకు అనుమాన మొచ్చింది.

"హూ ఆర్ యూ?" అన్నారు హఠాత్తుగా తుపాకులు గురిచేసి.

"డామిట్! నన్నే అడుగుతారా?" అన్నాడు జితేంద్ర కోపం నటిస్తూ

"షటప్! ఇంకా ముజఫర్‌ఖాన్‌లా నటించాలని ప్రయత్నించకు. ఆయనే అయితే పైలట్‌ని తనే స్వయంగా పిలుచుకునేవారు. నీలాగ మమ్మల్ని ఆజ్ఞాపించే వారు కాదు."

జితేంద్ర గుండెలు దడదడలాడేయి.

అయినా, యిక ఆగదలచుకోలేదు. మెరుపులా కదిలింది జితేంద్ర చెయ్యి.

రివాల్వర్ ఆరుసార్లు గర్జించింది. సెక్యూరిటీ గార్డులందరూ కూలిపోయేరు. తుపాకీ ప్రేలుళ్ళు వినిపించడంతో దూరంగా ఉన్న సార్జంట్‌లు పరిగెత్తుకు రాసాగారు.

అది గమనించి, హెలికాప్టర్ వేపు పరుగుతీసేడు. ఒకే జంప్‌తో హెలికాప్టర్‌లో పడి వెంటనే దాన్ని స్టార్టు చేసేడు. తర్ఫీదు పొందిన జితేంద్రకి తప్ప అంత వేగంగా స్టార్టు చేయడం యింకొకరికి సాధ్యం కాదేమో!

హెలికాప్టర్ మెల్లిగా పైకి లేచింది. పరిగెత్తుకొచ్చిన సెక్యూరిటీ గార్డులు, సార్జంటులు పొజిషన్సు చూసుకునే సరికి హెలికాప్టర్ రేంజ్ దాటిపోయింది.

హెలికాప్టర్‌లోంచి మిగిలిన బాంబ్‌లు పడేసేడు, ఆ ఏర్‌పోర్టుమీద.

రెండు క్షణాల్లో ఏర్‌పోర్టు అంతా నాశనమయి పోయింది.

హెలికాప్టర్ ఇండియా బోర్డర్ వేపు పయనించ సాగింది.

ఇంతలో క్రిందనుంచి ఏంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్ పేలి సాగినయ్!

క్రిందికి చూసేడు జితేంద్ర.

ఎలా తెలిసిందో కాని హెలికాప్టర్ మీద దండ యాత్ర ప్రారంభమైంది. ఇంతలో కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుగు కనిపించింది జితేంద్రకి. దూరంగా మంటలు ఆకాశాన్నంటుతూ లేచేయి. పేలుళ్లు ప్రతిధ్వని స్తున్నయ్. ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్ గర్జించడం మానే సాయ్.

సరిహద్దుని సమీపించసాగింది హెలికాప్టర్!

హఠాత్తుగా అటూ యిటూ వూగింది హెలికాప్టర్. అదిరిపడి చూసేడు జితేంద్ర, ఫ్యూయల్ యిండికేటర్ వేపు.

డేంజర్‌ని చేరిపోయింది యిండికేటర్!

క్రిందికి చూసేడు.

సరిహద్దుదళాలు మోహరించి వున్నాయ్, హెలి కాప్టర్‌ని చూస్తూ.

సరిహద్దు దాటుతుండగా హెలికాప్టర్‌లోంచి దూకే సేడు జితేంద్ర. అదృష్టం అతని పక్షాన వుంది. సరిగ్గా అతను నదిలో పడ్డాడు. నదిలో పడుతూనే స్పృహ తప్పి పడిపోయేడు.

తిరిగి కళ్ళు తెరిచేసరికి హాస్పిటల్లో ఉన్నానని గ్రహించేడు జితేంద్ర. అతని మంచంచుట్టూ డైరెక్టర్ శివరామ్, సెక్రెటరీ రోషన్, ఇతర క్రైంబ్రాంచ్ ఏజంట్లు ఉన్నారు.

"బాస్!..." అని మాత్రం అనగలిగేడు జితేంద్ర.

"యస్ మై బోయ్!" అంటూ భుజం తట్టారాయన.

"నేనిక్కడికెలా వచ్చేను బాస్?"

"మన సరిహద్దు దళాలు హెలికాప్టర్ నదిలో కూలిపోవడం, కూలిపోయేముందు యెవరో ఒకరు నదిలో దూకడం గమనించి, నిన్ను ఒడ్డుకు చేర్చేరు..." అని చెప్పాడు డైరెక్టర్ శివరామ్, జితేంద్రని తృప్తిగా చూస్తూ.

—:ఐపోయింది:—

# అందరూ మోసగాళ్లే!

సంపత్

"నా పేరు శాంతి" అందామె.

ఆమె వంక పరిశీలనగా చూశాడు శంభూనాథ్. సుమారు పాతికేళ్ళ వయసుంటుందామెకు. సన్నటి కాంతివంతమయిన శరీరం. గుండ్రటి ముఖం. పెద్ద పెద్ద కళ్లు. కొనతేలిన నాశిక. స్కర్ట్ ధరించటంవల్ల ఒంపులు కనిపిస్తూ సెక్సీగా ఉంది.

శంభూనాథ్ అంతకుముందు ఎంతోమంది ఆడవాళ్లను చూశాడు. శాంతికంటే అందమయిన, సెక్సీ అయిన వాళ్ళనికూడా చూశాడు. కాని శాంతిలో ఏదో వెరైటీ ఉంది.

"కమాన్" అన్నాడు సీటుమీదకు వాలి అవతలి డోర్ తెరుస్తూ.

"థాంక్స్!" అంది శాంతి కారులో కూర్చుంటూ.

అప్పటికి రాత్రి పది గంటలు కావస్తూంది. వాతావరణం చల్లగా ఉండి వర్షం వొస్తుందేమో నన్నట్లు ఉంది

"నా పేరు శంభూనాథ్...!" అన్నాడు శంభూనాథ్.

"తెలుసు. కాంతీలాల్ చెప్పాడు" అంది కాంతి.

"ఇంకేం చెప్పాడు?"

"నాకు ఫోన్ చేసి ఫలానా చోట ఉండమని, మిమ్మల్ని పరిచయం చేసి, మీ వెంట వెళ్ళమని చెప్పాడు."

"కాంతిలాల్ కి యెలా పరిచేయమయ్యావ్?" అడిగాడతను.

"సారీ! అది మీ కనవసరం అనుకుంటా" అంది కాంతి రోడ్డువంక చూస్తూ.

శంభూనాథ్ ఒక చేత్తో స్టీరింగ్ కంట్రోల్ చేస్తూనే రెంటో చేత్తో ఆమె నడుంచుట్టు చేతులు వేసి అదుముకున్నాడు తన వేపు.

ఇరవై నిముషాల తరువాత ఒక కాంపౌండులోకి ప్రవేశించింది కారు.

లోపల బొమ్మరిల్లులా చిన్నగా, చక్కగా ఉందో రెండంతస్తుల భవనం. కాంపౌండ్ లో మరో వేపు కారు షెడ్ ఉంది.

కాంతిని యింటిముందు దింపి, షెడ్ లో కారుని ఉంచి వచ్చాడు శంభూనాథ్.

ఇద్దరూ లోపలికిపోయారు. ఆధునిక సదుపాయాలతో విలాసవంతంగా ఉంది యిల్లు. మరో మనిషెవ్వరూ కన్పించలేదామెకు.

కోటును స్టాండ్ కి తగిలించి, టైను వదులు చేస్తూ అద్దంలోంచే చూశాడు శంభూనాథ్. కాంతి ఆ గదిని పరీక్షగా చూస్తోంది.

అప్పుడే పొలికేక పెట్టింది ప్రక్కనేవున్న ఫోను. విసుగ్గా ఫోనందుకున్నాడు శంభూనాథ్.

"శంభూ స్పీకింగ్" అన్నాడు.

"నేను వాల్మీకిని మాట్లాడుతున్నాను. వెంటనే స్వాగత్ బార్‌లో నన్ను కలుసుకో," అని వినిపించింది అటునుంచి.

"ఇప్పుడా?..." విసుగ్గా అన్నాడు శంభూనాథ్.

"ఇమీడియట్‌గా. ఓ గంటలో వెళుదువుగాని" ఫోన్ పెట్టేసిన చప్పుడయింది.

"ఓ. కె. హనీ! ఓ గంటన్నరలో వస్తాను. నిద్ర పట్టకపోతే..." అంటూ టేప్ రికార్డర్, రికార్డ్ ప్లేయరు, మాగజైన్స్‌వంక చేయి చూపించాడు.

అరగంట తరువాత క్రిందనుంచి కారు వెళ్ళిపోయిన శబ్దం అయింది.

కాంతి లేచి నైట్ గౌన్ వేసుకుని, ఆ గదిలోని వస్తువులను పరిశోధించ నారంభించింది.

## 2

"నీ కోసం మధ్యాహ్నంనుండి ప్రయత్నిస్తున్నాను" అన్నాడు వాల్మీకి.

అతనికి యాభై ఏళ్ళుంటాయి. జుట్టంతా నెరిసి పోయింది.

"ఎందుకు?" అని ప్రశ్నించాడు శంభూనాథ్ బ్రాందీ సిప్ చేస్తూ.

ఇద్దరూ బార్‌లో ఒక మూలగా కూర్చొని ఉండటం వల్ల వారి మాటలు యితరులు వినే అవకాశంలేదు.

"ఈ రోజు ఉదయం ఇంటలిజెన్స్ డైరెక్టర్ తంగరాజు నన్ను కలుసుకున్నాడు. ఓ పని అప్పచెప్పాడు. ప్రతిఫలం అయిదు వేలు."

"ఏమిటా పని?"

"ఇది తంగరాజ్ పర్సనల్ ఎఫైర్‌లా ఉంది. ఏ విషయమూ చెప్పలేదు. మొన్న రాత్రి ఓ యువతి తంగరాజుకి ఫోన్ చేసి తనదగ్గర ఒక ముఖ్యమయిన సమాచారం అమ్మకానికి ఉందని, అది తంగరాజుకి ఉపయోగపడేదని చెప్పి అవసరం అనుకుంటే హోటల్ మనోరమలో 106 నెంబరు గదిలో తనను కలుసుకోమని చెప్పిందిట. తంగరాజు తరఫున నువ్వామెను కలుసుకోవాలి."

"అంటే?"

"ఆమె యే సమాచారం అమ్మదలుచుకుందో, తంగరాజుకి నిజంగా ఉపయోగపడుతుందో, లేదో నువ్వు తెలుసుకోవాలి. ఏ విషయమూ తంగరాజే నిర్ణయం తీసుకుంటాడు."

"ఇది చాలా సింపల్!" అన్నాడు.

"నిజమే అఫీషియలుగా అప్రోచ్ అయ్యే అవకాశం లేదు. అందుకే నన్ను కలిశాడు తంగరాజు."

"ఈపని నువ్వే చేయవచ్చుగా?"

"లుక్ హియర్ శంభూ! ఇంతవరకు యిద్దరం కలిసి చట్టబద్ధంగానూ, చట్ట వ్యతిరేకంగానూ ఎన్నో పనులు చేశాము. అప్పుడప్పుడు అధికారులకి కూడా తోడ్పడ్డాము. మన పలుకుబడికి నిదర్శనం తంగరాజే. తన సిబ్బంది జేయలేని పనులను కొన్నింటిని మనచేత ఆయన చేయించాడు. నాకా వయసయిపోయింది. ఇకనుంచి నువ్వే అన్ని పనులు చూసుకోవాల్సి ఉంటుంది. ఏమంటావ్?"

తలాడించాడు శంభునాథ్. "ఆల్ రైట్. ఆమెని ఎప్పుడు, ఎలా కలవాలి?"

"ఆమె పేరు షీలా" అంటూ వివరాలు చెప్పాడు వాల్మీకి.

తరువాత తనగదికి తిరిగి వచ్చేశాడు శంభునాథ్. అయితే శాంతి అతనికి కన్పించలేదు.

నిద్రముంచుకు రాగా బెడ్ మీద వాలిపోయాడు.

# 3

బజర్ మోగగానే "కమిన్" అన్నాడు తంగరాజు విసుగ్గా.

తలుపు తెరుచుకొని 'కోకిల' లోనికి ప్రవేశించింది. ఆమెని చూడగానే తంగరాజులోని విసుగు ఎగిరి పోయింది. చిరునవ్వుతో "కూర్చో" అన్నాడు.

కోకిలకు ముప్ఫైయేళ్ళ వయసుంటుంది. చిన్నవయసు లోనే ఇంటలిజన్స్ శాఖలో మంచిపేరు సంపాయించింది. ముఖ్యంగా విదేశీ వ్యవహారాలలో. తిన్నయింటి వాసాలు లెక్కబెడుతున్న ఇద్దరు, ముగ్గురు భారతీయ అధికారులను చాకచక్యంతో బంధించి తంగరాజు అభిమానానికి పాత్రురాలయ్యింది. ఇతరులు చూడకూడని ఫైల్సు కూడా ఆమె చూస్తుండటమేగాక, తంగరాజుకి సలహాలు కూడా యిస్తుండేది.

కోకిల రబ్బరు బొమ్మలా వుంటుంది. నిరంతర వ్యాయామంవల్ల ఒళ్ళు గట్టిపడి స్త్రీత్వం కొంచెం తగ్గినట్లన్పించినా, చూపరులకామె అవయవ బింకం మతి పోగొడుతుంది.

"ఏమిటి ఈ వేళప్పుడు వచ్చావ్?" అన్నాడు తంగరాజు.

"ఉదయం మీరు వాల్మీకిని కలుసుకున్నారు కదూ?" సూటిగా అడిగింది కోకిల.

తంగరాజు ముఖం పాలిపోయింది. తమాయించుకుని "నీ కెలా తెలుసు?" అన్నాడు.

"నేను చూడటం తటస్థించింది. వాల్మీకి మనకు అప్పుడప్పుడు సహాయపడతాడని నాకు తెలుసు. అయినా అతను ప్రమాదకారి. ఎందుకు కలుసుకోవలసి వచ్చింది?"

ఆమె కంఠంలోని అధికారం తంగరాజుకి బాధ కలుగచేయటంలేదు. తన కూతురిగా భావిస్తుంటాడతను.

"చెబుతాను. నిన్న సాయంత్రం ఒక యువతి నాకు ఫోన్ చేసింది. తన దగ్గర ఏదో ముఖ్యమయిన విషయం వుందని కొనదలుచుకుంటే కలుసుకోమని చెప్పింది. ఆ విషయం ఏమిటో చెప్పలేదు సూచనప్రాయంగానైనా. బహుశా మన శత్రుదేశ రహస్యాలయివుంటాయనుకుంటున్నా. ఏ విషయం తెలీకుండా అఫీషియల్ గా అప్రోచ్ కాకూడదు గనుక వాల్మీకిని కలుసుకున్నాను. తన మనిషిని పంపి, ఆ విషయమేమిటో తెలుసుకుంటానన్నాడు."

"ఎవరిని పంపాడు?"

"తెలియదు. వాల్మీకి ఆ వివరాలు చెప్పడు" అన్నాడు తంగరాజు ఏదో ఆలోచిస్తూ.

## 4

ఉదయం స్నానానికి వెళ్ళబోతూ వాల్మీకిని ఫోన్ లో కాంటాక్టు చేయటానికి ప్రయత్నించాడు శంభూనాథ్. ఎవరూ అవతల ఫోన్ ఎత్తకపోవటంవల్ల స్నానానికి వెళ్ళిపోయాడు. ఎందుకంటే వాల్మీకి ఒంటరి పక్షి. అతను తప్ప యింట్లో ఎవరూ వుండరు.

అరగంట తరువాత మరలా ఫోన్ చేశాడు. ఈ సారి కూడా సమాధానం నిల్. ఇంత వుదయాన్నే సామా

స్వయంగా వాల్మీకి ఎక్కడికీ వెళ్ళడు. పెద్ద కొడుక్కని వాల్మీకి యింటికి బయలుదేరాడు శంభూనాథ్. దాదాపు తొమ్మిది గంటలకు చేరుకున్నాడు.

తాళం వేసిలేదు యింటికి. కాలింగ్ బెల్ మోగించాడు. రెండు, మూడు నిమిషాలు గడిచినా ఎవరూ తలుపు తీయలేదు.

ఏదో అనుమానం వచ్చింది శంభూనాథ్ కి. తలుపు తెరుచుకొని లోనికి పోయాడు.

బెడ్ రూంలో కన్పించిన దృశ్యాన్ని చూసి అదిరి పడ్డాడు.

వాల్మీకి ఒక కుర్చీలో కట్టి వేయబడివున్నాడు. అతడి శరీరం అంతా రక్తంతో తడిసిపోయింది. అతడి ముఖంలో భయంకరమయిన చిత్రహింసలు అనుభవించిన దృశ్యం గోచరిస్తోంది.

ఇల్లంతా ఎవరో చిందరవందర చేశారు. ఎవరు చేశారు? ఎందుకు చేశారు? తంగరాజు కేసుకి, యీ హత్యకి సంబంధం వుందా? లేక పాతశత్రువు లెవరైనా చేశారా?

జులాయిగా తిరుగుతున్న తనని చేరదీశాడు వాల్మీకి. పెంచి, పెద్ద చేశాడు. ఏమయినాసరే వాల్మీకిని చంపిన హంతకులను ఊరికే వదలకూడదు.

ఇల్లంతటిని పరీక్షించి, బయటవున్న కారెక్కి వెళ్ళిపోయాడు శంభూనాథ్.

వేగంగా దూసుకుపోతోంది ఫియట్ కారు. అలా వేగంగా డ్రైవ్ చేయడం శంభూనాథ్ కి యిష్టం. పనున్నా లేకపోయినా అలా వేగంగా ప్రయాణిస్తుంటాడు ఎప్పుడూ. అయితే డ్రైవింగ్ లో ఎక్స్ పర్ట్ కావటం వల్ల ఇంతవరకు ఆక్సిడెంట్సేమీ జరగలేదు.

అతని మనస్సు వాల్మీకి హత్యగురించే ఆలోచిస్తోంది. ఆతని హత్య తంగరాజును కలుసుకున్న తరువాతే జరిగింది. అంటే తంగరాజు తెలుసుకోమన్న విషయానికి వాల్మీకి హత్యకు సంబంధం వుందా? ఆ యువతి ఎవరు? ఏ దేశస్థురాలు? ఈ హత్యకి ఆమెకి సంబంధం వుందా?

తన ప్రోగ్రామ్ ప్రకారం ఈ రోజు రాత్రి పది గంటలకు 'మనోరమ'లో కలుసుకోవాలామెను. ఈ లోపు చూడటానికి వీలు లేదు. అలా అని ఆమె హెచ్చరించిందట కూడా.

సిగరెట్ తాగాలన్పించింది శంభూనాథ్‌కి. కారు స్లో చేసి సిగరెట్ పెదవుల మధ్య వుంచుకుని, లైటర్‌తో వెలిగించుకున్నాడు. రింగురింగులుగా పొగలు వదులుతూ ముందుకు చూశాడు.

అప్పుడు పడింది అతని దృష్టి రియర్ వ్యూ మిర్రర్‌లో. నల్లరంగు ఫోర్డు కారొకటి కొంచెం దూరంలో వస్తోంది. లోపల నలుగురయిదుగురు మనుషులున్నట్లున్నారు. రూపురేఖలు సరిగా కన్పించటం లేదు. ఎవరు వీళ్లు? తనని అనుసరిస్తున్నారా?

మరికొద్ది సేపటికే ఆ కారు తనని అనుసరిస్తున్న సంగతి రూఢి అయింది శంభూనాథ్‌కి.

ఒక హోటల్ ముందాగి, సుష్టుగా భోజనంచేసి వచ్చాడు. ఫోర్డు కారు యింకా దూరంగానే వుంది ఆగి.

ఇంకా వదలలేదన్న మాట తనని. వాళ్ళతో తగాదా పెట్టుకోవటం కంటే వాళ్ళ ఉద్దేశం ఏమిటో కనుక్కుంటే సరిపోతుంది. అందుకే ఏమీ ఎరగనట్లు కారెక్కి తనయింటికి చేరుకున్నాడు శంభూనాథ్.

షెడ్‌లో కారునుంచేటప్పుడు గమనించాడు అతను. కారులోని మనుషులు యిద్దరు దిగి, బంగళా వెనక్కి చేరుకుంటున్నారు. దిగ్బంధనం చేయబోతున్నారన్న మాట!

నవ్వుకుంటూ తన గదిలోకి నడిచాడు. బాత్‌రూంలోకి పోయి బాత్‌టబ్‌లో తడిమి ఏదో నొక్కాడు. వెంటనే గోడమీద చిన్న పలక పక్కకి తప్పుకుని అర ఒకటి దర్శనం యిచ్చింది. జేబులోంచి ఏదో తీసి అందులో వుంచాడు శంభూనాథ్.

అర మూసేసి బయటికి వచ్చాడు. బంగళా తలుపులు అన్నీ బంధించి, బోల్టులు బిగించాడు. వెలుపలి నుంచి లోనికి రాకుండా సర్వసన్నాహం చేసుకుని బెడ్ మీద వాలాడు.

క్షణాల్లో నిద్ర పట్టిందతనికి.

## 5

సాయంత్రం అయిదు గంటలు. స్నానం అవీ ముగించుకుని ట్రిమ్‌గా తయారయ్యాడు. రివాల్వర్ తీసుకొని లోపల భద్రపరచి కిటికీ సందులోంచి చూశాడు. ఫోర్డు కారు కాని, మనుషులుగాని కన్పించలేదు. వెనుకవున్న మనుషులు కూడా అదృశ్యమయ్యారు.

కారులో బయలుదేరాడు. కొన్ని గజాలయినా వెళ్ళకముందే ప్రత్యక్షమయింది యింకో కారు. "వదల్లేదన్న మాట!" అనుకుని క్లబ్ కేసి పోనిచ్చాడు కారుని.

ఎనిమిది గంటల వరకు పేకాడాడు. తరువాత బయటకు వచ్చి ఏదో రెస్టారెంట్‌కి పోయి భోజనం చేశాడు.

అప్పటికి రాత్రి తొమ్మిదిగంటలయింది. ఇంకా గంట పైముంది ఆ యువతిని కలుసుకోవటానికి.

వెనకబడిన కారుని తప్పించుకోవటానికి అనేక విధాలుగా ప్రయత్నించాడు శంభూనాథ్. కాని ఆ కారు వదల్లేదు.

అప్పుడే ఒక సంగతి అతనికి తట్టింది. తనా యువతిని కల్సుకుంటే వీళ్ళు ఏదయినా ఆపద తలపెట్టవచ్చు... తాము అనుసరిస్తున్న సంగతి తనకి తెలిసినా కూడా యింత ధైర్యంగా వస్తున్నారంటే అర్థమేమిటి మరి? ఏదో ఒకటి చేయాలి.

ఏదో నిశ్చయించుకుని తొమ్మిదిన్నరకల్లా మనోరమ హోటల్ చేరుకున్నాడు.

'మనోరమ'కి అటూ యిటూ కూడా దాదాపు అను కున్నంతదగ్గరలో ఏడెనిమిదిఅంతస్థులుగలభవనాలున్నాయి వాటిల్లో ప్రతి అంతస్థులోనూ యేవో ఆఫీసులుండటమే గాక రాత్రింబగళ్ళు పనిచేసే ఆఫీసులు కూడా కొన్ని ఉన్నాయి.

కారుని తిన్నగా మనోరమకి యెడమప్రక్క ఉన్న మరో బిల్డింగ్ కాంపౌండ్ లోనికి పోనిచ్చాడు శంభూ నాథ్.

వెనకాలే వస్తున్న కారు కొంతదూరంలో ఆగింది. ఆ కారులోనుంచి ఒకడు దిగి మనోరమ హోటల్ లోనికి వెళ్ళాడు.

"వీళ్ళ అనుచరులు అంతటా ఉన్నారన్నమాట" అను కుంటూ గబగబ పైకి నడిచాడు శంభూనాథ్, లిఫ్ట్ ఉపయోగించకుండా.

ఆరవ అంతస్థులోకి పోయి చివరకు నడిచి 'మనోరమ'

హోటల్ వంక చూశాడు. అయిదంతస్థుల మనోరమ టాప్ కనబడుతోంది. క్రిందకి వెళ్ళటానికి ఒక చివర మెట్లున్నాయి.

రోడ్డుమీదకు చూశాడు మరలా. తనని అనుసరించిన కారు కన్పించటం లేదు. అంటే వాళ్ళకు తను కన బడడు.

అటూ యిటూ చూశాడు శంభూనాథ్. ఎవరూ తనని గమనించటం లేదని నిర్ధారించుకుని పిట్టగోడమీదకు ఎక్కాడు.

ఊపిరి బిగించి ఒక్కసారిగా హోటల్ మనోరమ టాప్ మీదకు జంప్ చేశాడు. అంగుళం తేడా వచ్చినా క్రిందపడి ఎముకలు నుజ్జూకావడం ఖాయం.

టప్ మంటూ మనోరమ టాప్ యొక్క పిట్టగోడ తగిలింది చేతులకి. బలంగా పట్టుకుని ఆ చీకటిలో వేలాడ సాగాడు అతను. అతని గుండెలు ఉధృతంగా కొట్టుకుంటున్నాయి. నిమిషం ఆగి పైకి పాకాడు.

ఆయాసం తీర్చుకుని మెట్లద్వారా క్రిందకి వెళ్ళాడు. వరండాకి అటూ యిటూ కాబిన్స్ మాదిరి ఉన్నాయి రూమ్స్. ఎదురయిన వెయిటర్ని అడిగి రూం నెంబర్ 106 తెలుసుకున్నాడు.

మూడో అంతస్థులోని 106 నెంబర్ రూమ్లోకి తలుపు తెరుచుకుని వెళ్ళాడు.

## 6

గదంతా పూర్తి చీకటిగా వుంది. దానికి తోడు నిశ్శబ్దంగా కూడా ఉంది. లోపల యెవరూ ఉన్నట్లు తోచ లేదు శంభూనాథ్ కి.

కళ్ళు చీకటికి అలవాటుపడిన తరువాత ముందుకు అడుగువేసి ఆగిపోయాడు. కారణం—ఒక మూల బల్ల మీదున్న లైటు వెలిగింది టక్కుమంటూ.

చిన్నగా ఉలిక్కిపడి చూశాడు శంభూనాథ్.

బల్ల కివతల కుర్చీలో కూర్చొనుందో ఆకారం. ఆ ఆకారం వెనుక లైటు ఉండటంవల్ల, కాంతివంతమయిన 'హాలో'గా ఉంది ఆకారం.

"ఎవరు?" అంటూ ప్రశ్నించిందో ఆడగొంతు.

"నా పేరు శంభూనాథ్. తంగరాజు పంపించాడు" చెప్పాడు అతను చేతిని పైకి పోనిస్తూ.

"నిన్నెందుకు పంపాడు?" ఆమె గొంతులో ఆశ్చర్యం ధ్వనించింది.

డోర్ ప్రక్కన ఉన్న స్విచ్‌ను టక్కున నొక్కాడు శంభూనాథ్. లైటు వెలగలేదు కాని, శబ్దం మాత్రం అయింది.

చిన్నగా నవ్వినట్లయిందామె "వృథా ప్రయాసపడకు. నా రూపురేఖలు నీ కనవసరం. ముందిది చెప్పు. తంగరాజు నిన్నెందుకు పంపించాడు?"

"నేను కూర్చోవచ్చా...?" అన్నాడు శంభూనాథ్.

"సారీ! కొంచెం ముందుకి రా. కుర్చీ వంటి సోఫా ఉంది" అందామె.

శంభూనాథ్ ముందుకి నడిచి, కాలికి తగిలిన సోఫాలో కూర్చున్నాడు.

ఆమె వెనుక ఉన్న లైటుకి చుట్టూ షేడింగ్ ఉండి ఉండాలి, గదిలో ఎక్కువగా కాంతి పడటంలేదు.

"మీ రేదో ముఖ్య విషయం చెబుతానని చెప్పారట, అది దేనికి సంబంధించిందో, అంత ముఖ్యమయినది కాదో, అవునో తెలుసుకురమ్మని నన్ను పంపాడు. మీరు నిరభ్యంతరంగా నాతో చెప్పవచ్చు. దానినిబట్టి తంగరాజు దానిని కొనదలుచుకున్నదీ, లేనిదీ నిర్ణయించుకోగలడు."

అయిదు క్షణాలు నిశ్శబ్దం రాజ్యం చేసిందా గదిలో. "ఆల్ రైట్! జియాలాల్ భాత్రి అన్న పేరు ఎప్పుడయినా విన్నావా?"

"జియాలాల్ భాత్రీ? ఎక్కడో విన్నట్లుంది!" సాలోచనగా అన్నాడు శంభూనాథ్ జ్ఞప్తికి తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ.

"హాంకాంగ్ లో ఇండియా ఏజంటుగా పని చేసేవాడు. సుమారు మూడు, నాలుగు సంవత్సరాల క్రితం హఠాత్తుగా మాయమయ్యాడు." అందామె గుర్తు చేస్తున్నట్లు.

"యస్. యస్. యూఆర్ రైట్. గుర్తుకు వచ్చింది" అన్నాడు నాథ్.

"అతను మాయమవటానికి ముందు దొంగచాటుగా చైనాలో ప్రవేశించి, కొన్ని ముఖ్యమయిన డాక్యుమెంట్లను, మైక్రోఫిల్మ్ తీసి పారిపోయేడు. అతని ఉనికి ఆ తరువాత యెవరికీ తెలీలేదు. ఇండియా, చైనా దేశాల ఏజంట్లు అతనికోసం తీవ్రంగా గాలింపులు జరిపారు. కాని దొరకలేదు" అంది షీలా.

"అవును" అన్నాడు శంభూనాథ్. "ఈ వివరాలు దేనికి?" అన్నాడు మరలా.

"అత నుంటున్న చోటు నాకు తెలుసు..." అందామె.

ఊపిరి బిగించి విన్నాడా మాటలను శంభూనాథ్. జియాలాల్ భార్తి ఉంటున్న చోటు ఈవిడకెలా తెలుసు? ఈమెకీ, అతనికీ సంబంధ మేమిటి?

"మీకీ వివరాలు ఎలా తెలుసు? అసలు మీరెవరు? భార్తీకి మీకు సంబంధమేమిటి? వివరంగా చెబితేగాని నమ్మటం కష్టం" అన్నాడు శంభూనాథ్.

దీర్ఘంగా నిశ్వసించిందామె.

"నేనొక క్లబ్ డాన్సర్ని. ఫ్రాన్సిస్ నేను డాన్స్ చేసే క్లబ్‌కి తరచు వస్తుంటాడు. మా యిద్దరికీ పరిచయం అయి, ప్రణయంలోకి దారితీసింది. ఫ్రాన్సిస్‌కి జియాలాల్ ఉంటున్న చోటు తెలుసు. అతని ప్రోద్బలంమీద ఈ దేశం వచ్చాను" అంది షీలా.

"ఈ దేశం అంటున్నావ్? మీదీ దేశం కాదా? జియాలాల్ యిక్కడ లేడా?" ఆశ్చర్యాన్ని అణుచుకుంటూ ప్రశ్నించాడు నాథ్.

"ఊహుఁ! మాది ఆఫ్ఘనిస్తాన్. కాబూల్‌లో ఉంటున్నాడు ఫ్రాన్సిస్. ఈ వివరాలు చాలనుకుంటాను. నే నివ్వబోయే సమాచారం భార్తీ ఉనికి గురించే. ఈ విషయం తంగరాజుతో చెప్పి ఏమంటాడో నాకు ఫోన్ చేయమను" అంది షీలా.

"బహుశా ఈ సారీ నేనేమిమ్మల్ని కలుసుకోవచ్చు" అన్నాడు శంభూనాథ్.

"ఎవరయినా నాకభ్యంతరంలేదు. తంగరాజు మనిషయితే చాలు. ఆ విషయం చెప్పినందుకుగాను నాకు పది

లక్షల రూపాయలు యిక్కవలపి ఉంటుంది. ఇండియన్ కరెన్సీ."

"మిమ్మల్నెక్కడ కలవాలి?"

"నీ ముందున్న టీపాయ్‌మీద నా ఫోన్ నెంబరుంది. రేపు రాత్రి సరిగ్గా పది గంటలకి ఫోన్ చేసి ఏ విషయమూ తెలియచేయాలి. షీలా కావాలనే అడుగు. ఈలోపు నన్నెక్కడ పట్టుకోవడానికి ప్రయత్నించకండి. ఇక నీవు వెళ్ళవచ్చు" అందామె.

మరుక్షణం లైటు ఆరిపోయింది.

టీపాయ్‌మీదున్న కార్డు తీసుకుని, అలవాటుగా డోర్ ప్రక్క స్విచ్ నొక్కాడు శంభూనాథ్.

ఈసారి మాత్రం లైటు వెలిగింది.

చటుక్కున వెనుదిరిగి చూశాడు. అంతకుముందు ఆకారం కనబడినచోట రబ్బరుబొమ్మ ఒకటి కూర్చోపెట్టబడి వుంది.

నిర్ఘాంతపోయాడు అతను. తనతో ఇంతవరకు మైక్రోఫోన్ ద్వారా మాట్లాడారనుకున్నాడు, వెనుక స్పీకర్ చూసి. ఆ గదిలో యింకెవ్వరూ కన్పించలేదు.

తిరిగి రూఫ్ మీదనుంచి ప్రక్క బిల్డింగ్ మీదకు దూకదల్చుకోలేదు. తాపీగా నడుస్తూ క్రిందకి తిరిగి వచ్చాడు. అతని ప్రత్యర్థులు అతన్ని చూసి నోరెళ్ళబెడతారని తెలుసు.

తాపీగా నడుచుకొంటూ తన కారు దగ్గరికి నడిచాడు—

అదే సమయంలో లోపల వంగి కూర్చున్న మనిషి డోర్ తెరవటమూ, వెనుకగా వచ్చిన మనిషి శంభూ

నాథ్‌ని లోనికి తోసి డ్రైవింగ్ సీట్లో కూర్చోవటమూ, కారు ఒక్క జర్క్‌తో బయలుదేరటమూ, రెప్పపాటులో జరిగిపోయాయి.

లోపల ఉన్న మనుషులమధ్య తాను బందీ అయినట్లు గ్రహించాడు శంభూనాథ్.

# 7

"మార్టిన్" అన్నాడు ఆశ్చర్యంగా వెనుకసీట్లో ఉన్న మనిషిని చూసి.

"గుడ్! గుర్తించావన్నమాట" కుటిలంగా నవ్వుతూ అన్నాడతను.

శంభూనాథ్ మెదడులో అనేక ఆలోచనలు గిర్రున తిరిగాయి. మార్టిన్, నరేష్‌లాల్ అనుచరులలో ఒకడని తనకి తెలుసు. మిగిలినవాళ్ళు కొత్తగా చేరినట్లున్నారు. గుర్తుపట్టలేకపోయాడు అందుకే.

ఈ కేసులో లాల్‌కి సంబంధమేమిటి? అతను కూడా ఆ యువతికోసం ప్రయత్నిస్తున్నాడా? వాల్మీకిని చంపింది వీళ్ళేనా?

ఉద్రేకంతో శరీరం ఉప్పొంగింది శంభూనాథ్‌కి.

"ఎందుకు బంధించారు నన్ను...?" కసిగా అడిగాడు.

"నిన్ను చంపేయబోతున్నాం!" అన్నాడు తాపీగా మార్టిన్.

"ఏడ్చారు" అన్నాడు శంభూనాథ్.

ఈడ్చి చెంపమీద కొట్టాడు మార్టిన్.

"నువ్వు, నీ బాస్ వాల్మీకి తంగరాజుతో కలిసి ఏదో గూడుపుఠాణీ జరుపుతున్నారు. ఆ తంగరాజు మా బాస్

మీద బుజావులు సంపాయించలేక యిలా అడ్డదార్లు తొక్కుతున్నాడు. వాల్మీకిని యెంత బెదిరించినా నిజం చెప్పలేదు. పూర్ ఫెలో! ప్రాణం పోగొట్టుకున్నాడు. ఇప్పుడు నీ గతీ అంతే!''

కారు నిర్జనమయిన బంగళా కాంపౌండ్ ముందాగింది. శంభూనాథ్ చేతులు వెనక్కి విరిచికట్టి లోపలికి నడిపించుకెళ్ళేరు.

భయంకరమయిన ముఖంతో, దున్నపోతులా ఉన్న ఒక వస్తాదును చూపి ''వీడి పేరు శ్యామ్. మనుషుల కాళ్ళు, చేతులు ఎముకలు విరిచేయటం వీడి పని'' అన్నాడు మార్టిన్.

ఒక గదిలో కుర్చీలో కూలేశారు శంభూనాథ్‌ని. తాళ్ళతో కట్టి బంధించారు.

''నా పెల్ మి. ఆ తంగరాజు మిమ్మల్నెందుకు కలి శాడు?'' అన్నాడు మార్టిన్ ఉరిమినట్లు.

''ఇది మరీ బాగుంది. తంగరాజు, వాల్మీకిని కలుసు కున్నాడు.''

''షటప్. వాల్మీకి నిన్ను కలుసుకున్నాడు. నాకు సమాధానం కావాలి.''

''దీనితో మీకు సంబంధముందని ఎందుకనుకుంటు న్నారు?''

''నీవిలా మాట్లాడవ్. శ్యామ్!'' అని పక్కకు తప్పు కున్నాడు మార్టిన్.

శ్యామ్, శంభూనాథ్ భుజంమీద చేయివేశాడు. టన్ను బరువు మోపినట్లయింది శంభూనాథ్‌కి. భుజందగ్గర ఉండే కీలును వెదికి పట్టుకున్నాడు శ్యామ్.

భరించలేని బాధ కలిగింది శంభూనాథ్‌కి. భుజం వేరు చేసి వళ్ళో పెట్టేటట్లున్నాడు నిజంగానే!

"చెబుతాను" అన్నాడు ముఖం చిట్లించి, శంభూనాథ్. "స్మగ్లర్ కింగ్ బాజీరావ్‌ని పట్టుకోవడానికి పథకం వేశాడు తంగరాజు. దానికి మా సహాయం కావాలన్నాడు."

"అలాగా. శ్యామ్!" అన్నాడు మార్టిన్.

భుజం వూడినట్లవుతోంది శంభూనాథ్‌కి. కళ్ళ ముందర రంగుల వలయాలు ఏర్పడుతున్నాయి.

"ఆగండి. చెబుతాను" అరిచాడు శంభూనాథ్.

"చెప్పు!" అన్నాడు మార్టిన్ వికటంగా నవ్వుతూ'

"అది నీతో చెప్పేది కాదు. నీ బాస్‌ని పిలువ్!". అన్నాడు నాథ్.

"ఇడియట్!" శంభూనాథ్ చెంప ఛెళ్లుమంది. "శ్యామ్!"

"నీ యిష్టం. నన్ను చంపినా అంతే. నీ బాస్‌తో మాట్లాడిన తరువాత నీకే అర్థం అవుతుంది" నిశ్చలంగా అన్నాడు శంభూనాథ్.

అతని కళ్ళల్లోకి సూటిగా చూసాడు మార్టిన్.

"ఆల్ రైట్ వాణ్ని జాగ్రత్తగా చూస్తుండండి. బాస్‌ని పిలుస్తాను" అంటూ బయటకు వెళ్ళిపోయాడు మార్టిన్.

నొప్పెడుతున్న భుజంని చూసుకుంటూ కూర్చుండి పోయాడు శంభూనాథ్.

# 8

తలుపు తెరుచుకొని లోనికి వచ్చిన నరేష్‌లాల్,

శంభూనాథ్‌ని చూసి "ఏమిటిది?" అని అడిగాడు సీరియస్‌గా.

"ఏం చేయను? మీ అనుచరులు నన్ను చంపబోయారు. తప్పించుకోవటానికి నిజం చెప్పడం మినహా మరో మార్గం లేదు. ఆ నిజం మీకు తప్ప యితరులకు తెలియ కూడదు."

"మార్టిన్ నా నమ్మిన బంటు" అన్నాడు నరేష్‌లాల్. "అది మీకే తెలియాలి. అలా కూర్చోండి" అన్నాడు ఎదురుగావున్న ఒక సోఫాను చూపి.

నరేష్‌లాల్ కూర్చున్నాడు. పైప్ తీసి ముట్టించాడు.

"తంగరాజుకి ఒక అజ్ఞాతయువతినుంచి ఫోన్ వచ్చింది..." అంటూ తంగరాజు వాల్మీకిని, వాల్మీకి తనను కలుసుకున్న విషయం, తాను షీలాను కలుసు కున్న విషయం వివరించాడు శంభూనాథ్.

ఆ విషయం ఆశ్చర్యంతో విన్నాడు లాల్.

"జియాలాల్ బ్రతికేవున్న సంగతి యీమెకి ఎలా తెలి సిందాట?" అన్నాడు ఆతృతగా.

"అలాగేవుంది ఆమె వాలకం. పదిహేను లక్షలు యిస్తే తప్ప అతని వునికి చెప్పనంది" అని చిన్న అబద్ధ మాడాడు శంభూనాథ్.

అయిదు నిమిషాలు ఏదో ఆలోచించుకున్నాడు. నరేష్ లాల్. "ఆల్‌రైట్ శంభూ! నువ్వు డబ్బుకోసం పని చేసేవాడివని నాకు తెలుసు. ఆ పదిహేను లక్షలుగాక మరో అయిదులక్షలు ఎక్కువే యిస్తాను. నువ్వు ఆ జియాలాల్ ఉనికి కనుక్కొని అతన్ని చంపేయాలి. ఇష్ట మేనా?" అన్నాడు.

"చంపడమా?" నిర్ఘాంతపోతూ అడిగాడు శంభూనాథ్.

"అవును. వివరాలడక్కు. మొత్తం ఇరవైలక్షలు. జియాలాల్‌ని చంపాలి ఓ, కే?"

శంభూనాథ్ కళ్ళముందు నోట్లకట్టలు గిర్రున తిరుగుతున్నాయ్. పదిలక్షలు మొత్తం! తంగరాజు తరఫున తాను పని చేస్తున్నట్లు తంగరాజుకింకా తెలియదు. తెలిసినా ఏ, పది, ఇరవై వేలో మహా అయితే యివ్వగలడు. కాని పదిలక్షలు. వదులుకోవడం ఎట్లా? ఎంతకాలం శ్రమపడితే అంతడబ్బు చూడగలడు?

యాంత్రికంగా తలూపాడు అంగీకరిస్తున్నట్లు.

"గుడ్! ఇకనుంచి నువ్వు నా తరఫున పని చేస్తున్నావు. రేపు మధ్యాహ్నం నీ యింట్లో డబ్బు అందజేయబడుతుంది. మోసం చేయాలని ప్రయత్నించక. ప్రపంచంలో ఎక్కడున్నా పట్టి బంధించగలను. నీ పని జియాలాల్ గురించి తెలుసుకోవడం, అతన్ని చంపి ఆ ఫిల్మ్ నాకు తెచ్చివ్వటం" అన్నాడు నరేష్‌లాల్.

తలూపాడు శంభూనాథ్. "కాని ఒక విషయం మీరు గుర్తుపెట్టుకోవాలి. ఆ యువతి తంగరాజు మనిషితో నే కాంటాక్టు అవుతున్నాననుకుంటోంది. నన్ననుసరించి ఆమె జాడ తెలుసుకోవడానికి ప్రయత్నించొద్దని మీ అనుచరులతో చెప్పండి. నేను తప్ప మరొకరు ఆమెని కలిసినా ఆమెకు అనుమానం రావటం ఖాయం" అన్నాడు శంభూనాథ్ హెచ్చరికగా.

"అలాగే చెబుతాను!" అంటూ బయటికి వెళ్ళాడు నరేష్‌లాల్.

తను యజమాని చేతిల్లో ఖతమవుతాడనుకున్న శంభూనాథ్ నవ్వుతూ కన్పించటంతో అయోమయంలో పడ్డారు లాల్ అనుచరులు.

## 9

మరుసటిదినం ఉదయం పదకొండు గంటలవేళ తలుపు తట్టిన చప్పుడు విని తలుపు తెరిచాడు శంభూనాథ్.

చిన్న బ్రీఫ్ కేస్‌తో లోనికి ప్రవేశించాడు మార్టిన్. "నిన్నటి వరకు శత్రువులం యివాళ మిత్రులయ్యాము! ఎంత చిత్రం!" అనుకుంటూ లోనికి నడిచాడు శంభూనాథ్.

బ్రీఫ్ కేసందించాడు మార్టిన్. తెరిచి చూశాడు నాథ్.

కళ్లు జిగేల్ మనిపించాయి నోట్ల కట్టలు. మంచం మీద కూలబడి లెక్క పెట్టాడు. మొత్తం పదిహేను లక్షలు ఉన్నాయి.

"పదిహేను లక్షలు!" అన్నాడు నాథ్.

"ఆమెనుంచి జియాలాల్ ఉనికి తెలుసుకుని, మైక్రో ఫిల్మ్ తెచ్చాక నీ డబ్బు!" అన్నాడు మార్టిన్.

"మరి ఖర్చులకి?" అసంతృప్తిగా అన్నాడు శంభూనాథ్. జేబులో నుంచి నోట్లకట్టలు తీసి అతనికందించాడు మార్టిన్. "పాతిక వేలు. అడ్వాన్స్ కాదులే!" అన్నాడు నవ్వుతూ.

వాటిని లెక్కబెట్టుకుని జేబులో వుంచుకున్నాడు శంభు.

"మరలా ఎప్పుడు కలుస్తావ్ మమ్మల్ని?" అనడిగాడు మార్టిన్.

"బహుశా లాల్ నన్ననుసరించవద్దని చెప్పుంటాడు. అయినా మీరు వూరుకుంటారా?" అన్నాడు వక్రంగా

నవ్వుతూ.

"లేదు. బాస్ ఆజ్ఞ పాటించాల్సిందే!"

"సరే! ప్రోగ్రాం ఫిక్స్ అయ్యాక పిలుస్తాను."

మార్టిన్ వెళ్ళిపోయాక అయిదు లక్షల రూపాయలు తీసి బాత్‌రూంలోని రహస్య అరలో భద్రపరిచాడు. మిగిలిన పదిలక్షలూ బ్రీఫ్‌కేస్‌లో వుంచి మూసేశాడు.

సాయంత్రం వరకు షలాసాగా తిరిగాడు. ఎనిమిది గంటలకు భోజనం ముగించి అటూ యిటూ తిరిగి, పది గంటలకు షీలా యిచ్చిన ఫోన్ నెంబర్‌కి ఫోన్ చేశాడు.

"మరో పావుగంటలో హోటల్ సుగంధలో 204 రూంలో కలువ్" అంది షీలా.

అన్నట్లుగానే పదింపావుకల్లా హోటల్ ముందాగాడు శంభూనాథ్. 204 రూం ముందు నిలబడి తలుపుతట్టాడు. "కమిన్" అంటూ విన్పించింది. లోపలికి వెళ్ళాడు.

లోపల దేదీప్యమానంగా వెలుగుతున్నాయి లైట్లు. లోపల భువనైక మోహనాంగి ఎదురు చూస్తుందతని కోసం. ఆమెని చూసి అచ్చెరువొందాడు శంభూనాథ్.

ఆమెకు పాతిక, ముప్పై ఏళ్ళకంటే ఎక్కువ వయసుండదని అంచనా వేశాడు. అయినా అంతకన్నా చిన్నదిలా కనబడుతోంది.

అమోఘమయిన అందం ఆమెది. ఎర్రటి పెదిమలు తడిగా మెరుస్తున్నాయ్. బెదిరిన లేడిపిల్లలా కనురెప్పలు టపటప కొట్టుకుంటున్నాయి. ఆమె భారతీయురాలిలా తోచలేదు శంభూనాథ్‌కి.

"మిస్టర్ శంభూనాథ్ డబ్బు తెచ్చారా?" అని అడిగింది సౌమ్యంగా. ఆమె యింగ్లీ ఉచ్చారణ ఎంతో స్పష్టంగా, చక్కగా వుంది.

తాను తెచ్చిన బ్రీఫ్ కేస్ అందించాడు శంభూనాథ్.

డబ్బు లెక్క చూసుకుని, "ఆల్ రైట్. ఉదయం ఫ్లైట్ లో నువ్వు కాబూల్ వెళ్ళు" అంది షీలా.

"నువ్వా?" అడిగాడు ఆశ్చర్యంగా శంభూనాథ్.

"నేనూ ఆ ఫ్లైట్ కే రావటానికి కృషిచేస్తాను. వీలు కాకపోతే మరో ఫ్లైట్ లో వస్తాను. తిరిగి మనం కాబూల్ లోనే బ్లూమూన్ క్లబ్ లో కలుసుకుందాం."

"ఈ డబ్బుతో వస్తావా?" ఆశ్చర్యంగా ప్రశ్నించిన అతనివంక చూసి మనోహరంగా నవ్వింది షీలా.

"నా ఏర్పాట్లు నాకున్నాయిగదా! అక్కడ ఎదురు చూడు నాకోసం."

"ఒకవేళ నీవు రాకపోతే? ఐ మీన్, రావటం డిలే అయితే...?"

ఆలోచించింకామె. "కాబూల్ కి సుమారు అరవై, డెబ్భై మైళ్ళ దూరంలో 'సరుంగ్' అనే చిన్న గ్రామం ఉంది. అక్కడ ఫ్రాన్సిస్ ఉంటున్నానని చెప్పేడు. అతణ్ని కలుసుకో. జిమ్మాలాల్ వివరాలు చెబుతాడు."

ఆ తరువాత శంభూనాథ్ బయటపడి నరేష్‌లాల్ ని కలుసుకున్నాడు.

"నీ ప్రయాణపు ఏర్పాట్లు నేను చూస్తాను. నీ యింటికి వెళ్ళు. మేకప్ మార్చి ఫోటో తీస్తాం" అన్నాడు లాల్.

అతనన్నట్లుగానే మరో గంట తరువాత ఇద్దరు మనుషులు శంభూనాథ్ ఇంట్లోకి ప్రవేశించారు.

గంట కాలంలో శంభూనాథ్ ఆకారం పూర్తిగా మారిపోయింది. కత్తిరించిన జుట్టు, తీసేసిన మీసాలు,

కళ్ళ చివర కణతలదగ్గర ముడతలుపడిన శరీరం, ఎత్తయిన నాశిక, లావుగా ఉన్న పెదాలు, గొంతు క్రిందకు జారిన చర్మపు తోలు అతన్ని నడివయస్సువాణ్ని చేశాయి. జుట్టు అక్కడక్కడ నెరిసింది.

అద్దంలో తనని చూసుకొని విభ్రాంతి పడ్డాడు శంభూనాథ్.

"నువ్వని తెలుసుగనక సరిపోయింది. లేకపోతే ఎవరో అనుకునేవాణ్ని!" అన్నాడు మార్టిన్.

మేకప్ మన్ వెళ్ళిపోయిన తరువాత ఫోటో తీసి, పాస్ పోర్ట్ వ్యవహారంలో మునిగిపోయారిద్దరూ.

# 10

"హలో! దిసీజ్ కోకిల స్పీకింగ్!" అంది కోకిల ఫోనులో.

"హలో కోకిలా! తంగరాజుని మాట్లాడుతున్నా. నీకో విషయం చెప్పాలి. వస్తావా? ఫోనులో చెప్పటం బాగోదు."

"నేనూ మీకో విషయం చెప్పాలి."

"ఏమిటి?"

"వచ్చిన తరువాత చెబుతాను. వెంటనే బయలుదేరుతున్నాను." అంది కోకిల ఫోన్ పెట్టేస్తూ.

అరగంట తర్వాత తంగరాజు యింట్లో, అతని ప్రయివేట్ గదిలో ఉంది కోకిల, తంగరాజుతో బాటు.

"వాల్మీకి హత్యచేయబడ్డాడు వారంబు చేయుగా అంతకు ముందు—అంటే చనిపోవటానికి ముందురోజు శంభూనాథ్ అనే వ్యక్తిని కలుసుకున్నాట్ట" చెప్పాడు తంగరాజు.

"శంభూనాథ్ మీ పనికోసం నియమింపబడ్డ వాడా?..."

"ఏమో చెప్పలేను. శంభూనాథ్‌ని కలుసుకుందామనుకున్నానుగాని, అతను యింట్లో లేడు."

"అతనేం చేస్తుంటాడు?" అడిగింది కోకిల.

"వోల్డ్ డెల్హీలో ఏదో వర్క్‌షాపు ఉంది. ముప్ఫయి యేళ్ళు వుంటాయి. బలంగా, భారీగా ఉంటాడు."

"అతని గురించి తరువాత విచారించవచ్చుగాని, నేను మాత్రం కాబూల్ పోతున్నాను."

"ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు తంగరాజు.

"కేసులేమీ లేవు. అక్కడ నా స్నేహితురాలు కమలాప్రధాన్ ఉందిగా. కలుసుకొని చాలా రోజు లయింది," అంది కోకిల.

"నీ యిష్టం. కబురుపెట్టగానే జాగు చేయకుండా వచ్చెయ్."

"కొంపదీసి ఏవయినా కేసు తగిలిస్తారేమిటి? ఆ పని మాత్రం చేయకండి" అంది నవ్వుతూ కోకిల.

అంతలోనే ఫోన్ మోగింది. రిసీవర్ చెవి కానించుకున్నాడు తంగరాజు. అవతలినుంచి చెప్పేది జాగ్రత్తగా విన్నాడు.

"శంభూనాథ్ గురించి నా సొంత మనుషుల్ని నియమించాను. అతని జాడ తెలియలేదుగాని, అతని ఇంట్లోకి మాత్రం మార్టిన్, మరో వ్యక్తి వెళ్ళి వచ్చారట" చెప్పాడు తంగరాజు.

"మార్టిన్? అంటే నరేష్‌లాల్ అనుచరుడు కదూ?

అతనికి శంభూనాథ్‌తో పనేమిటి?" అంది కోకిల ఆశ్చర్యపోతూ.

తంగరాజుకికూడా నరేష్‌లాల్‌కి యిందులోని ఇంట్రస్ట్ యేమిటో అర్థం గాలేదు. ఆ యువతి గురించి తరువాత సమాచారమే తెలియలేదు. ఇప్పుడేం చేసేట్లు?

కోకిల వెళుతున్నానని చెప్పినా పరధ్యానంగా "ఊఁ" అన్నాడు.

# 11

స్థానిక కాలమానం ప్రకారం ఉదయం ఆరుగంటలకు కాబూల్‌లో కాలు పెట్టాడు శంభూనాథ్, మారు వేషంలో. అతడి పాస్‌పోర్ట్, వీసా మొదలయినవి ఫోర్జరీ అని ఎవరూ కనుక్కోలేకపోయారు.

ప్రస్తుతం ఈ వేషంలో శంభూనాథ్ పేరు "లోహితా మిత్రా". పెద్ద బిజినెస్‌మన్. ఇండియాలో ఉన్న 'కంకార్ట్ ఇండస్ట్రీస్' తరఫున ఆఫ్ఘనిస్తాన్‌లో ఒక ఫ్యాక్టరీ పెట్టే నిమిత్తం పరిశీలనలు జరపటానికి వచ్చినట్లు తెలియ చేయబడింది.

అందుకు కావలసిన కాయితాలు తప్ప మరొకటి లేవు శంభూనాథ్ వద్ద. ఎవరయినా అనుమానించి అతడి గది సోదా జరిపినా నిజ వివరాలు లభ్యం కావు.

తనకు రిజర్వ్ చేయబడిన 'హోటల్ ఆలం'లోని సూట్‌లో నరేష్‌లాల్ సూచించినట్లు రెండురోజులు విశ్రాంతి తీసుకున్నాడు.

రెండురోజులు యెదురుచూసినా షీలా జాడ తెలియ లేదు. రెండవరోజున ఒక టెలిగ్రాం అందింది.

కోడ్‌లో ఉన్న దాని సారాంశం— షీలాని మర్చి పొమ్మని—అధికారులు ఆమెని పట్టుకోగా, తాము సహా

చేసినట్లు. ప్రస్తుతం పోలీసులు ఆరాతీస్తున్నట్లు తెలియ చేసి, జాగ్రత్తపడమన్నాడు మార్టిన్.

దీర్ఘంగా నిట్టూర్చాడు శంభూనాథ్. ఇహ తాను ఫ్రాన్సిస్‌ని కలుసుకోవాలి. ఆ పనిమీదే బయలుదేరుతూ టాయ్‌లెట్ అయి బార్‌లోకి వచ్చాడు శంభూనాథ్.

బీర్ తాగుతుండగా "హలో" అంటూ వినిపించింది వెనుకనుంచి.

తిరిగి చూశాడు శంభూనాథ్ ఆశ్చర్యపోతూ.

ముప్ఫైయేళ్ళయువతి నవ్వుతూ నిలబడి వుంది.

"హలో! నా పేరు కోకిల!" అంది తనను తాను పరిచయం చేసుకుంటూ.

"నా పేరు లోహితామిత్రా. మిమ్మల్నెక్కడో చూసినట్లుందే?" అన్నాడు.

"మీరొచ్చిన ఫ్లైట్‌లోనే వచ్చాను. బోర్‌గా ఉంది. కంపెనీ ఇస్తారా?" అంది నవ్వుతూ.

అంతటి అందగత్తె అడిగినందుకు మరొకప్పుడయితే ఎగిరి గంతేసేవాడే కాని, ప్రస్తుతం ఇబ్బందిలో పడ్డాడు శంభూనాథ్. ఇబ్బందిగా అటూ యిటూ చూశాడు అతను. అతనిదృష్టి బార్‌లో ఒకమూలగా ఏదో తాగుతూ తమవంక పరీక్షగా చూస్తున్న ఒక మనిషిమీద పడింది. శంభూనాథ్ తనను చూడగానే చటుక్కున తల తిప్పు కున్నాడు.

అతణ్ని గుర్తించాడు శంభూనాథ్. రజాక్ ఇదివరకు ఇండియాలో పాకిస్థాన్ ఏజంటుగా పనిచేసి, పారిపోయి వెళ్ళాడు. ఇక్కడెందుకున్నాడు? తనెవరో గ్రహించాడా?

శంభూనాథ్ సమాధానం యివ్వకపోవటంతో అతను చూస్తున్న వేపుకు చూసింది కోకిల.

తేరుకుని అన్నాడు శంభూనాథ్. "మీకు కంపెనీ యివ్వటానికి నాకు అభ్యంతరంలేదు, గాని నాకు బోలెడు పనులున్నాయి" అంటూ తప్పించుకో చూశాడు.

"జస్ట్ హాఫ్ ఏ నవర్!" అంది కోకిల అర్థింపుగా. కాదనలేకపోయాడు శంభూనాథ్.

ఇద్దరూ ఒక మూల కూర్చొని తింటూ, తాగుతూ కబుర్లు చెప్పుకున్నారు. నలభై నిముషాల తరువాత అర్జెంట్ పని ఉందని చెప్పి వెళ్ళిపోయాడు శంభూనాథ్.

అతను దూరంగా వెళ్ళగానే ఆమె దగ్గరకు నడిచాడు రజాక్. "అత నెవరో తెలుసా నీకు?..." అని అడిగాడు.

"అతని పేరు లోహితామిత్రా. కంశార్ట్ ఇండస్ట్రీస్ తరఫున వచ్చాడు" అంటూ వివరాలు చెప్పింది కోకిల.

"నో!" అంటూ నవ్వాడు రజాక్. "నీ వంటి డబుల్ ఏజంట్ మారువేషంలో ఉన్న మనిషిని కనుక్కోలేకపోవటం షేమ్. అతనే మీరు వెదుకుతున్న శంభూనాథ్" అన్నాడు.

అదిరిపడింది కోకిల. "నో! శంభూనాథ్ చనిపోయాడు. నరేష్‌లాల్ మనుషులు చంపేశారు. తంగరాజు కూడా అదే నిర్థారించాడు" అంది కోకిల ఉద్వేగంగా.

"అలా అని మీరనుకుంటున్నారు. కాని నా కతని అలవాట్లు, నడక గుర్తుంది. అతని గది సోదా చేద్దాం

పద. అతను నిజంగా కంకార్ట్ ఇండస్ట్రీస్ తరఫున వచ్చి వుంటే మాత్రం తప్పకుండా శంభూనాథే."

"ఎందుకలా అనుకుంటున్నావ్?" అంది విస్మయంగా కోకిల.

"కంకార్ట్ ఇండస్ట్రీస్‌లో నరేష్‌లాల్ పార్టనర్. అతని తరఫున శంభూనాథ్ పని చేస్తున్నాడు."

"కాని తంగరాజా..."

"శంభూనాథ్ డబ్బుకి, ఆడదానికి లొంగే ఘటం. ఇతనికి ముఖ్యమయిన సమాచారం ఏదో అంది వుంటుంది. నరేష్‌లాల్ డబ్బు ఎర చూపి లొంగదీసుకుని ఉంటాడు. అతని తరఫున పని చేస్తున్నాడన్నది ఖాయం. నాకు తెలిసినంతవరకు ఇండియా తరఫున ఎవరూ యిక్కడ ఇండస్ట్రీస్ పెట్టడానికి ముందుకు రాలేదు."

కోకిల ముఖం పాలిపోయింది. ఆలోచించేకొద్దీ రజాక్ మాటల్లోని సత్యం బోధపడసాగింది.

"రజాక్!" అంది ఆందోళనగా.

"నీవేమీ కంగారు పడకు. ఇప్పుడు మనపని మరింత సులభం అయింది. నీ అందచందాలతో వీణ్ని లొంగదీసుకో. నమ్మించు. ఆ జియాలాల్ ఉనికి కనుక్కో. తరువాత ఎంత మంది నరేష్‌లాల్‌లు వచ్చినా మనల్ని ఏమీ చేయలేరు" అన్నాడు రజాక్.

కోకిల అతను నిజంగా శంభూనాథ్ అంటే నమ్మలేక పోతోంది. ఉచ్చారణ, నడక అన్నీ మారినా కొన్ని అలవాట్లు మాత్రం మానుకోలేకపోయాడు శంభూనాథ్.

రజాక్ చెప్పేది ఎంతవరకు నిజం—అనుకుంటూ ఆలోచనలో పడింది ఆమె. ఆమెనలా వదిలేసి వెళ్ళి పోయాడు రజాక్.

# 12

కోకిలనివిడిచిబయటకివచ్చిన శంభూనాథ్ కి హఠాత్తుగా గుర్తుకొచ్చింది ఆమె పేరు ఎక్కడ విన్నాడో.

ఇండియా యింటలిజన్స్ విభాగంలో అటువంటి పేరు గల ఒకతె వున్నట్లు తను విన్నాడు. కొంపదీసి ఆమే, ఈమె ఒకరు కాదుగదా? తనెవరో తెలుసుకుని తంగరాజే పంపించాడా?

ఆలోచించుకుంటూ రెంట్ కి తీసుకున్న కారులో ఎక్కి బయలుదేరాడు. 'సరుంగ్' గ్రామంవైపు సాగి పోయింది కారు.

'సరుంగ్' చాలా చిన్నగ్రామం. అయిదారు వందలు కంటే ఎక్కువ జనాభా వుండరు. అయితే అక్కడ శంభూనాథ్ కి కావలసిన ఫ్రాన్సిస్ అనే మనిషి దొరక లేదు. ఆ పేరుగలవాళ్ళు ఆ వూళ్ళో ఎవరూ లేనట్లు తెలియడంతో నిరుత్సాహపడిపోయాడు శంభూనాథ్.

అంతేగాదు, షీలా అనే యువతి తామెరుగమన్నట్లు, ఆ గ్రామానికి ఎప్పుడూ రాలేదన్నట్లు తెలియడంతో షీలా తనతో అబద్ధం చెప్పివుంటుందా అని అనుమా నించాడు శంభూనాథ్.

కాని ఆమె ముఖం చూస్తే అలా తోచలేదు తనకి. ఫ్రాన్సిస్ జియాలాల్ స్నేహితుడని చెప్పింది. బహుశా, తనవల్ల జియాలాల్ కి ప్రమాదం రావచ్చని మారుపేరుతో వ్యవహరిస్తున్నాడేమో! పోనీ షీలా కయినా నిజం చెప్పివుండాల్సింది. ఇప్పుడా ఫ్రాన్సిస్ అసలు పేరేమిటో తెలియదు. అతణ్ని కలుసుకోవటం ఎలా?

షీలా క్లబ్ డాన్సర్ గా పనిచేసిన విషయం గుర్తుకే

వచ్చింది. అయితే క్లబ్ పేరు చెప్పలేదు. తనూ అడగలేదు. వెంటనే కాబూల్ వచ్చి రెండు, మూడు నైట్ క్లబ్‌లలో వాకబు చేశాడు. చివరికి షీలా ఆచూకి దొరికింది.

షీలాతో బాటే ఆ క్లబ్‌లో పనిచేసే మనిషి, షీలా స్నేహితురాలయిన ఒకావిడ షీలా గురించి చెప్పింది శంభూనాథ్‌తో.

“జోరీ అనే మనిషి షీలాకోసం తరుచూ వస్తుండేవాడు. వాళ్ళిద్దరూ మంచి ఫ్రెండ్స్. త్వరలోనే వివాహం కూడా చేసుకోదల్చుకున్నారు. జోరీగాక మరో బాయ్ ఫ్రెండ్ షీలాకి వున్నట్లు తెలియదు” అంది ఆమె.

“జోరీ ఉండేది ఎక్కడ?” అడిగేడు శంభూనాథ్.

“సరుంగ్ గ్రామంలో” అన్న ఆమె సమాధానం అతనికి ఆశ్చర్యం కల్గించలేదు. మరికొన్ని వివరాలు తెలుసుకుని తన గదికి తిరిగివచ్చాడు. కాని గదిని ఎవరో సోదా చేసినట్లనిపించటంతో కోకిల, రజాక్ అతని కళ్ళ ముందు మెదిలారు.

# 13

తలుపు తట్టిన చప్పుడుకి “కమిన్” అంది కోకిల. లోపలికి వచ్చాడు రజాక్. అతని చేతిలో ఎర్రటి కాగితం, ఒక కవరు వుంది.

“తంగరాజు పంపించాడు” అని ఆ ఉత్తరాన్ని ఆమె ఒళ్ళోకి గిరవాటు వేశాడు రజాక్. అందుకొని కోడ్‌లో రాయబడిన ఆ ఉత్తరాన్ని చదువుకుంది కోకిల. దాని సారాంశం క్లుప్తంగా యిది—

“ఎయిర్‌పోర్ట్‌లో రీటా అనే యువతి అనుమానాస్పదంగా కన్పించటంతో కస్టమ్స్‌వాళ్ళు సోదా చేశారు.

సూట్ కేస్ చుట్టూ అమర్చిన ఒక రహస్య అరలో ఇండియన్ కరన్సీని కనుగొనటంతో రీటాని అరెస్ట్ చేసి తీసుకుపోతుండగా ఎవరో ఆమెని కాల్చి చంపారు.

ఆమె కాబూల్ కు సంబంధించిన మనిషని తెలియటంతో ఇంటలిజన్స్ విభాగానికి అప్పగించారు కేసుని. రీటాయే తనకు ఫోన్ చేసివుండాలని జరిగిన పరిశోధనలని బట్టి నిర్ధారణకు వచ్చాడు తంగరాజు. అంతేగాదు, ఆమె దగ్గర దొరికిన నోట్లు కొత్తవి కావటంవల్ల వాటిని ఎవరు, ఎప్పుడు డ్రా చేశారో వాకబు చేయగా నరేష్‌లాల్ కి సంబంధించిన ఒక ఏజన్టు దానిని డ్రా చేసినట్లు, అయితే దోవలో సూట్ కేస్ పోయినట్లు పోలీస్ రిపోర్టు యిచ్చినట్లు తెలిసింది.

అయితే నరేష్‌లాల్ తనమీద అనుమానం రాకుండా యిలా చేసివుంటాడని గ్రహించాడు తంగరాజు. అంతేగాక లాల్ కూడా రంగంలో వున్నట్లు రూఢి అవుతోంది. ఈ విషయాలను ఆరాతీయవలసిందిగా కోకిలను కోరుతూ సహాయంగా 'జోగ్లేకర్' అనే ఏజంటుని పంపిస్తున్నట్లు తెలియచేశాడు తంగరాజు. రీటా యిచ్చిన అడ్రసుకూడా పొందుపరచబడింది.

ఆ ఉత్తరం చదివి కంగారుపడింది కోకిల. రజాక్ మొహంకూడా వాడిపోయింది.

"పీడసాధ్యం కూలా. కొంచెం కొంచెం చేరువవుతున్నాడే!" అనుకుంటూ "పోనీ ఒకపనిచెయ్. జోగ్లేకర్ని ఎయిర్ పోర్ట్‌లో కలుసుకుని ఇక్కడ కాకుండా మరోచోట దిగేటట్లు చూడు. శంభూనాథ్ గురించి చెప్పి నీతో తిరిగితే అనుమానం వస్తుందని వేరేచోట దిగమని చెప్పు. తరువాత ఏం చేయాలో ఆలోచిద్దాం!"

కోకిలకీ ఆ ఆలోచన సబబుగా తోచింది.

"సరే! ఈ రోజే జోగ్లేకర్ వస్తున్నాడు" అంటూ టైం చూసుకుంది కోకిల. "ఇంకా రెండు గంటల టైముంది. నేనే వెళ్ళి రిసీవ్ చేసుకుంటాను" అంటూ టాయ్‌లెట్ అవటంలో మునిగిపోయింది కోకిల.

రజాన్ వెళ్ళిపోయాడు అక్కడ నుంచి.

# 14

"హలోవ్" అన్నాడు మార్టిన్ నవ్వుతూ.

మార్టిన్‌ని, అతనిప్రక్క శ్యామ్‌ని చూసి ఆశ్చర్య పోయాడు శంభూనాథ్.

"మీరా? ఎప్పుడొచ్చారు? ఎందుకొచ్చారు?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"బాస్ నీకు సహాయంగా పంపించారు. ఇకనుంచి నువ్వుచేసే ప్రతిపనిలోనూ మేము తోడుండాల్సిందే" అన్నాడు మార్టిన్ కుటిలంగా నవ్వుతూ. శ్యామ్‌కి మొదటినుంచి మాటలు తక్కువే.

"సంతోషించాంగాని, షీలాని ఎందుకు చంపారు? ఆ ఫ్రాన్సిస్‌గాడి జాడ తెలుసుకునేసరికి తాతలు దిగి వచ్చారు" కోపంగా అన్నాడు శంభూనాథ్. అతనికి హత్యలంటే యిష్టం లేదుకూడా.

"సారీ గురూ! చంపక తప్పలేదు. గొప్ప తెలివిమంతు రాలిలా డబ్బుతోసహా రాబోయింది. కస్టమ్స్‌వాళ్ళు పట్టు కున్నారు. అది పట్టుబడితే ఏమవుతుంది? ఈ డబ్బు తంగ రాజే పంపాడని చెప్పిందనుకో! దానితో కథంతా బయటకొస్తుంది. అందుకే చంపక తప్పలేదు."

"గొప్పపని చేశారు. మీరిద్దరూ నాతో తిరగటం

చూ స్తే కొంపలంటుకుంటాయి. పాకిస్తాన్ ఏజంటు రజాక్ నా వెంటబడుతున్నాడు" అంటూ కోకిల సంగతి కూడా చెప్పాడు శంభూనాథ్.

"ఆ జియాలాల్ సంగతి పాకిస్థాన్‌కి కూడా తెల్సిందన్నమాట. తాను కూడా ఆ మైక్రోఫిల్మ్‌ని దక్కించుకోవాలని తంటాలు పడుతున్నారు" అన్నాడు కనీగా మార్టిన్.

తర్వాత ముగ్గురు కలిసి కారులో 'సరుంగ్' గ్రామం బయలుదేరారు.

'సరుంగ్' గ్రామ పరిసరాల్లోకి రాగానే కారాపాడు శంభూనాథ్. "యిక్కడి నుంచి కాలినడకన వెళ్ళి జోరీని కలుసుకుంటా. మనల్ని యింకెవరయినా అనుసరిస్తున్నారేమో వాచ్ చేయండి" అంటూ గ్రామంలోకి బయలుదేరాడు.

ఈసారి అతనికి 'జోరీ' అడ్రసు తెలిసింది సులభంగానే. జోరీ యింటిముందాగి తలుపుతట్టాడు. పద్దెనిమిదేళ్ళ యువకుడొకడు తలుపు తెరిచి ఏం కావాలన్నట్లు చూశాడు.

"నా పేరు శంభూనాథ్, జోరీ వున్నాడా?" అన్నాడు నాథ్.

"లేరు" అంటూ తలుపు మూయబోయాడు అతను.

"నన్ను షీలా పంపింది" అన్నాడు శంభూనాథ్ చటుక్కున. తలుపు మూయబోతున్న అతను ఆగి, పరీక్షగా చూసి "లోనికిరండి" అన్నాడు.

లోపల చీకటిగావుంది. "ఫ్రాన్సిస్ జోరీ మా చిన్నాన్న. షీలా తరఫున ఎవరయినా వస్తే తీసుకు రమ్మని చెప్పేడు" అన్నాడు ఆ యువకుడు.

"నీ పేరేమిటి? జోరీ యిక్కడ లేడా?" అన్నాడు శంభూనాథ్ పరీక్షగా లోనికి చూస్తూ.

"నా పేరు లూథర్. అంకుల్ ఈ యింట్లో లేరు అంటూ బయటికి దారితీశాడతను. అతన్ని అనుసరించాడు శంభూనాథ్. వీధి మొగన నిలబడివున్న మార్టిన్ తమని గమనించటం చూశాడు నాథ్.

నాలుగయిదు సందులు, గొందులు తిప్పి, దాదాపు గ్రామం చివరవున్న ఒక రాతి యింట్లోకి తీసుకుపోయాడు లూథర్, శంభూనాథ్ ని.

లోపల రెండు, మూడు గదులున్నాయి. ఒక గదిలో కొవ్వొత్తి వెలుగుతోంది. ఆ వెలుగులో దాదాపు నలభై ఏళ్ళ వ్యక్తి, అతనికెదురుగా పాతికేళ్ళ యువతి మరొకామె కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఆ వ్యక్తి జోరీ అయివుండాలని భావించాడు శంభూనాథ్.

కాని ఆ ఆడమనిషిని చూసి నిశ్చేష్టుడయిపోయాడు. ఆమె శాంతి!

# 15

"అంకుల్ షీలా పంపిన మనిషి వచ్చారు" అన్న మాటలు విని తలలు తిప్పి చూశారు జోరీ, శాంతిలు.

"నా పేరు శంభూనాథ్" అన్నాడు శంభూనాథ్ ముందు కడుగులు లేస్తూ. "స్టాప్ దేర్" అరిచింది శాంతి. ఆమె చేతిలో తుపాకి ప్రత్యక్షమయింది. "నో నువ్వు శంభూనాథ్ వి కావు!" అంది తీవ్రంగా.

నవ్వాడు శంభూనాథ్ "శాంతీ! నువ్విక్కడి ప్రత్యక్షం గావటం ఆశ్చర్యంగా వుంది. అయిదునిమిషా

లాగితే నేనెవరో తెలుస్తుంది. కొబ్బరి నూనె వుందా?" అని అడిగాడతను.

లూథర్ అతన్ని ప్రక్క గదిలోకి తీసుకుపోయాడు. పదినిముషాల తరువాత తన నిజస్వరూపంతో ప్రత్యక్షమయిన శంభూనాథ్‌ని చూసి ఆశ్చర్యంతో నిలబడి పోయింది శాంతి.

"మైగాడ్! వండ్రఫుల్ మేకప్" అన్నాడు జోరీ. ముగ్గురు కుర్చీలలో కూర్చున్నారు. శంభూనాథ్‌కి కూడా టీ ఆఫర్ చేశాడు జోరీ.

షీలాను తను కలుసుకున్న విధానం చెప్పి, ఆమె మరణించిందని చెప్పాడు.

"పూర్ గర్ల్. నాకోసం ప్రాణాలయినా యిస్తానేది" నిట్టూర్చాడు జోరీ.

"మీ కోసం యిదివరకోసారి యిక్కడకు వచ్చాను. ఫ్రాన్సిస్ అన్న మనిషే లేడన్నారు."

"అవును. ఫ్రాన్సిస్ జోరీ నా పూర్తి పేరు. జోరీగానే అందరికీ తెలుసు. నేనయినా కొద్ది నెలలే అవుతుంది యిక్కడకు వచ్చి" అన్నాడు జోరీ.

"ముందు మనం జియాలాల్‌ని కలుసుకోవాలి. నా వెంట పాకిస్థాన్ ఏజంట్లు పడుతున్నారు" అంటూ జరిగినది చెప్పాడు.

"మైగాడ్! జియాలాల్ గురించి చాలామందికి తెలిసి పోయిందన్నమాట" అంది శాంతి విభ్రమంగా.

"శాంతీ! జియాలాల్‌కి నీకు బంధుత్వ మేమన్నా వుందా? అక్కడ మాయమయి యిక్కడెలా ప్రత్యక్షమయ్యావ్?" కుతూహలంగా అడిగాడు శంభూనాథ్.

"జియాలాల్ భార్రి మా పెద్దన్నయ్య. చిన్నన్నయ్య ఇండియన్ ఆర్మీలో పనిచేస్తూ యుద్ధంలో చనిపోయాడు. పెద్దన్నయ్య చైనానుంచి తప్పించుకుని అష్టకష్టాలుపడి యిక్కడకు చేరుకున్నాడు. తనకోసం రెండు దేశాల ఏజంట్లు వెదుకుతున్నారని తెలుసు.

ఫ్రాన్సిస్ జోరీ, ఆయన ఒకప్పుడు ఫ్రెండ్స్. ఆ స్నేహాన్ని పురస్కరించుకుని జోరీని కలుసుకున్నాడు. జోరీ ఆయనని ఒక పల్లెలో ఉంచి రహస్యంగా నాకు కబురు చేశాడు. అప్పటికే పెద్దన్నయ్యను రకరకాల జబ్బులు పట్టుకుని బాధించి, పీల్చి పిప్పిచేస్తున్నవి.

తన దగ్గరున్న మైక్రోఫిల్మ్ను తంగరాజు గారి దగ్గరకు చేర్చటమే జీవితాశయం అని చెప్పేవాడు. నేను చేరుస్తానంటే ఒప్పుకోలేదు. ప్రమాదకారులయిన గూఢ చారుల మధ్య యిరుక్కోవటం యిష్టంలేదని తంగరాజు గురించి, వాల్మీకి గురించి, మీ గురించి కూడా చెప్పే వాడు.

మీ గురించి చెబుతూ తప్పకుండా మిమ్మల్నే పంపుతా డని, మీ అంత నమ్మకస్తుడు మరొకరు దొరకరని చెప్పే వాడు.

ఈ సంగతి జోరీతో చెప్పి నిన్ను కలుసుకున్నాను. అన్నయ్య నీ గురించి చెప్పింది నిజమని తేలింది వాకబు చేస్తే. నేనే నిన్ను అన్నయ్యకు సహాయంచేయమని కోరే దాన్నే గాని, వాల్మీకిని కలుసుకున్నావని తెలిసి వచ్చే శాను. తరువాత తెలిసింది జోరీ అన్నయ్య ట్రీట్ మెంట్ కి డబ్బు చాలక షీలాని పంపించాడు డబ్బుకోసం. ఆమె తంగరాజుతో చేరానికి దిగింది. నేను యిక్కడకు వచ్చేశాను."

ముగించింది శాంతి.

"అవును బాబు! మాకు వేరే ఉద్దేశంలేదు. కేవలం జియాలాల్ ని బ్రతికించడానికోసమే అలా చేశాము. కాని..." ఆగిపోయాడు.

శంభూనాథ్ హృదయం బద్దలవుతోంది. అతనిలో ఏ మూలోవున్న మానవత్వం బయటికి వుబుకుతోంది. తన గురించి జియాలాల్, శాంతితో అన్న మాటలు పదేపదే మారుమోగుతున్నాయి.

"నీ అంత నమ్మకస్తుడు లేడు... లేడు... లేడు"... కాని తన అసలు రూపం తెలిస్తే? జియాలాల్ కి తనకి వున్న పరిచయం స్వల్పం. కాని స్వల్పానికే తనమీద ఆశలు పెంచుకున్నాడు. తనేం చేయబోతున్నాడు?

నరేష్‌లాల్, మార్టిన్, రజాక్ లు కళ్ళముందు మెదిలారు. జియాలాల్ ముఖం దీనంగా కనపడుతోంది.

తల విదల్చి లేచినిలబడ్డాడు శంభూనాథ్.

"ఆల్ రైట్ శాంతి! ముందు లాల్ ని కలుసుకుందాం. అతనికోసం చాలా గుంటనక్కలు ఎదురుచూస్తున్నాయ్" అన్నాడు.

జోరీ, శాంతికి సైగచేశాడు. శంభూనాథ్, జోరీతో విషయం వివరించి జాగ్రత్తగా ఉండమని వెళ్ళిపోయాడు.

ఇంటి వెనుక నుంచి బయట పడగానే మార్టిన్ ప్రత్యక్షమయ్యాడు వికృతమైన దరహాసంతో. "గుడ్! నువ్విలా చేస్తావని నాకు తెలుసు" అన్నాడు.

చటుక్కున రివాల్వర్ లాగి అతని తలమీద బాదాడు శంభూనాథ్. మూలుగుతూ క్రిందపడ్డాడు మార్టిన్.

"ఎవరతను?" అంటోంది శాంతి. "దోవలో చెబు

తాను పద!" ఆమె రెక్క పట్టుకుని పరుగెత్తాడు శంభూనాథ్.

ఇద్దరూ ఆ సందుచివర తుప్పలమాటున ఆగివున్న కారు ఎక్కారు. శాంతి డ్రైవింగ్ తీసుకుంది. వాళ్ళిద్దరు గాక లోపల మరో మనిషి కూడా వున్నాడు, యాభైఅయిదే ళ్ళుంటాయి అతనిది.

"అన్నయ్య యితని దగ్గరే వుంటున్నాడు. అడవిలో దారిచూపే గైడ్ కూడా యితనే. పేరు మాసాయ్!" అంటూ పరస్పర పరిచయం చేసింది శాంతి.

మార్టిన్ తేరుకునే సరికి దూరంగా కారు వెళ్ళి పోవటం విన్పించింది. శంభూనాథ్‌ని తిడుతూ శ్యామ్ దగ్గరకుపోయి చెప్పాడు.

ఇద్దరూ జోరీ ఇంట్లోకి ప్రవేశించారు. జోరీ, లూథర్‌లు మకాం ఎత్తివేసే ప్రయత్నంలో వున్నారు, వారిని చూసి అదిరిపోయారు.

రివాల్వర్ తీసి అన్నాడు మార్టిన్. "శంభూనాథ్ జియాలాల్ దగ్గరకు పోయాడు అని మాకు తెలుసు. మమ్మల్ని కూడా అక్కడికి చేర్చండి. లేకపోతే యిద్దరు యిక్కడే చస్తారు."

వారి ఆకారాలు చూసినప్పుడే పైప్రాణాలు పైనే పోయాయి వారికి. జోరీ మాట్లాడలేదు. అతని ముఖం మీద కొట్టాడు మార్టిన్.

"నేను చూంపుతాను!" అన్నాడు లూథర్.

"నో! నో!" అరిచాడు జోరీ కంగారుగా.

"ఫరవాలేదు రండి. మా ప్రాణాలకంటే లాల్ ప్రాణాలు ఎక్కువేమీ గాదు" అన్నాడు లూథర్ కదులుతూ.

అతనితోబాటు కదిలారు యిద్దరు.

ముగ్గురు కారు ఎక్కారు. "మెయిన్ రోడ్డు మీదగా పొమ్మన్నాడు లూథర్. "వాళ్ళు వెళ్ళింది యిటుగాదు!" ఉరిమాడు మార్టిన్.

"మనం అడ్డదారిన పోతున్నాం" జవాబిచ్చాడు లూథర్.

కొంతదూరం పోయాక మెయిన్ రోడ్ వదిలి అడివి లోకి నేలమీద దిగింది కారు. నేలంతా తడితడిగా, చిత్తడి నేలమాదిరిగా వున్నది.

"జాగ్రత్త! ఒకే స్పీడ్ కంటిన్యూ చెయ్యండి. లేకపోతే మట్టిలో దిగబడిపోతుంది కారు" హెచ్చరించాడు లూథర్.

గంటన్నరపాటు ఆ అరణ్యంలో ప్రయాణించారు.

హఠాత్తుగా టర్న్ తిరిగి ఎదురుగా చెట్టు కన్పించే సరికి అలవాటుగా బ్రేక్ తొక్కాడు మార్టిన్.

టక్కున ఆగింది కారు. దానితోపాటే వెనుక చక్రాలు మెత్తగా యినుకలో కూరుకుపోయి నట్లయ్యాయి.

"డామిట్" తిట్టుకున్నాడు మార్టిన్.

"ఇలా కూర్చుంటే లాభంలేదు. చుట్టుప్రక్కల పుల్లల్ని ఏరి చక్రాలక్రింద పేర్చండి ముందు" అన్నాడు లూథర్.

ముగ్గురూ చెట్లకొమ్మల్ని విరుస్తూ, పుల్లల్ని పోగుచేస్తూ గడిపారు. అరగంట తరువాత గాని తామిద్దరమే మిగిలినట్లు గుర్తించాడు మార్టిన్.

లూథర్ మీద అంతులేని కోపం వచ్చింది. అయిదారు

సార్లు గొంతు చించుకుని అరిచి లూథర్ పారిపోయాడని నిర్ణయించుకున్నారు.

ఏ చెట్టు చూసినా ఒకే మాదిరిగా వుంది. అడవిలో నుంచి బయటపడే మార్గం కన్పించలేదు. చీకటి పడుతోంది.

ఆ సరికే శాంతి, శంభూనాథ్‌లు జియాలాల్ వుంటున్న గ్రామం సమీపించారు.

# 16

"డామిట్! జోరీ కూడా తప్పించుకున్నాడు" అన్నాడు రజాక్ నిస్పృహగా. చేతికందిన ఫలం నోటి కందకుండాపోయినట్లు జోరీనేగాక శంభూనాథ్ కూడా మాయం కావడంతో తల తిరిగిపోయిందతనికి.

"ఈ పాటికి జియాలాల్‌ని చేరుకొని వుంటారు!" తనలో తను గొణుక్కున్నాడు అతడు.

"రజాక్! నాదో ఐడియా!" అన్నాడు మునీర్‌ఖాన్. అతను రజాక్‌తో పనిచేస్తున్న మరో ఏజంటు.

ఏమిటన్నట్టు చూశాడు రజాగ్.

"శంభూనాథ్, జోరీలని ఈ అడవిలో వెదకటం మనవల్లకాదు. వాళ్ళు ఖచ్చితంగా లాల్ దగ్గరికే పోయి ఉంటారు. అంచేత కొంతమంది దారితెలిసిన మనుషులని అడవుల్లో అక్కడక్కడ వుంచి వారితో వైర్‌లెస్ సంబంధాలు పెట్టుకుందాం. వాళ్ళకంట పడకుండా శంభూనాథ్ బయటికి రాలేడు. ఇవాళ కాకపోయినా రేపయినా రాక తప్పదుగదా!" అన్నాడు మునీర్‌ఖాన్.

రజాక్‌కి ఆ సలహా ఎంతో నచ్చింది. వెంటనే ఆ ఏర్పాట్లు కావించబడ్డాయి.

దారులు త్వుణ్నంగా తెలిసిన కొంతమంది ఆఫ్ఘన్స్ తుణాలమీద సేకరించబడ్డారు. వారికే విధంగా రిపోర్టు యివాల్సింది చెప్పి, అడవిలోకి తోలాడు మునీర్ ఖాన్. వాళ్ళ ప్రతిఒక్కరి దగ్గర టూ-వే వాకీ-టాకీలున్నాయి.
ఈ ఏర్పాట్లతో శంభూనాథ్, జియాలాల్ లు తమకు చిక్కుతారన్న భరోసా ఏర్పడింది రజాక్ కి.

ఆదే సమయంలో చిన్నగూడాన్ని సమీపించింది శాంతి నడుపుతున్న కారు. దట్టమయిన అడవిమధ్యలో చెట్లకు, గుడిసెలకు తేడా లేకుండా నిర్మించబడి ఉందా గూడెం. మొత్తం పాతిక, యిరవై కుటుంబాలకంటే ఎక్కువ వుండవు.
"థాంక్ గాడ్!" అంది శాంతి గూడెం దగ్గరికి రాగానే.
"ఎందుకు?" అన్నాడు శంభూనాథ్.

"ఎందుకేమిటి? ఈ అడవిలో చాలా కష్టం ప్రయాణించటం. టైరు నేలలోకి దిగుతుంటాయి. అటువంటి దేమీ కలుగనందుకు మనం సంతోషించాలి."

"దేవుడి దేముంది? నీ డ్రైవింగ్ ప్రతిభ" అన్నాడు నవ్వుతూ నాథ్.

"నాకూ అలవాటు కావడానికి చాలా కాలం పట్టింది" అంది శాంతి.

కారాగిన చప్పుడుకి గూడెం ప్రజలు గుడిసెల్లోకి తప్పుకున్నారు. 'మాసాయ్'ని చూడగానే వారి హృదయం తేలికపడి ఒక్కొక్కరే బయటకొచ్చారు.

ఒక వెడల్పయిన గుడిసెలోకి దారి తీశాడు 'మాసాయ్'.

లోపల ప్రమిదవంటి దీపం వెలుగుతోంది. ఆ కాంతిలో మంచంమీద పడుకొని ఉన్న మనిషాకారం ఒకటి కనబడుతోంది. ఆ ఆకారం, అస్థిపంజరానికి చర్మం తొడిగినట్లుగా ఉంది. బ్రతికి ఉన్నాడని చెప్పటానికి వీలుగా ఊపిరి పీల్చినప్పుడెల్లా గుండెలు యెగిసిపడుతున్నాయి.

"లాల్! లాల్!" పిలిచింది శాంతి నెమ్మదిగా.

నిమిషం తరువాత కళ్ళు తెరిచి చూశాడు లాల్.

"శంభూనాథ్ వచ్చాడు. తంగరాజు పంపించాడు" అంది శాంతి.

"శంభూ!" అన్నాడు జియాలాల్ హీనస్వరంతో, నాథ్‌ని గుర్తించి.

అతని ప్రక్కనే కూర్చుని అతని చేయి తన చేతిలోకి తీసుకున్నాడు శంభూనాథ్.

శాంతిని, మాసాయ్‌ని బయటకు పొమ్మని సైగచేశాడు లాల్.

"తంగరాజు నిన్ను తప్పకుండా పంపుతాడని నాకు తెలుసు. ఇదుగో!" అంటూ దిండుకిందనుంచి అంగుళం వ్యాసంతో సిలెండర్‌లా ఉన్న రెండంగుళాల పొడుగుగల అల్యూమినియం పెట్టె తీసి యిచ్చాడు.

"ఎంతో కష్టపడి దీనిని సంపాదించాను. తంగరాజుకి చేర్చవలసినవాడివి నువ్వే. దీన్లో మన దేశంలోని చైనా ఏజంట్లు, వారి తొత్తులు మొదలయినవారి అడ్రసులున్నాయి" అన్నాడు లాల్.

నరేష్‌లాల్ కళ్ళముందు మెదిలాడు శంభూనాథ్‌కి.

"ఇన్నాళ్ళు నీ రాకకోసం యెదురుచూశాను. ఈ

బాధ భరించలేక ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను. కాని నీకోసం ఆగిపోయాను'' అన్నాడు జియాలాల్.

''దీన్ని తప్పకుండా తంగరాజుకి చేరుస్తాను. నన్ను నమ్ము!''

''శాంతిని పిలువ్!'' అన్నాడు.

నీళ్ళు నిండిన కళ్ళతో వచ్చింది శాంతి.

ఆమెని ఒకసారి తృప్తిగా చూశాడు జియాలాల్. మాసాయ్‌తో వాళ్ళ భాషలో ఏదో చెప్పాడు. కృతజ్ఞత కాబోలనుకున్నాడు శంభూ.

అందరి బయటకు వెళ్ళమని సైగ చేసి, దిండుకిందనుంచి ఒక పాత రివాల్వర్ తీసి__మాగజైన్ తెరిచాడు. ఒకే ఒక బుల్లెట్ ఉంది దానిలో.

కణతకి ఆనించుకుని ట్రిగ్గర్ నొక్కాడు జియాలాల్ భాత్రి.

శాంతి చేతుల్లో ముఖం దాచుకుని ఏడ్చింది.దుఃఖంతో ఆమె గుండెలు ఎగసిపడుతున్నాయి. ఆమె వీపుమీద చేయివేసి నిమిరాడు శంభూనాథ్.

గూడెం దగ్గరలోనే గొయ్యితీసి జియాలాల్ శవాన్ని పాతిపెట్టారు.

# 17

తెల్లవారుఝామున అయిదుగంటలు దాటింది. తూర్పు దిశ ఎర్రబారుతోంది అప్పుడప్పుడే.

ట్రాన్స్‌మిటర్ బీప్ బీప్ మనటంతో మూసుకుపోతున్న కళ్ళను తెరిచిచూశాడు మునీర్‌ఖాన్. అతని ప్రక్కనే కూర్చుని కునికిపాట్లు పడుతున్న రజాక్ కూడా కళ్లు విప్పాడు.

ఇయర్ ఫోన్ చెవికి తగిలించుకుని, అవతలినుంచి వచ్చే మెసేజ్ ను ఆలకిస్తూ, ప్రక్కనే పరిచివున్న మాప్ మీద యెర్రటి పెన్సిల్ తో గుర్తులు పెట్టసాగాడు మునీర్ ఖాన్.

రెండు నిమిషాల తరువాత ట్రాన్స్మిషన్ ఆగి పోయింది.

"గ్రూప్ 'త్రీ' నుంచి మెసేజ్ వచ్చింది. ఎవరిదో కారు వెళ్ళటం చూశారట..." అని చెప్పాడు మునీర్ ఖాన్.

"సందేహం లేదు. శంభూనాథ్ కారే అయి వుంటుంది."

టెంట్ లో నుంచి బయటికి నడిచి తన అనుచరులను రెడీకమ్మన్నాడు రజాక్. వాళ్ళు వచ్చిన కారు ఒక ప్రక్కగా ఉంది.

గంటన్నర పయిగా గడిచింది. వైర్ లెస్ లో అప్పు డప్పుడు వస్తున్న మెసేజ్ అనుబట్టి, వారిస్తున్న డైరెక్షన్స్ బట్టి అడవిలో శంభూనాథ్ ఉంటున్న ప్రదేశం ఇంటూ మార్కుతో గుర్తుపెడుతూ, ఆ కారు పోయే దిశను గుర్తిస్తున్నాడు మునీర్ ఖాన్.

కొంతసేపటి తరువాత "అచ్ఛా రజాక్! మనకు దగ్గరగా వచ్చేశారు. వెళ్దాం పద" అన్నాడు.

పావుగంటలో తయారయ్యారు యిద్దరు. తన అనుచరులను అక్కడే కాపలాగా ఉంచి వైర్ లెస్ ట్రాన్స్ మిటర్, మాప్ మొదలయిన వాటితో మునీర్ ఖాన్, రజాక్ లు మాత్రం బయలుదేరారు కారులో.

శంభూనాథ్ కారు వస్తున్న దిశగా సాగింది వారి

ప్రయాణం.

ఆదేసమయంలో హఠాత్తుగా అంది శాంతి. "ఎవరో కదిలినట్లున్నారని."

ప్రస్తుతం మాసాయ్ సూచనలపై శంభూనాథ్ డ్రైవ్ చేస్తున్నాడు.

శాంతి హెచ్చరించటంతో కనుకొలుకుల్లోనుంచి శాంతి చూపించిన దిశగా పరికించాడు. ఒక మంచెమీద ఎవరో దాగినట్లు అస్పష్టంగా కన్పించింది.

ఆక్సిలేటర్ తొక్కాడు మరింతగా శంభూనాథ్, తమకి ఎడమవేపుగా వున్నాడు ఎవరో. ఇంతలో 'ధన్' మన్న చప్పుడవటంతో స్టీరింగ్ అటూ యిటూ తిప్పి బ్రేక్ తొక్కాడు. చటుక్కున నేలలోకి దిగబడింది కారు.

ధన్, ధన్ మంటూ బుల్లెట్ల వర్షం కురిపింది కారు మీద. క్రిందకి వంగి అవతలి ప్రక్కడోరు తెరుచుకుని దూకారు ముగ్గురు.

జేబులోనుంచి రివాల్వర్ తీసి కారు చాటునుంచే కాల్పులు సాగించాడు. రెండు నిమిషాల తరువాత ఒకడు అరుస్తూ నేలమీదపడ్డాడు. ఆదేక్షణంలో రెండోవాడు కూడా అరుస్తూ పడిపోయాడు.

"శాంతి!" అన్నాడు శంభూనాథ్. "ఇక్కడున్నాను" అంటూ మంచెక్రింద నుంచి వచ్చింది శాంతి, వారి మెషిన్ గన్‌లతో.

ఇద్దరూ మాసాయ్‌వంక చూశారు. అతని వీపులో గుళ్ళు దిగబడ్డాయి. ప్రాణాలు ఎప్పుడో పోయాయి.

నిర్ఘాంతపోయారు యిద్దరు. అదే సమయంలో దూరంగా ఏదో కారుయింజను శబ్దం విన్పించి అదిరిపడి తలెత్తాడు

శంభూనాథ్.

"శాంతి! కమాన్!" తొందర చేశాడు. "మాసాయ్...!" అంటూంది శాంతి కళ్ళనీళ్ళతో.

"హారియప్" స్టీరింగ్ ముందు ఆమెని కూలేసి, భుజంతో వెనుకభాగాన్ని మోటించి కారుని పైకి లేపుతూ ముందుకు తోయసాగాడు.

రెండు నిమిషాలలో బయటపడింది కారు. కదులుతున్న దానిలోకి జంప్ చేశాడు అతను. కంగారుగా, త్వరత్వరగా పోనిస్తుంది శాంతి. ఏమి జరిగివుంటుందో అంచనా వేయటానికి ప్రయత్నిస్తున్నాడు శంభూనాథ్.

దాదాపు గంటన్నరపాటు సాగింది ప్రయాణం.

"శంభూ! దారి తప్పినట్లున్నాం!" అంది శాంతి హఠాత్తుగా. అదిరిపడ్డాడు శంభూనాథ్.

"మరికొంత ముందుకుపో! పరిసరాలు గుర్తుపట్టగలవేమో ప్రయత్నించు!" అన్నాడు ఆమెతో.

మరో అరగంట ప్రయాణం సాగింది. "లాభంలేదు శంభూ! దారి తప్పేం. నాకూ సరిగ్గా తెలియదు. కంగారులో చూసుకోలేదు" అంది నిస్పృహగా శాంతి.

"మైగాడ్!" అరిచాడు శంభూనాథ్. "ఎలా? ఏం చేయాలి?"

చుట్టూచూసిన శాంతి ఆనందంగా అంది. "యస్. నాకిప్పుడు గుర్తుకొస్తూంది. దగ్గరలోనే ఒక గ్రామం వుండాలి" అంది ఉత్సాహంగా.

కారుని స్టార్ట్ చేసి ముందుకు పోనిచ్చింది. అయితే ఎంత దూరం పోయినా యిసుక దిబ్బలు వచ్చాయిగాని గ్రామం ఏమీ తగల్లేదు. ఆ దిబ్బలమీదే కొంతదూరం పోయారు.

కొంతదూరం పోగానే ప్యూయల్ అయిపోవటంతో ఆగిపోయింది కారు. స్పేర్ టిన్ కూడా మరతుపాకి గుళ్ళకు చిల్లుపడింది. అచేతనంగా కూలబడిపోయారిద్దరూ.

# 18

గ్రూప్ 7 నుంచి ఏ సమాచారం రాకపోవటంతో అక్కడికి చేరుకున్నారు మునీర్ ఖాన్, రజాక్ లు. అస్తవ్యస్తంగావున్న ఆ శవాలను చూడగానే వారికి పరిస్థితి అర్థమయింది.

బీప్ బీప్ మంది ట్రాన్స్మిటర్. విని అన్నాడు మునీర్ ఖాన్. "గ్రూప్ వన్ దగ్గర ఇద్దరు మనుషులు దారిదొరక్క అల్లలాడుతుంటే మనవాళ్ళు చంపేశారట. ఇద్దరూ మగవాళ్ళే!"

టైరు గుర్తులనుసరించి దారితీశారు యిద్దరూ.

మధ్యాహ్న సమయానికి దూరంగా ఆగివున్న కారు కన్పించింది. దానిని గమనించగానే అవధులు దాటిన ఆనందంతో ఆక్సిలేటర్ తొక్కాడు మునీర్ ఖాన్.

అయితే దానిని సమీపించక ముందే ఢన్, ఢన్ మన్న శబ్దం అయింది. బుల్లెట్ సూటిగా రజాక్, మునీర్ ఖాన్ ల నుదుటిలో దిగబడింది. ఫ్రంట్ షీల్డ్ ని ఛేదించుకుని వచ్చి కారు ఓ చెట్టుకు కొట్టుకొని ఆగిపోయింది.

"శంభూ!" హఠాత్తుగా అరిచింది కాంతి.

"ఏమిటి?" శక్తిహీనంగా అన్నాడు శంభూనాథ్.

"అదుగో అలా చూడు!" అంది.

చూశాడు శంభూనాథ్. దూరంగా చెట్లమీదుగా వలుసువంటిది ఏదో ఎగురుకుంటూ వస్తోంది హెలికాప్టర్.

"హేయ్ కాంతి!" అని అరుస్తూ చొక్కా విప్పి

ఆడిస్తూ హెలికాప్టర్ కి సంజ్ఞలు చేయసాగాడు శంభూనాథ్.

మూడు నిముషాలనంతరం కొంచెం దూరంలో ఆగింది కాప్టర్. ఆ దుమ్ము తెరలోకి దూసుకుపోయారు శంభూనాథ్, శాంతిలు.

ఆ హెలికాప్టర్ లో వచ్చింది ఇండియన్ ఏజెంట్ జోగ్లేకర్.

"ఇదివరకు కోకిల అనే గూఢచారిణి ఇండియా తరఫున పాకిస్థాన్ లో పని చేస్తుండేది. ఆమెను పనిగట్టిన పాకిస్థాన్, ఆమెను చంపి, ఆమె స్థానంలో నకిలీ కోకిలను పంపారు.

తంగరాజుకి మరింత నమ్మకం కలగటంకోసం తమకు తెలిసిన విదేశీ గూఢచారులను కొందరిని బయటపెట్టి ఆయన అభిమానానికి పాత్రురాలయ్యింది నకిలీ కోకిల. తద్వారా అనేక రహస్యాలను తన దేశానికి చేరవేస్తుండేది.

ఆమెను అనుమానించి బెదిరించాను. నిజం చెప్పకుండానే మరణించింది. ఆమె డైరీ, ఉత్తరాలు మొదలయినవి పరిశీలిస్తే పైవివరాలు బయటపడ్డాయి. వాటి ద్వారానే యిక్కడి విషయం కూడా తెలిసింది. మీ కోసం వెదుకుతూ హెలికాప్టర్ లో బయలుదేరాను—" అని ముగించాడు జోగ్లేకర్.

—:ఐపోయింది:—

# లక్షకొక్క మామిడి మొక్క!

## వసుంధర

అతనెవరో నాకు నిజంగా తెలియదు. అందుకే అతను నన్ను పలకరించగానే ఆశ్చర్యపడ్డాను. అందులోనూ అతని పలకరింపు సామాన్యమైనది కాదు.

"నమస్కారం శివరావుగారూ!" అంటూ పలకరించాడతను.

నేనెరుగని మనిషి నన్ను పేరుతో పలకరించడం ఆఫీసులో అప్పుడప్పుడు జరుగుతూంటుంది కానీ యిలా రోడ్డుమీద కూరల మార్కెట్ ప్రాంతంలో జరగడం యిదే మొదలు నాకు.

మొహమాటపడకుండా— "క్షమించాలి-మీరెవరో నాకు తెలియదు-" అనేశాను. అప్పుడతడన్న మాటలు మరింత ఆశ్చర్యాన్ని కలిగించాయి నాకు.

"గొప్పవారికి అందరూ తెలియరు. కానీ అందరికీ గొప్పవారు తెలుస్తారు. మీబోటి గొప్పవారి పరిచయాన్నాశిస్తున్న నాకు ఆశాభంగం కావించరు కదూ?"

ఇటువంటి మాటలూహించి ఉండకపోవడంవల్ల వెంటనే జవాబుగా ఏమివ్వాలో తోచలేదు. నా గొప్పతనం నన్ను చూడగానే తెలుస్తుంది. ఒకచేతిలో కూరగాయల సంచీ, కొద్దిగా నలిగిన బట్టలు, రేగిన క్రాపింగు, జిడ్డోడుతున్న ముఖం.

"నేను గొప్పవాడినని ఆఖరికి నాక్కూడా తెలియదు' మీరు పొరబడివుంటారు. మీరనుకుంటున్న శివరావుని నేనయుండను" అన్నాను.

"భలేవారండీ—" అంటూ గలగల నవ్వేశాడతను. నవ్వాడమయ్యేక నా ఆఫీసూ, ఉద్యోగం వివరాలు చెప్పాడు. అవి విన్న ఆశ్చర్యంనుంచి నేనింకా తేరుకోకుండానే — నా భార్యపేరూ, నేనుంటున్న ఇంటి అడ్రసూ కూడా చెప్పాడు.

"అయితే మీరనుకుంటున్న శివరావుని నేనే. అయితే మీరనుకుంటున్నట్లుగా నేను గొప్పవాణ్ణి మాత్రంకాను" అన్నాడు.

"అలాగనడంలోనే మీ గొప్పతనం తెలుస్తోంది. మీరెందుకు గొప్పవాళ్ళు కామని అనుకుంటున్నారో నాకు తెలియడంలేదు..."

"చూడండి. ఎవరిమటుక్కువాడు నేనే గొప్పవాడినని సంతోషపడవచ్చు. అదేమంత కష్టంకాదు. గొప్పతనానికి సమాజమిచ్చిన కొలబద్దలున్నాయి గదా-డబ్బో, పదవో, ఇతర విధాలైన పేరు ప్రతిష్టలో లేందే మనిషి గొప్పవాడెలాగౌతాడు చెప్పండి!" అన్నాను వీలైనంత వినయంగా. నన్ను గొప్పవాడన్న మనిషితో దురుసుగా మాట్లాడ్డం నాకిష్టంలేదు.

"అదా మీ సందేహం! అయితే నేను చెప్పేది మీరు వినాల్సిందే__మోతిలాల్ నెహ్రూకు జవహర్‌లాల్ పుట్టినప్పుడూ, జవహర్‌కు ఇందిర పుట్టినప్పుడూ వాళ్ళు గొప్పవాళ్ళవుతారని అంతా అనుకున్నారా లేదా? అందుకు కారణం వారివారి కుటుంబ చరిత్రలు. ఆ విధంగా కొంతమంది గొప్పతనాన్ని వాళ్ళు గొప్పవాళ్ళు కాకుండానే చెప్పవచ్చును..." అన్నాడతను.

"బాగానేవుంది. వాళ్ళు కనీసం గొప్పవాళ్ళ బిడ్డలు' నా కటువంటిది కూడా లేదు" అన్నాను. అన్నాను కానీ అతనిప్పుడు మా తండ్రి తాతల పేర్లు ఏకరువు పెడతాడేమోనని భయంవేసింది.

కానీ అతనలాంటిదేమీ చేయకుండా — "మీరు చెప్పింది నిజమే. కానీ నా ఉదాహరణను మీరు సరిగ్గా అర్థంచేసుకోలేదు. క్రింద అద్దముందనుకోండి. మీ చేతిలో రాయుందనుకోండి. మీరు రాయిని వదిలారనుకోండి. ఆ రాయి సరిగ్గా అద్దంమీదకే వెడుతోందనుకోండి. రాయి మీ చేతిని వదిలీ వదలగానే ఆ అద్దం బద్దలవుతుందని చెప్పవచ్చును. అనగా మనకెదురుగావున్న నిజాలను జాగ్రత్తగా గమనిస్తే__జరగబోయేది ఊహించడం ఏమంత కష్టంకాదు, అవునా?" అన్నాడు.

"అవుననుకోండి. మీ భావమే నాకర్థం కాలేదు..."

"అనుకోడానికేముంది. ఈ క్షణంలో మీరు గొప్పవారు కాకపోవచ్చు. కానీ నా కళ్ళు భవిష్యత్తును చూస్తున్నాయి..." అన్నాడతను.

"అయితే భవిష్యత్తులో నేను గొప్పవాడినౌతున్నానంటారు. అందుకు ఆధారాలు కూడా ఏమైనా

వున్నాయా?"

"లేకపోవడమేమిటి? మీరుంటున్న ఇల్లే అందుకు ఆధారం—"

నేను తెల్లబోయాను. అతను తిన్నగా ఏమీ చెప్పడం లేదనిపించింది. ఇలా రోడ్డుమీద సంభాషణ కొనసాగించడం కంటే అతన్నింటికి తీసుకువెళ్ళడం మంచిదనిపించింది. అతనివల్ల సాకేదైనా అదృష్టం పట్టినా పట్టవచ్చునని నాకు తోచింది.

"క్షమించాలి-ఇంతవరకూ మీ పేరు అడగలేదు..." అన్నాను.

"నా పేరు ధర్మారావు. మీరు అన్యథా భావించనంటే నాకు మీ పరిచయభాగ్యం కావాలి..." అన్నాడతను.

"రండి ఇంటికి వెడదాం—" అన్నాను మొహమాట పడుతూనే.

## 2

"ఎవరండీ ఆయన!" అంది శ్రీమతి.

నేను బజార్లో మా సంభాషణా సారాంశాన్ని టూకీగా శ్రీమతికి చెప్పి-"ఈయన్నెక్కడైనా చూసిన గుర్తుందా నీకు—నీ పేరు కూడా చెప్పాడీయన—" అన్నాను.

"పేర్లు చెప్పడంలో విచిత్రమేముందండీ-ఏ జనాభా లెక్కల పేర్లో చెప్పి-ఎవరో ఒకరొచ్చి పేరడిగి వెడుతూనే వుంటారు..." అంది శ్రీమతి.

అందుకే శ్రీమతి తెలివితేటలు నన్నాశ్చర్యపరుస్తూంటాయి. నేనాశ్చర్యపడే చాలా విషయాలనామె టూకీగా

తేల్చేసి తీసిపారేస్తూంటుంది. అందుకూడా నేనాశ్చర్య పడినప్పుడు మాత్రం ఆమె సిగ్గుపడుతుంది.

శ్రీమతి ఓసారి ధర్మారావున్న గదిలోకి తొంగిచూసి వచ్చి—"ఆయన్ను నేనెప్పుడూ చూడలేదండీ— ఆయనతో కాస్త జాగ్రత్తగా వ్యవహారించండి. చాలా మంది దొంగలు పెద్దమనుషుల్లా నటించి యిళ్ళలో ప్రవేశిస్తున్నారుట—" అంది.

"మనగురించి చాలా వివరాలు తెలిసిన బాపతులా గున్నాడు. అటువంటి వాడెవ్వడూ మనింటికి దొంగతనానికి రాడు. అందుకని ఆ భయం లేదునాకు. కానీ మన అదృష్టం గురించి ఏం చెబుతాడో వినాలని వుంది" అన్నాడు.

"పూటభోజనం కోసం కూడా పెద్ద పెద్ద అబద్దాలు చెప్పేవాళ్ళున్నారీ రోజుల్లో. మీరు మటుకు మొహ మాటపడి ఆయన్ను భోజనానికుంచకండి. ఎలాగో ఆ మాటా ఈ మాటా చెప్పి పంపించెయ్యండి."

"కనీసం కాఫీ అయినా కలిపివ్వు—" అన్నాను శ్రీమతితో.

"కాఫీకేం భాగ్యం—" అని వంటింట్లోకి వెళ్ళింది శ్రీమతి. నేను అతనున్న గదిలోకి వెళ్ళాను. నన్ను చూడగానే అతని ముఖం వికసించింది.

"లోపల్నించి రావడానికి మీకాస్త టైము పట్టింది. బహుశా నన్నుగురించి మీ శ్రీమతికి వివరించి వుంటారు. నా కోసం ఆవిణ్ని శ్రమపెట్టకండి. కాఫీ ఏదైనా చేస్తున్నారో ఏమో, నేను కాఫీ, టీలు తాగను. ముందుగానే చెప్పడం మంచిది" అన్నాడు ధర్మారావు.

"నిజంగా మీరు కాఫీ, టీలు తాగరా?" అన్నాను.

"నిజంగానే" అన్నాడతను.

"ఈ రోజుల్లో కాఫీ, టీలు తాగనివారెవరండీ—" అన్నాను ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"నేనున్నాను కదండీ" అని నవ్వాడతను.

వెంటనే—"వసంతా - ఓసారిల్లారా అంటూ కేక" పెట్టాడు.

అతిథిమర్యాద విషయంలో నాకేమీ తెలియదని శ్రీమతి విసుక్కుంటూంటుంది. ఎవరైనా ఏదైనా వద్దంటే ఓహో అని విని ఊరుకోవటం నా అలవాటు. వసంత అభిప్రాయంలో అది క్షమించరాని అపరాధం.

ఇంటికి వచ్చినవాడికి తినడానికో, తాగడానికో ఏదో ఒకటివ్వాలంటుందామె. అలాగని స్వతంత్రించి ఎవరికైనా భోజనానికుండమంటే నన్ను దెబ్బలాడుతుందామె. అతిథిమర్యాద చేయాలి కానీ పొదుపు విషయం మరవ రాదంటుందామె. చాలా అనుభవాల అనంతరం నేను స్వతంత్రించడం మానేసి పూర్తిగా ఆమె సలహామీద ఆధారపడడం నేర్చుకున్నాను.

వసంత వచ్చి "ఏమిటి సంగతి?" అంది.

నేను శ్రీమతిని ధర్మారావుకు పరిచయం చేశాను.

"మీ పేరు తెలుసు. మీ పరిచయభాగ్యం లభించడం కూడా నా అదృష్టం" అన్నాడు ధర్మారావు. అతని మాటలు విని శ్రీమతివైపు చూశాను. పొగడ్తలో లొంగ వద్దని నన్నెన్నోసార్లు హెచ్చరించే వసంత తను మాత్రం ఆ హెచ్చరికను పాటించదు. ఆమె బుగ్గలిప్పుడు కొద్దిగా ఎరుపెక్కాయి.

"ఈయన కాఫీ తాగనంటున్నారు..." అన్నాను.

వసంత ఏదో చెప్పబోయేంతలోగా "కావాలంటే భోజనాన్నికుండమన్నా వుండిపోతాను కానీ కాఫీ విషయంలో నన్ను బలవంత పెట్టవద్దు. నేను ఒకప్పుడు అవి తాగేవాణ్ని. కానీ ఓ కారణంవల్ల అవి మానేశాను. మానేశాక అవంటే నిజంగానే విరక్తి పుట్టింది..." అన్నాడు ధర్మారావు కంగారుగా.

వసంత వైపు కుతూహలంగా చూశాను. ఆమె అప్రయత్నంగానే "అయితే నా వంటరుచి చూసే వెడుదురు గాని" అంది. "వసంతా! ఈ మాత్రం స్వతంత్రం నాకెందుకివ్వవు?" అని మనసులో మాత్రం అనుకుని— "నా మనసులోని మాట వసంత చెప్పింది..." అని పైకి అన్నాను. తెలివిగా మాట్లాడానన్నట్లుగా వసంత నావైపు చూసింది.

"మిమ్మల్ని మొహమాట పెట్టి ఈ పూట మీ ఇంటి భోజనానికి కుదిరాను. అయితే అందుకు మీరు చాలా సంతోషించే క్షణం ముందున్నది. ఇంతకీ నేనెందుకు కాఫీ తాగడం మానేశానో వింటారా?" అన్నాడు ధర్మారావు.

ఇతని వ్యవహారం నాకు అంతుపట్టకుండా వున్నది. ముక్కూ మొహం తెలియనివాడైనప్పటికీ కావలసినవాడిలా ప్రవర్తిస్తూ ఆ అనుభూతి నాకు కలిగిస్తున్నాడు.

"చెప్పండి." అన్నాను ఆసక్తి లేకపోయినా.

"విషప్రయోగ భయం..." అన్నాడు ధర్మారావు.

ఉలిక్కిపడ్డాను. ఎప్పటికప్పుడే అతని మాటలపట్ల ఆసక్తిని కోల్పోతూ తిరిగిపొందడం జరుగుతోంది నా

విషయంలో. శ్రీమతివంక చూశాను. ఆమె కూడా ఆశ్చర్యంలో వుంది.

"చెప్పండి!" అన్నాను మళ్ళీ.

"నా ప్రాణం ప్రమాదంలో వుంది_ గత అయిదారు సంవత్సరాలుగా నేను తాగే కాఫీలో విషం కలుప బడినా అదృష్టవశాత్తూ ఆ కాఫీ నేను తాగలేదు. అప్పట్నించీ ఈ పానీయసేవనం మానుకున్నాను. మీబోంట్ల ఇంటిలో ప్రమాదం వుండదు. కానీ యీ అలవాటుండడంవల్ల ఎక్కడో అక్కడ పప్పులో కాలేయగలను..."

"మీకు విషప్రయోగం చేసేవారెవరు?"

"అది చెబితే విషప్రయోగం అవసరం లేకుండానే చస్తాను. నా కబుర్లకేంగానీ మీరు వెళ్ళి వంటప్రయత్నం చేయండి. నాకు చాలా ఆకలిగా వుంది__" అన్నాడు ధర్మారావు.

ధర్మారావు చెప్పిన పద్ధతి చాలా చనువుగా వుంది వసంత ఏమీ అనుకోకుండానే లోపలకు వెళ్ళిందని మొహం చూసి తెలుసుకున్నాను.

వసంత వెళ్ళగానే ధర్మారావు నా వంక తిరిగి__ "నా వ్యవహారం కొంకతిరుగుడుగా వున్నదని మీరనుకో వచ్చు. కానీ ప్రస్తుతం నేనున్న పరిస్థితుల్లో అది తప్పడం లేదు. నా అదృష్టం మీ అదృష్టంలో ముడివడి వుంది. ఒకసారి మీ పెరట్లోకి వెడదామా?" అన్నాడు.

"పదండి" అన్నాను.

ఇద్దరం పెరట్లోకి వెళ్ళాం. వెళ్ళేముందు నేను అక్కడ

దీపం వేశాను.

ధర్మారావు పరీక్షగా దొడ్డిని చూస్తున్నాడు.

మా దొడ్డి మరీ అంత విశాలమైనది కాదు. రెండు మామిడి చెట్లున్నాయి. ఒక గోడవార గులాబి మొక్కలూ మరో గోడవార గోంగూర వేశాం.

"అదే దొడ్డి ఏం మారలేదు..." అనుకున్నాడు ధర్మారావు-కాస్తపైకి వినబడేలా.

అది నా లోని లోపమో, ధర్మారావులోని విశేషమో తెలియదు కానీ ఈ పూట ధర్మారావు నన్ను బాగా ఆశ్చర్యపరిచేస్తున్నాడు.

"ఈ దొడ్డి మీకు తెలుసా?" అన్నాను.

"ఎనిమిదేళ్ళ క్రితం ఆ రెండు మామిడిచెట్లూ నా చేత్తో స్వయంగా నాటాను..." అన్నాడు ధర్మారావు.

నాలుగేళ్ళ క్రితం నేనాయిల్లు కొన్నాను. నాకు తెలిసినంతవరకూ ధర్మారావు కాయింటిలో సంబంధముండడానికి వీల్లేదు.

ఆ యిల్లు వ్యాపారంలో పేరెన్నికగన్న భగవంతరావుగారిది. అందులో ఆయన బంధువులుండేవారు. ఓ సుముహూర్తాన భగవంతరావుగారా యిల్లు అమ్మివేయాలని తీర్మానించుకున్నారు. నేనా యిల్లు కొనుక్కున్నాను. రెండు విధాలుగా యిల్లు నన్ను ఆకర్షించింది. ఒకటి నా చేతిలో సిధ్ధంగా డబ్బుండడం. రెండు నలభైవేలైనా ఖరీదుచేసే ఆ ఇల్లు పదహారువేలకు భగవంతరావుగారమ్మడం.

ఇల్లమ్మేటప్పుడు భగవంతరావుగారు నాకోమాట చెప్పారు. ఆ దొడ్లోని రెండు మామిడి చెట్లూ ఆయనకు

చాలా ముఖ్యమైనవట. కొన్ని సెంటిమెంటల్ కారణాల వల్ల ఆ ఇల్లు ఆయన తక్కువ ధరకు పరాయివాళ్ళకు అమ్ముతున్నానన్నాడు. ఏ పరిస్థితిల్లోనూ ఆ మామిడిచెట్ల జోలికి వెళ్ళవద్దని ఆయన కోరాడు. అలాచేసే పక్షంలో తనకుగానీ తన కుటుంబం వారికిగానీ తెలియజేయ వలసిం దని ఆయన కోరాడు.

ఇల్లు చౌకగావస్తున్న కారణంగా ఆ షరతుకు అంగీక రించాను. ఆ షరతు నోటిమాటగానే తప్ప వ్రాత మూలకంగాలేదు. ఆ మామిడి చెట్లలో ఒకటి అవకాయ కాయని, రెండోది పళ్ళచెట్టు.

భగవంతరావుగారు భద్రంగా చూడాలని చెప్పిన ఆ మామిడి మొక్కలు ధర్మారావు ఎలా నాటాడో నాకు ఆశ్చర్యంగానే వుంది. అందుకే—"నాకు తెలిసి నంతవరకూ ఈ యిల్లు నేను కొనకముందు భగవంతరావు గారిది" అన్నాను.

"అవును. నాకు తెలిసినంతవరకూ కూడా అదే నిజం. అయితే నేను చెబుతున్నది మామిడి మొక్కల గురించి. అవి నేనే నాటాను."

"ధర్మారావునడిగి ఆ మామిడిమొక్కల రహస్యం తెలుకోవాలనిపించింది. భగవంతరావుగారు నన్నా మామిడి మొక్కలు గురించి ప్రత్యేకంగా హెచ్చరిం చారు. అదే మామిడి మొక్కలను తను స్వయంగా నాటానంటున్నాడు ధర్మారావు—ఏమైనా ప్రత్యేకత ఉందా—ఈ మామిడి చెట్లలో" అనడిగాను.

"ఉంది. మీ యొక్క, నా యొక్క అదృష్టం— ఈ మామిడిచెట్ల మీదనే ఆధారపడివుంది" అన్నాడు

ధర్మారావు.

"వివరంగా చెప్పండి" అన్నాను.

"ఏమీ లేదు. మీరు భగవంతరావుగారిని కలుసుకోండి. ఈ మామిడి మొక్కలున్న స్థానంలో యాభై అడుగుల లోతుకు గోతులు తీయించాలని అనుకుంటున్నట్లు చెప్పండి. అందుకు ఆయన అనుమతి అడగండి. ఎన్ని ప్రశ్నలు వేసినా ఈ ఆలోచన మీ బుద్ధికి తోచినట్లే వుండాలి కానీ-నా పేరు బయటకు రాకూడదు" అన్నాడు ధర్మారావు.

"మాట్లాడడంలో నా తెలివితేటలు చెప్పుకోదగ్గవి కావు. ఒకవేళ మీ పేరు చెప్పవలసి వస్తే..."

"మీరూ, నేనూ కూడా జైలుకానికి వెళ్ళిపోవచ్చు" అన్నాడు ధర్మారావు.

నాకు నోటమాట రాలేదు. ఏదో అడుగుదామనుకుంటూండగా శ్రీమతి పిలుపు వినబడింది- "వంటైపోయినట్లే-కాళ్ళు కడుక్కుని భోజనానికి లేవచ్చు..."

# 3

భోజనాలయేక మేము ముగ్గురం కూర్చుని మాట్లాడుకున్నాం.

భగవంతరావుగారితో వెళ్ళి మాట్లాడవలసినవాణ్ణి నేనే అయినప్పటికీ సంభాషణ అంతా శ్రీమతికీ, ధర్మారావుకూ మధ్యనే యెక్కువగా జరిగింది. శ్రీమతి అడిగిన ప్రశ్న లన్నింటికీ ధర్మారావు సమాధానమివ్వలేదు. అతను నాకు చెప్పిన మాటల సారాంశమిది.

నేను వెళ్ళి భగవంతురావును కలుసుకుని నేను తీయించదల్చుకున్న గోతుల సంగతి చెప్పాలి. ఎందుకని

ఆయన అడిగితే కారణం చెప్పకుండా తప్పించుకోవాలి. నా కేవిధమైన అదృష్టం కలిసివచ్చినా అందులో సగం వాటా ధర్మారావుకివ్వాలి.

"ఇందులో యేమీ ప్రమాదం లేదా?" అనడిగింది శ్రీమతి.

"నా పేరు బయటకు రానంతవరకూ ఏ విధమైన ప్రమాదమూ లేదు—" అన్నాడు ధర్మారావు.

"ఈ పని మేము చేయకపోతే—"

"కొన్ని లక్షలు నష్టపోతారు..." అన్నాడు ధర్మారావు.

ఉలిక్కిపడింది శ్రీమతి. లక్షలు అన్న పదం విని ఆమె కళ్ళు మెరిశాయి. నా కళ్ళూ మెరిసే ఉంటాయి కానీ నేను శ్రీమతిని గమనించే పనిలో ఉన్నాను.

"లక్షలు ఎలా వస్తాయి?"

"మీ దొడ్లో గోతులు తీయించడానికయ్యే ఖర్చులు నావి..." అన్నాడు ధర్మారావు.

శ్రీమతి ప్రశ్నకు అది జవాబుకాదని నాకు తెలుసు' కానీ ఆ గోతులకూ లక్షలకూ ఏదో సంబంధముందని నా అనుమానం.

అంతా అయోమయంగా ఉంది నాకు—అదే అవస్థలో నన్నూ, శ్రీమతినీ వదిలిపెట్టి ధర్మారావు వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయేముందు — "మళ్ళీ వారం రోజుల తర్వాత వస్తాను..." అని చెప్పాడు.

అతను వెళ్ళిపోయేక నేనూ శ్రీమతీ కాసేపు ఈ విషయమై చర్చించాము. ఏమవుతుందో చూడొచ్చు, నేను వెళ్ళి భగవంతరావుని కలుసుకుని తీరవలెనని శ్రీమతి తీర్మా

నించింది. తెలుగులో క్యాలెండరు చూసి అందుకు ఎల్లుండే సరైన రోజని ముహూర్తం పెట్టింది.

భగవంతరావు నన్నెలాంటి ప్రశ్నలు వేస్తాడో, వాటికి నేనెలాగ జవాబు చెప్పాలో ఏకపాత్రాభినయం చేసి చూపించింది. ఏ పరిస్థితుల్లోనూ ధర్మారావు పేరు బయట పెట్టవద్దని తనుకూడా హెచ్చరించింది.

అంతా అయిపోయేక మేము సంపాదించబోయే లక్ష రూపాయల నేంచేయాలో పథకాలు వేసింది. పథకాలు వేయగానే మా ఇద్దరికీ కలలు ప్రారంభమయ్యాయి. అలా కొంతసేపు కలలు కన్నాకనే మాకు నిద్ర పట్టింది.

# 4

నా బెంగంతా ఒక్కటే!

భగవంతరావు దగ్గర నే నిల్చోని ఉండవచ్చుగాక. అంతస్థులో ఆయనకూ నాకూ చాలా భేదముంది. ఆయన్ను కలుసుకుని మాట్లాడడానికి సమయం దొరకడమే చాలా కష్టమని చెప్పుకుంటారు. నాలాంటి చిన్నవాణ్ణి చూడ్డానికాయనకు వీలుచిక్కుతుందా అన్నది నా అనుమానం.

ఏదో యధాలాపంగా ఆయన కొనుగోలు సమయంలో తనకా మామిడిచెట్ల సంగతి చెప్పి ఉండవచ్చు. అందుకని ఇప్పుడు పని కట్టుకుని ఆయనకా విషయాన్నేదో పెద్దగా వెళ్ళి చెప్పిరావడం హాస్యాస్పదంగా ఉంటుందేమో?

ఒకవేళ అది హాస్యాస్పదంగా ఉండకపోయినా ఆయన తర్వాత వేసే ప్రశ్నలకు తట్టుకోగలనా? ఆయన నా మాట విని "వద్దు. ఆ చెట్లనేం చేయవద్దు" అంటే అలాగే అని వెనక్కి వచ్చేస్తానేమో నేను. అప్పుడు

వసంత నన్నే మాత్రమూ క్షమించదు.

ఏమైతేనేం అనుకున్నరోజున నాకు భగవంతరావుతో అపాయింట్ మెంటు దొరికింది. వణుకుతూనే ఆయన గదిలో అడుగుపెట్టి "నమస్కారం!" అన్నాను.

"అలా కూర్చో!" అన్నాడాయన. ఆయన ఓసారి నాకేసి చూసి ఏదో పుస్తకం చూస్తున్నాడు. నా వునికి నాయన ఆట్టే పట్టించుకున్నాడనిపించలేదు. అయిదు నిముషాలలాగే గడిచిపోయాయి. ఆయనతో మాట్లాడ డానికి వచ్చిన వాణ్ణయినప్పటికీ ఆయన ఆలోచనల తీవ్ర తను చూసి భయపడ్డాను. ఎక్కడ దగ్గు వస్తుందో ఆయను, డిస్టర్బ్ చేస్తానోనని భయపడుతున్నాను.

"శివరావుకదూ నీ పేరు..."

"అవునండి..."

ఆయన మళ్ళీ పుస్తకంలోకే చూసుకుంటున్నాడు. కాసేపాగి "మా యిల్లు మళ్ళీ యెవరికేనా అమ్మేస్తావను కున్నాను. అలా చేయలేదనుకొంటే బాగా నచ్చినట్లుంది నీకు..." అన్నాడు.

"అంత మంచి యిల్లెవ రమ్ముకుంటారండీ...?" అన్నాను.

"మంచిల్లు కాబట్టే. నలభైవేలు చేస్తుందది. నువ్వు నా దగ్గర పదహారువేలకి కొన్నావు—తర్వాత దాన్ని హెచ్చు ధర కమ్ముకుంటావనుకున్నాను..." అన్నాడు భగవంతరావు.

నన్ను గురించి ఆయనలా అనుకోవడం నాకు నచ్చ లేదు. నాకు నచ్చని మాట ఆయన మాట్లాడడంతో— ఆయనతో మాట్లాడడానికి నా ధైర్యం పెరిగింది. "అ

ఇంటి విషయంలోనే తమతో ఓ చిన్న విషయం మనవి చేసుకుందామని వచ్చానండి..." అన్నాను.

"ఏమిటది?"

"దొడ్లో—రెండు మామిడి చెట్లున్నాయి. వాటి జోలికి నే నెప్పుడైనా వెళ్ళే పక్షంలో తనకు తెలియజేయ వలసిందిగా నాకు ఇల్లు కొనుక్కున్న సమయంలో తమరు స్వయంగా చెప్పారు. అందుకే నే నిప్పుడు స్వయంగా వచ్చాను."

హఠాత్తుగా భగవంతరావు దృష్టి నాపైన కేంద్రీక రించబడింది. ఆయన చేతిలోని పుస్తకాన్ని మూసేసి నా వంక అదోలా చూస్తూ—"ఏం చేయదల్చుకున్నావ్? మామిడి మొక్కల్ని తవ్వేసి సపోటా చెట్లు వేస్తావా?" అన్నాడు.

"లేదండి—ఆ రెండు చెట్ల ప్రాంతంలోనూ యాభై అడుగుల గోతులు తీయిద్దామనుకుంటున్నానండి—" అన్నాను.

భగవంతరావు ఉలిక్కిపడ్డాడని ఖచ్చితంగా చెప్ప గలను. "ఎందుకా గోతులు?"

"మన్నించాలి. అవన్నీ నా స్వవిషయాలు. మామిడి మొక్కల జోలికి వెళ్ళేటప్పుడు తమకు తెలియబర్చడం నా విద్యుక్త ధర్మంగా భావించి ఇప్పుడు మీ దగ్గరకు వచ్చాను. మరి సెలవు తీసుకొంటాను..." అంటూ లేచాను.

భగవంతరావు తడబడుతూ "కూర్చో—నీతో ఇంకా మాట్లాడాలి!" అన్నాడు.

అప్రయత్నంగా నే కూర్చున్నాను నేను.

"ఎవరైనా గోతులు తీయించమని నిన్ను ప్రోత్సహించేరా?"

"అలాంటిదేమీ లేదు..." అన్నాను భయపడుతూనే.

భగవంతరావు చాలా నెమ్మదిగా "అక్కడ గోతులు తీయించడానికి వీల్లేదు..." అన్నాడు. ఎంత నెమ్మదిగా అన్నప్పటికీ ఆయన మాటల్లో ఆజ్ఞ వుంది.

"నేను చెప్పవలసింది చెప్పాను.వినవలసిందేమీ లేదు" అంటూ లేచాను. మా ఆవిడ శిక్షణను మాత్రం మనసులో మెచ్చుకుంటున్నాను.

ఈసారి భగవంతరావు నవ్వి "నీతో వాదిస్తూ కూర్చోడానికి నాకు టయింలేదు.ఎవరైనా అక్కడ నీకు ఏ లంకె బిందెలో దొరుకుతాయని చెప్పుంటారు. అలాంటి ఆశలేం పెట్టుకోమాకు. నీ ప్రయత్నం మానేస్తే లక్షరూపాయలిస్తాను నీకు..." అన్నాడు.

నాకు నోట మాటరాలేదు. ఏమీ చేయలేని, చెప్పలేని స్థితి వచ్చేసింది. భగవంతరావు నన్ను చంపేస్తానన్నా నేనంత ఆశ్చర్యపడి ఉండేవాణ్ణి కాదేమో!

నేనింకా ఆశ్చర్యంనుంచి తేరుకోకుండానే— "నీ ప్రయత్నం మానేసినందుకో లక్ష - మళ్ళీ యిలాంటి ప్రయత్నం తలపెట్టకుండా వుండేందుకింకో లక్ష - ఓకే అంటే ఓ బ్రీఫ్ కేస్ ఉచితం. ఇప్పుడే ఇచ్చేస్తాను..." అన్నాడు భగవంతరావు.

భగవంతరావు కోటీశ్వరుడనీ ఆయనకు లక్షలంటే విలువలేదనీ నాకు తెలుసు. ఆయన యెంతటి ధనవంతుడయుండాలో నాకిప్పుడే తెలిసింది. "రెండు మామిడి

మొక్కలకు రెండు లక్షలా?" అన్నాను.

"అవును. నేననుకున్న పని సాధించడానికి ఎంతైనా ఖర్చు పెడతాను. మనుషుల ప్రాణాల్నికూడా లెక్క చేయను. మళ్ళీ ఎప్పుడైనా నువ్వు నా దగ్గరకు రాదల్చుకుంటే ఒక విషయం గుర్తుంచుకోవాలి. మనిషి ప్రాణాల కన్నా నాకా మామిడిచెట్లు ముఖ్యం—"

# 5

"అన్నీ మంచి నోట్లే నంటారా?—..." అంది వసంత.

"దొంగనోట్లయితే మామిడిచెట్లు పోతాయికదా—" అన్నాను.

"పాపం—ధర్మారావుగారు నిజమే చెప్పాడండీ..." అంది వసంత.

"ఏమైతేనేం ఆయనో లక్ష సంపాదించుకున్నాడు. మనకో లక్ష సంపాదించిపెట్టాడు. ఇది అనుకోని లాభం..." అన్నాను.

"ఆయనకూ లక్ష ఇచ్చేయాలంటారా?" అంది వసంత బాధగా.

"ఇందులో మాత్రం నీ సలహా వినేదిలేదు. అన్న మాట తప్పితే ఉన్న ప్రాణం పోవచ్చు..." అన్నాను భయంగా.

"లక్ష రూపాయలూ ఏం చేద్దామంటారు? బ్యాంకులో వేస్తే యెవరికైనా అనుమానం వస్తుందేమో?" అంది వసంత.

"దానికో వుపాయం ఆలోచించాను. తలో బ్యాంకులోనూ తలో కాస్తా ఫిక్సెడ్ డిపాజిట్ల రూపంలో

పారేద్దాం. ఎవరికీ ఏ అనుమానం రాదు'' అన్నాను.

డబ్బును చూసేసరికి వసంతకు మతిపోయినట్లయింది. ఆమె మెదడు పనిచేయడం మానేసింది. లేకపోతే ఆమె నన్ను సలహా అడగడమూ, నేను చెప్పింది వినడమూ కూడా విచిత్రమే!

అన్న రోజుకు ధర్మారావు మా దగ్గరకు వచ్చాడు. ఆయనకు జరిగినదంతా వివరించి చెప్పాను.

"అయితే భగవంతరావు బ్లాక్ మనీలో కొంత బయటకు వచ్చిందన్నమాట!'' అన్నాడు ధర్మారావు. "మీకిచ్చిన డబ్బాయనకో లెక్కలోనిది కాదు. మీరు తెలివి తక్కువగా బేరాన్ని చాకలో తేల్చేశారు. అయినా మించిపోయిందేమీ లేదు. ఆ రెండు లక్షలూ తీసుకుని మళ్ళీ భగవంతరావుదగ్గర కెళ్ళండి. ఏ పరిస్థితుల్లోనూ బేరం అయిదు లక్షలకు తగ్గించవద్దు—''

మనిషి ప్రాణాలకన్న ఆ మామిడిచెట్టే తనకు ముఖ్యమని భగవంతరావు చేసిన హెచ్చరిక నా చెవుల్లో వినిపించింది "మరి నేనాయన దగ్గరకు వెళ్ళను. అత్యాశకు పోతే మొదలుకే మోసం రావచ్చు. నేను అల్పసంతోషిని'' అనేశాను. వసంత కూడా ఏమీ మాట్లాడలేదు.

ధర్మారావు నావంక అదోలా చూసి "మీరు వెడతారని నాకు తెలుసు. ఎందుకంటే గొప్పవాళ్ళు కావాలని మీ జాతకంలో రాసిపెట్టి వుంది. ఈసారి భగవంతరావు దగ్గరకు వెళ్ళి ఆ రెండు లక్షలూ ఇచ్చేయదల్చుకున్నానని చెప్పండి. మామిడిచెట్ల క్రింద నిధి వున్నదని దాని విలువ కనీసం పాతికలక్షలు చేస్తుందనీ మీకు తెలిసినట్లు చెప్పండి'' అన్నాడు.

"ఆ మామిడిచెట్ల క్రింద నిధి వుందా?" అంది వసంత చటుక్కున "అయిన పక్షంలో ఆయన దగ్గరకు వెళ్ళడ మెందుకూ! మనమే గుట్టుచప్పుడు లేకుండా..."

"అలా కుదరదండి..." అన్నాడు ధర్మారావు—అక్కడ ఏమీ లేకుండానే తెలివితక్కువగా ధర్మారావు మీ ఆయనకు మారుమాట్లాడకుండా రెండు లక్షలు సమర్పించుకున్నాడనుకుంటున్నారా? భగవంతరావు చాలా తెలివైనవాడు. ఆయనకు ఎక్కడ ఖర్చుపెట్టాలో ఎక్కడ పొదుపు చేయాలో బాగా తెలుసు. మన విషయంలో ఆయన చాలా వితరణ చూపిస్తాడని నాకు తెలుసు. ఆ నిధి మనకు పనికివచ్చేవి కాదు. ఆయనకు మాత్రం చాలా ముఖ్యమైనది."

"అదిసరే-దానికోసం ఆయన ఎంత డబ్బయినా ఖర్చు పెడుతున్నాడంటే—అదేదో విలువైనదే అక్కడుండి వుండాలి" అంది వసంత.

"భగవంతరావులాంటి వాడితో వ్యవహారించేటప్పుడు మన హద్దుల్లో మనముండాలి. మనకో ఇరవైలక్షలదాకా ముట్టిందనుకోండి. చెరో పదిలక్షలూ అన్న మాట. దానితో తృప్తిచెందకపోతే అది అత్యాస అవుతుంది. అలాగే ఆ మామిడిచెట్లవద్ద తవ్వించడానికి ప్రయత్నించామంటే—అది హద్దుమీరటమే అవుతుంది" అన్నాడు ధర్మారావు.

"నామటుక్కు నాకు లక్షరూపాయలు చాలని పిస్తోంది" అన్నాను.

"సంతృప్తి గొప్పవాళ్ళ లక్షణం. అటువంటి వాళ్ళ దగ్గరికే లక్ష్మి మళ్ళీమళ్ళీ వెడతానంటుంది. మళ్ళీ వెళ్ళి

ప్రయత్నించండి."

"ఆయన నన్ను బాగా హెచ్చరించాడు మళ్ళీ వెళ్ళేమాటయితే నా ప్రాణాలు దక్కవు" అన్నాను.

"మీ ప్రాణాల గురించి భయపడకండి. ఎటొచ్చీ తగుమాత్రం జాగ్రత్తలు తీసుకోండి. ఆయన్ను పెర్సనల్ రూంలోనే మాటవ్వండి. ఎక్కడికి రమ్మన్నా వెళ్ళకండి. ఏ ఆశకు ప్రలోభ పడకండి. ఇరవై లక్షల్నించి బేరాన్ని చాలావరకు దింపకండి. ఆఖరిబేరం అయిదు లక్షలు. ఇరవై ఇచ్చేమాటైతే జన్మలో రానన్నండి. అయిదైనా పదైనా మళ్ళీమళ్ళీ రావాల్సొంటుందని అనండి. నిర్భయంగా వ్యవహరించండి. మీరు భగవంత రావుని కలుసుకుందుకు వెళ్ళినట్లు తగినన్ని సాక్ష్యాధారాలుంచండి."

# 6

"నువ్వు మళ్ళీ వస్తావని నాకు తెలుసు!" అన్నాడు భగవంతరావు.

నేను ఇబ్బందిగా నవ్వాను.

"నా ఔదార్యం నీ ఆశను పెంచుతుంది. బ్రీఫ్ కేసు కూడా తెచ్చుకొన్నావు. ఎంత పడుతుందనుకొంటున్నావేమిటి?"

"ఇరవై లక్షలు"అని నవ్వి "ఇది మీరిచ్చిన బ్రీఫ్ కేసే" అన్నాను.

"ఇరవై లక్షలా — మైగాడ్ — ఏమిటి నీ ఉద్దేశ్యం?"

"ఏమీ లేదు. మీరిచ్చిన బ్రీఫ్ కేసు తిరిగిచ్చేద్దామని వచ్చాను" అన్నాను.

ఆయన చేతులుచాచి అందుకున్నాడు. తెరిచి చూసేక

ఆయన ముఖం వాడిపోయింది. అందులో ఆయనిచ్చిన రెండులక్షలూ వున్నాయి.

"ఏమిటి కథ?" అన్నాడు భగవంతరావు.

"మామిడిచెట్ల క్రింద కనీసం పాతికలక్షలు విలువ చేసే నిధి వుందని తెలిసింది. అందువల్ల అక్కడ గోతులు తీయించే వుద్దేశం మానుకోలేదు. అలాంటప్పుడు మీ రెండు లక్షలు వుంచుకోవటం అన్యాయం కదా–అందుకని తిరిగి ఇచ్చేద్దామని వచ్చాను."

"అయితే దానికి యాభై అడుగుల గోతులెందుకు? నీ పొడుగు ఆరడుగులు కూడా లేదు" అన్నాడు భగవంత రావు. ఆయన చూపులు క్రూరంగా వున్నాయి.

నాకు భయంవేయలేదు. కోపం వచ్చింది–"అవసరాన్ని బట్టి ఎంతయినా ఎదగ గలనులెండి" అన్నాను.

నా సమాధానం కంటే అందులోని ధైర్యం భగవంత రావుని కదిలించిందనుకుంటాను. ఆయన అదోలా చూసి "అయితే నా డబ్బు నాకిచ్చేస్తానంటావ్" అన్నాడు.

"అవునండి..."

"చాలా థాంక్స్, వెళ్ళిరా!"అన్నాడు భగవంతరావు.

దెబ్బ తిన్నాను. ఏంచేయాలో తోచలేదు. వెనకడుగు వేసి—వెనక్కి తిరిగేక కూడా ఆయనింకా నన్ను వెనక్కి పిలుస్తాడన్న ఆశవుంది. కానీ అలా జరగలేదు.

# 7

వసంత కళ్ళలో నీళ్ళు తిరిగాయి—"ఒకటి కాదు రెండుకాదు. రెండులక్షల రూపాయలు వచ్చినట్లే వచ్చి పోయాయి..."

"అందుకే అత్యాశ పనికిరాదన్నారు..." అన్నాను.

"బాగుందండీ_అసలీ రెండులక్షలు మాత్రం వస్తా యనుకున్నామా? ధర్మారావుగారు చెప్పింది విని చేయడం వల్లనేకదా మనకవి వచ్చాయి. మళ్ళీ ఆయన సలహానే పాటించాము. వచ్చినవి వచ్చినట్లే పోయాయి..." అంది వసంత.

"ఏదో గారడీలో కాసేపుండి వచ్చినట్లయింది..." అన్నాను.

"సరే_ఇలా జరిగినట్లు ధర్మారావుగారికి ఉత్తరం రాసి పారేయండి..." అంది వసంత. ఈ సారి ధర్మారావు తను మా ఇంటికి రాలేనన్నాడు. ఏం జరిగిందీ తనకు త్తరం ద్వారా తెలియబర్చమన్నాడు. అందుకే వసంత చెప్పిన విధంగా ఆయనకు త్తరం రాశాను.

తిరుగుటపాలో ధర్మారావు దగ్గర్నుంచి జవాబు వచ్చింది. ఏమీ కంగారు పడవద్దనీ ఒక వారంరోజులాగి మనకు మళ్ళీ ఉత్తరం వ్రాయమనీ వ్రాసాడాయన. ఈలోగా భగవంతరావేదైనా చిన్న బేరం పెడితే లొంగ వద్దని కూడా హెచ్చరించాడు. ఆ ఉత్తరం చదివేక శ్రీమతికి కొండంత ధైర్యం వచ్చింది. మళ్లీ లక్షలు సంపాదించగలమని ఆమెకు నమ్మకం కలిగింది.

భగవంతరావు దగ్గర్నుంచి వచ్చేసిన రెండ్రోలకు నాకు ఆయన దగ్గర్నుంచి టెలిఫోన్ వచ్చింది. తాజ్ మహల్ హోటల్లో అయిదోనంబరు గదిలో నేనాయన్ను కలుసుకోవాలట.

"నాకు వీలుపడదండీ. గోతులు మిషన్ల ద్వారా తీయిద్దామనుకుంటున్నాను. ఆ ప్రయత్నంలో చాలా హడావుడిగా వున్నాను" అన్నాను.

సమాధానంగా టెలిఫోన్ క్లిక్ మంది.

సాయంత్రం ఈ విషయం వసంతకు చెప్పాను. ఆమెలో మళ్లీ ఆశలు చిగురించాయి. పదిలక్షలెలా ఖర్చు చేయాలో మరీ ఉత్సాహంగా కాకపోయినా ఓమాదిరిగా చర్చించింది.

రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో ఆ రోజు మా ఇంటి తలుపు నెవరో తట్టారు. నేను లేచానుగానీ వసంత లేచి నన్ను వెళ్ళొద్దంది. తను తలుపుదాకా వెళ్ళి-- "ఎవరది?" అనడిగింది. ఆమె వెనకనే నేనున్నాను.

అవతల్నుంచి జవాబు రాలేదు.

"ఇంట్లో ఆయన లేరు. మీరెవరో నాకు తెలియదు. ఆయనతో మాట్లాడాలనుంటే రేపు మధ్యాహ్నం రండి" అంది వసంత.

అవతల్నించి జవాబు రాలేదు కానీ తర్వాత ఎవరూ తలుపులు తట్టలేదు. అవి అలా ఎందుకు ఎవరు తట్టారో నాకు తెలియలేదు.

మర్నాడు ఆఫీసులో ఉండగా నాకు మళ్లీ ఫోన్ వచ్చింది. భగవంతరావే మాట్లాడుతున్నాడు---"నిన్న రాత్రి యముడి పిలుపు విన్నావా?"

"లేదు" అన్నాను.

"మీ యింటి తలుపు తట్టినవారెవరో తెలుసా?"

"తెలియదు..."

"వాడు నరహంతకుడు. హెచ్చరించడానికి మాత్రమే నేను పంపాను. అందువల్ల వాడు మీ యింటి తలుపులు బద్దలు కొట్టలేదు. అది వాడికి కష్టమైన పనేంకాదు."

"నేనుడబ్బున్నవాణ్ణి కాకపోయినా నాకూ బ్యాంకులో

ఒక లాకరుంది. ఆ లాకర్లో మా ఆవిడకున్న కొద్దిపాటి నగలతోపాటు ఓ ఉత్తరముంది. అందులో మీ వివరాలన్నీ ఉంటాయి. ఆ ఉత్తరం పోలీసులు చదివితే నన్ను హత్యచేసిన నేరానికి మిమ్మల్ని అరెస్టు చేయడమూ, మామిడిచెట్ల క్రింద యాభై అడుగుల గోతులు తీయించడమూ జరుగుతుంది. అదీ సంగతి..." అన్నాను.

"నువ్వు సామాన్యుడివనుకున్నాను..."

"ఒకప్పుడు సామాన్యుణ్నే. కానీ మీరే నన్ను గొప్పవాణ్ని చేస్తున్నారు. దయచేసి ఈ రాత్రికి ఎవర్నీ పంపించకండి. మా ప్రాణాలు మీకు చాలా విలువైనవి."

అవతలవైపు ఫోను క్లిక్కుమంది.

ఆ రోజు సాయంత్రం నేనింటికి వెళ్ళేసరికి—తలుపు తీసింది వసంత కాదు. భగవంతరావు.

ఆ క్షణంలో నాకు చాలా భయమేసింది కానీ మొండి ధైర్యం తెచ్చుకుని "నమస్కారం!" అన్నాను.

"ఎందుకొచ్చిన నమస్కారాలు. లోపలకు రా. మనం శత్రువులం..." అన్నాడు భగవంతరావు.

"మిత్రులైనా శత్రులైనా మీరు గొప్పవారు. మీలాంటి వారు మా ఇంటికి రావడం నా అదృష్టం. తగురీతిగా మిమ్మల్ని సత్కరించాలి..."

"అదేదో నువ్వే చేయాలి మరి. నీ పెళ్ళాం యింట్లో లేదుకదా మరి" అన్నాడు భగవంతరావు.

"లేకపోతే మాత్రం-రావడం ఎంత సేపు?" అన్నాను నిబ్బరంగా. అలా ఎలా మాట్లాడగల్గుతున్నానో నాకే ఆశ్చర్యంగా వుంది.

వసంతకు భగవంతరావువల్ల ఏదో కీడు కలిగిందని

నాకు తోచింది. ఆ క్షణంలో ఆవేశమూ, భయమూ నాకు సహాకరించవు. తీరి కూర్చుని కష్టాలు తెచ్చుకున్నా మని నాకు తెలుసు. అయితే రోట్లో తలదూర్చి రోకటి పోటుకు వెరచి ప్రయోజనం లేదు.

"వస్తుంది. నువ్వు తీయించే గోతిలోకి వెళ్ళడానికి."

"ఫోనీలెండి. నేను గొయ్యి తీయిస్తానని నమ్మకం కలిగింది కదా!"

"గొయ్యి ఎలా తీస్తావో నేను చూస్తాను" అన్నాడు భగవంతరావు పళ్ళు పటపట కొరుకుతూ.

"యాభైకాదు-వంద అడుగుల గొయ్యి తీయిస్తాను" అన్నాను కసిగా.

"సరే అలాగే చేయి. నేను వెడుతున్నాను. నీ పెళ్ళాం క్షేమంకోరిన పక్షంలో మళ్లీ నాకు ఫోన్ చేయి..." అని భగవంతరావు ఆక్రోశించి కదలబోయాడు.

"చూడండి మీకు మామిడిచెట్లకంటె మనిషి ప్రాణా లెక్కువ కాదన్నారు. నాకు వసంత ప్రాణాలముందు ఈ లోకమంతా దిగుదుడుపే. వసంతకేదైనా జరిగితే..."

"ఏం జరిగినా అంతా నీ చేతిలోనే వుంది. మళ్లీ రేపు ఫోన్ చేస్తాగా..." అని వెళ్ళిపోయాడు భగవంతరావు.

నాకు పుట్టెడు దుఃఖం వచ్చింది. నా వసంతను నేను మళ్ళీ కళ్ళతో చూడగలనా అనుకున్నాను. కొద్ది నిము షాలు అశక్తుడినై కుర్చీలో కూర్చుండిపోయాను.

# 8

ఇప్పుడు నేనేం చేయాలి? పోలీస్ స్టేషన్‌కు వెళ్లాలా? లేక భగవంతరావు కాళ్ళు పట్టుకోవాలా?

ఆలోచనలు తెగలేదుకానీ దాహం వేసింది. వీధి తలుపులు వేసి వంటింట్లోకి వెళ్ళాను. ఆశ్చర్యం! అక్కడ వసంత ఉంది.

వసంత మెలకువగానే ఉందికానీ కదలడానికి వీల్లేకుండా కాళ్ళూ, చేతులూ కట్టబడి ఉన్నాయి. మాట్లాడ్డానికి వీల్లేకుండా నోట్లో గుడ్డలు కుక్కబడి ఉన్నాయి.

నా దాహం సంగతి మరచిపోయాను. త్వరగా ఆమె కట్లు విప్పి "వసంతా, నువ్వు-క్షేమంగానే వున్నావా?" అన్నాను. అంతకుమించి ఆనందం కారణంగా .నా నోట ఇంకో మాట రాలేదు.

వసంత చటుక్కున నన్ను కౌగలించుకుంది. ఆమెకూ ఆనందాతిశయంలో నోట మాట రావడం లేదను కొంటాను.

"ఏం జరిగింది వసంతా? ఆ దుర్మార్గుడు నిన్నేమీ చేయలేదుకదా—" అన్నాను.

"ఏమీ చేయలేదండీ-పైగా ఇరవై లక్షలు ఇచ్చే శాడు..." అంది వసంత. ఉలిక్కిపడ్డాను. ఆమెచుట్టూ బిగించుకున్న నా చేతులు పట్టు విడిపోయాయి.

"ఏమిటి నువ్వంటున్నావ్?" అన్నాను.

"ఆయన వచ్చి నాకు డబ్బిచ్చి-మీరు వచ్చేముందే నన్నిలా కట్టిపారేశాడు. ఒకటికాదు-రెండుకాదు ఇరవై లక్షలు. నా కళ్ళు చెదిరిపోయాయి. అయితే మనమిక ఈ ఇంట్లో ఉండకూడదు. ఆ మాటకొస్తే ఈ ఊళ్ళోనే ఉండకూడదు..." అంది వసంత.

"ఏం జరిగిందో చెప్పు..." అన్నాను.

భగవంతరావు మధ్యాహ్నం వచ్చాడట. ఆయన యెవరో ముందుగా వసంతకు తెలియలేదుట. కాసేపు తన పేరు చెప్పకుండా అవీ ఇవీ మాట్లాడి చివర్లో అసలు రూపాన్నీ విషయాన్నీ బయటపెట్టి బెదిరించాడట. వసంత ఆయన బెదిరింపులకు ఏమాత్రమూ చలించలేదట. చివరికి ఆయన తను తెచ్చిన బ్రీఫ్ కేసు వసంతకు ఇచ్చాడట. అందులో డబ్బు ఆమె స్వయంగా లెక్కపెట్టి ఇరవై లక్షలున్నట్లు రూఢి చేసుకుంది.

ఇంతలో నేనొచ్చే సమయంకాగా ఆయన—"వాళ్ళ ముందు మీ ఆయనతో చిన్న నాటకమాడిపోతాను..." అని వసంతను కట్టిపారేశాడట భగవంతరావు. డబ్బు ఆమె దగ్గరే వదిలిపెట్టి ఆయన హాల్లోకి వచ్చాడు.

వసంత నాకు బ్రీఫ్ కేసు చూపించింది. ఇద్దరం ఒకటికి రెండుమార్లు లెక్కపెట్టాం. అందులో పదిలక్షలు మాత్రమే మావి. మిగతా పదిలక్షలూ ధర్మారావువి. ఇవ్వాలంటే బాధగానే ఉన్నప్పటికీ—సామాన్యజీవితం గడుపుతున్న మాకు ఒకటికి పదిలక్షలు సంపాదించి పెట్టిన ధర్మారావుతో ఆటలాడడం అన్యాయమని మా ఇద్దరికీ తోచింది.

వెంటనే ఆయనకో ఉత్తరం రాసి పారేశాం. తిరుగు టపాలో జవాబు వచ్చింది.

ఆ ఉత్తరం ప్రకారం మేమిద్దరం విమానంలో బయలుదేరి కలకత్తా వెళ్ళాలి. ఎయిర్ పోర్టులో మాకోసం ఓ కారు వస్తుంది. ఆ కారు నెంబరుకూడా ఆయన ఇచ్చాడు. ఆ కారెక్కాక మిగతా విషయాలాయన చూసు

కుంటాడు.

మేమెక్కువసేపు ఆలోచించలేదు. ఆయన రాసినట్లు చేయడానికే నిశ్చయించుకున్నాం. ఈలోగా భగవంత రావునించి మాకేవిధమైన ప్రమాదము జరుగలేదు.అంతటి కోటీశ్వరుడు ఇరవై లక్షలు మాకు అప్పుచెప్పి ఊరుకుంటాడా అన్నది నా అనుమానం.

"ఆ మామిడి చెట్లక్రింద ఏదో పెద్ద రహస్యముంది?! లేకపోతే అంత సులువుగా ఇంత డబ్బు మన చేతికి అప్పగిస్తాడా?" అంది వసంత.

"ఇరవై లక్షలు వదులుకునేటంత గొప్ప రహస్యం ఏముంటుంది? అది నిజంగా నిధి అయి ఉన్నపక్షంలో ఆ విషయం ఆయనకు ముందే తెలుసు. అయినా ఆయన ఆ యింటిని అమ్మేశాడు. అంటే యేదో తిరకాసుంది..."

"గొప్పవాళ్ళకు చాలా రహస్యాలుంటాయి. ఎలాంటి రహస్యం దాగుందో ఆ చెట్లకింద___..." అంది వసంత.

"అదెలాంటి రహస్యమైనా మనమూ గొప్పవాళ్ళం కాబోతున్నాం. మనకెలాంటి రహస్యాలూ ఉండకూడదు" అన్నాను.

# 9

కారు నెంబరు సరిపోయింది. మాట్లాడకుండా మా పేర్లు చెప్పి అందులో యెక్కాం. వెంటనే కారు కదిలింది.

నేను పైకి యెంత ధైర్యంగా వ్యవహరిస్తున్నప్పటికీ ఎప్పటికప్పుడే నా గుండెలు పీచుపీచు మంటున్నాయి. ఈ కారు మమ్మల్నెక్కడికి చేరుస్తుందోనని ప్రస్తుతానికి భయంగా ఉంది నాకు.

కారు ఓ చిన్న పెంకుటింటిముందాగింది. మమ్మల్ని దిగవలసిందిగా హిందీలో చెప్పాడు డ్రైవర్. మేము దిగాం. మేము వెళ్ళవలసిన యిల్లు చూపించి డ్రైవర్ కదిలి వెళ్ళిపోయాడు.

మాకు కొంతదూరంలో ఇంకో కారు ఆగి ఉండడం అప్పుడే నా కళ్ళబడింది. అందులోనించి ఓ మనిషి బయటకు— మావైపే చూస్తున్నాడు.

నేను వసంత చేయి పట్టుకున్నాను. రెండో చేతిలో బ్రీఫ్ కేసుంది. ఇద్దరం ఆ ఇంటి మెట్లెక్కి తలుపు తట్టాము. తలుపులు తెరుచుకున్నాయి.

ఏడెనిమిదేళ్ళ పిల్ల వచ్చి తలుపు తీసి "శివరావు గారేనా మీరు?" అనడిగింది హిందీలో.

అవునన్నాను. ఇద్దరం లోపల అడుగుపెట్టాం. ఆ పిల్ల తలుపులు గడియవేసింది. తర్వాత మమ్మల్ని తీసుకుని దొడ్లోకి తీసుకెళ్ళింది. దొడ్డి గుమ్మం తలుపు తెరిచి "వెళ్ళండి—" అంది.

అయోమయంగా ఫీలవుతూనే యిద్దరం బయటపడ్డాం. మా వెనకనే దొడ్డిగుమ్మం తలుపులు మూసుకున్నాయి. మేమిప్పుడు ఇంకో వీధిలోకి వచ్చాము.

అప్పుడే సరిగ్గా మా ముందు టాక్సీ ఒకటి వచ్చి ఆగింది. టాక్సీ డ్రయివర్ బయటకు తొంగిచూసి "మీ పేరు శివరావా...?" అన్నాడు హిందీలో. అవునన్నాను.

"అయితే యిందులో యెక్కండి—" అన్నాడు డ్రైవర్.

ఇద్దరం అందులో యెక్కాం. టాక్సీ ఓ యేడెనిమిది

సందులు తిప్పి ఒక యింటిముందు ఆగింది. మళ్ళీ ఇందా కటి అనుభవమే ఎదురయింది.

ఇలా నాలుగైదుసార్లు జరిగాక ఓ ఇంటి దొడ్డిగుమ్మం దగ్గర టాక్సీకి బదులు ధర్మారావును చూశాం మేము. అతన్ని చూడగానే యెవరో ఆత్మబంధువును చూసిన ఆనందం కలిగింది మాకు.

"ఇంకేం భయంలేదు. మన ఉనికిని భగవంతరావు మనుషులు తెలుసుకోలేరు" అన్నాడు ధర్మారావు.

"అతను మమ్మల్ని వెన్నాడుతున్నాడంటారా?"

"అంతే మరి. ఇరవైలక్షలు యిచ్చి చేతులు ముడుచు కుని కూర్చునే రకం కాదతను. మీ వెనుక మిమ్మల్నాడి స్తున్న వ్యక్తి ఒకడున్నాడని ఆయన పసిగట్టాడు. ఆ వ్యక్తిని తెలుసుకుని భస్మం చేయడంకోసమే మీకు డబ్బి చ్చాడు. అయితే అదాయన తరంకాదు..." అని "ఇప్ప టికే మీరు చాలా అలసిపోయినట్లున్నారు. పదండి పోదాం" అన్నాడు ధర్మారావు.

ముగ్గురం కొంతదూరం నడిచి ఒక టాక్సీ ఎక్కి ధర్మా రావు చెప్పిన చోటుకి వెళ్ళాం. అది ఓ చిన్న ఇల్లు. ధర్మారావే తాళంతీసి ఇంట్లోకి ప్రవేశించాడు. మేమాయ న్ననుసరించాము.

ఇంట్లో రెండు ఫ్లాస్కుల్లో కాఫీ సిద్ధంగా ఉంది. అది తాగి స్థిమితపడ్డాక జరిగినదంతా వసంత ఆయనకు వివ రించి చెప్పింది.

"మీ వెనుక ఎవరో మనిషున్నాడని భగవంతరావుకు తెలిసింది. మిమ్మల్ని బెదిరిస్తే ఆ వ్యక్తి రక్షణ కోరతా రేమో—ఆ విధంగా నన్ను బయటపెట్టవచ్చునని ఆయన

భావించాడు. నేనెవరో తెలిసేదాకా ఆయన మీకే విధమైన హానీ కలిగించలేదు. మీరు నా గురించిన రహస్యాన్ని దాచడం మీ ప్రాణాలను కాపాడి లక్షలను సంపాదించిపెట్టింది...'' అన్నాడు ధర్మారావు.

''అసలా మామిడిచెట్లక్రింద ఏముంది? వాటి గురించి భగవంతరావంతగా ఎందుకు కంగారుపడిపోతున్నాడు? లక్షలకు లక్షలు వాటి గురించి ధారపోస్తున్నాడంటే అందుకు కారణమేమిటి?'' అనడిగేశాను నేను.

''ఇప్పుడా విషయాన్ని మీకు నేనెలాగూ చెప్పబోతున్నాను...'' అన్నాడు ధర్మారావు. అతని కళ్ళు చూస్తే ఏవో పాత జ్ఞాపకాలను తవ్వుతుంటున్నట్లనిపిస్తుంది.

# 10

''ఏమిటి నాన్నా రాస్తున్నావ్?'' అనడిగాడు ధర్మారావు.

శంకర్రావు కంగారుగా కాగితాలు మూసివేసి వాడావుడిగా ''ఇది నువ్వు తెలుసుకోవలసిన విషయంకాదు. వెళ్ళు...'' అన్నాడు.

ధర్మారావు వారం పదిరోజులుగా తండ్రిని గమనిస్తున్నాడు. ఆయన అతి శ్రద్ధగా ఈ వ్రాత పని చూస్తున్నాడు. ఏమిటి చేస్తున్నాడో తెలియదు కానీ ఆయన వ్రాసే కాగితాలను వీలైనంత రహస్యంగా ఉంచడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంట్లో తను లేనప్పుడాయన రాసే ఆ కాగితాలను ఓ పెట్లో పెట్టి దానికి రెండు తాళాలు వేస్తున్నాడు.

చారిత్రాత్మక గాథలకు కల్పనను జోడించి రసవత్తరంగా వర్ణించి వ్రాయడంలో శంకర్రావుకు చాలా

పేరుంది. రచనలే ఆయన జీవనాధారం. నెలకు రెండు మూడు వేలవరకూ వాటిపైన సంపాదిస్తున్నాడాయన. అటువంటిది ఇటీవల పదిరోజులుగా ఆయన తన రచనల కోసం వచ్చిన పబ్లిషర్సు నందరినీ రెండు నెలల గడువు కోరాడు. ఏడెనిమిదివేల రూపాయల ఆదాయం వదులు కున్నాడు.

ఒకరోజు ఆయన ఆ వ్రాతప్రతులను తీసుకుని భగ వంతరావు యింటికి వెళ్ళాడు. మళ్ళీ తిరిగిరాలేదు. ధర్మారావెన్నో విధాల వాకబు చేశాడు. ఆయన ఆచూకీ తెలియలేదు. భగవంతరావు తనకూ శంకర్రావుకీ ఏమీ సంబంధం లేదన్నాడు.

ధర్మారావు నిస్సహాయుడై ఉండగా అతనికో చిన్న ఆధారం దొరికింది. స్టెయిన్ లెస్ స్టీలు దుకాణంలో గిన్నెల మీద పేర్లు చెక్కుతూండే వరదరాజు కూడా భగవంత రావు యింటికి వెళ్ళి మాయమయ్యాడట. అయితే భగ వంతరావు ఈ విషయంలో కూడా తనకేమీ తెలియదని బుకాయించాడు. వరదరాజు తమ్ముడు ఏడుకొండలు ఈ విధంగా ధర్మారావుకు తోడయ్యాడు.

ఈలోగా భగవంతరావుకున్న ఒక యింట్లో నిధి ఉందని పుకారు పుట్టింది. దాని గురించి ఆయన పెద్ద ఎత్తున ప్రయత్నాలారంభించాడు. కోటీశ్వరుడైన ఆయ నకు నిధి గురించి ఆశ ఉండడం ప్రజలు విడ్డూరంగా చెప్పుకున్నారు. ఆయన మాత్రం అందులో ఏమైనా అపూర్వ వస్తువులు దొరికితే వాటిని ప్రభుత్వానికి తన పేరుమీదుగా సమర్పించుతానని అంటూ వచ్చాడు.

ఆ ఇంటి దొడ్లో నలభై అడుగుల లోతున రెండు పెద్ద

గోతులు తియ్యబడ్డాయి. అంతవరకూ వాటిల్లో ఏమీ దొరకలేదు. పోలీసు డిపార్టుమెంటుకు చెందిన కొందరు వ్యక్తులు కూడా వచ్చి ఆ గోతుల్ని పర్యవేక్షించి వెళ్ళారు. చాలామంది జనం ఆ గోతుల్ని చూశారు.

విచిత్రమేమిటంటే నలభై అడుగుల లోతు తీసిన మర్నాడు గోతులు మూడొంతులకు పైగా కప్పబడి పోయాయి. బహుశా రాత్రికి రాత్రి ఏదైనా ప్రమాదమైనా జరిగివుండాలి. లేదా భగవంతరావు శావాలనే ఆ గోతుల్ని కప్పెట్టించి వుండాలి.

రెండోదే నిజమయుండాలని ధర్మారావు అనుమానం. కప్పబడిపోయిన ఆ గోతుల్ని చూడ్డానికి చాలామంది జనం వెళ్ళారు. భగవంతరావు దిగులుగా ముఖం పెట్టాడు.

ఆ గోతుల్లో శంకర్రావు, వరదరాజులకు సంబంధించిన రహస్యాలేమైనా వుండవచ్చునని ధర్మారావు అనుమానం. అయితే అవి ఎటువంటి రహస్యాలయుంటాయి?

భగవంతరావు గురించి కొన్ని పుకార్లు మాత్రం వచ్చాయి. ఆయనకు నరబలిపైన నమ్మకమున్నదనీ, తనకు క్లిష్టసమస్యలేర్పడినప్పుడాయన దానికి పాల్పడతాడనీ చాలామంది అనుకున్నారు.

నరబలియిచ్చి వాళ్ళను నిలువులోతున పాతిపెట్టి, దానిమీద మామిడి మొక్క ఆ నరబలి యిచ్చిన వాడే స్వయంగా చేత్తో పాతిపెడితే—ఇష్టసిద్ధి అవుతుందని ఆ ఊళ్ళో ప్రచారముంది. దానికి తగ్గట్టుగానే ఇప్పుడక్కడ రెండు మామిడిమొక్కలున్నాయి.

ధర్మారావు జనంలోంచి ముందుకు వెళ్ళి తన అనుమానాన్ని బహిరంగం చేశాడు. కొంతమంది అవుననీ

మరికొందరు కాదనీ అన్నారు. అక్కడున్న పోలీసాఫీసరు మాత్రం-ఇది అర్థంలేని నేరారోపణ అనీ ఏమీ సంబంధం లేని శంకర్రావు, వరదరాజులను భగవంతరావు హత్య చేయడమూ, ఆ తర్వాత యింత హడావుడి చేసి గోతులు తీసి వాటిలో వాళ్ళను పాతిపెట్టడమూ అసంభవమని అన్నాడు.

ధర్మారావుకూ అది నిజమేననిపించింది. నిజంగా హత్యలు చేసినట్లయితే భగవంతరావింత హడావుడి ఎందుకు చేస్తాడు?

భగవంతరావు మాత్రం—"ఇది చాలా బాధకరమైన ఆరోపణ. నేను నిజంగానే నరబలి చేశాననుకుందాం. మామిడి మొక్కలు నేను స్వయంగా నాటినప్పుడు గదా నాకిష్టసిద్ధి కలిగేది! అనుమాన నివృత్తికోసం ఆ ఆరోపణ చేసిన వ్యక్తినే ఈ మొక్కలను నాటమనండి—" అన్నాడు.

ధర్మారావు తనచేత్తో స్వయంగా ఆ మొక్కలను నాటాడు. నాటేటప్పుడే అతని మనసులో అనుకున్నాడు "ఈ మామిడిమొక్కల క్రింద ఏదో రహస్యముంది. దాన్ని నేను ఛేదించాలి అదే నా జీవిత ధ్యేయం..."

భగవంతరావు కాగోతుల్లో నిధి దొరికింపనీ అందుకే రాత్రికిరాత్రి ఆ గోతులు కప్పెట్టించాడనీ మరికొందరు చెప్పుకున్నారు. ఇదలావుండగా భగవంతరావో నవల రాసి ప్రచురించాడు. ఆ నవల అతనికి చాలా పేరు తెచ్చి పెట్టింది. అదొక చారిత్రాత్మక గాథ.

వ్యాపారంలో తల మునకలవుతున్న కారణంగా తనకు రచనలు చేసే వ్యవధి వుండదనీ, ఇదే తను చేసిన

మొదటిదీ, ఆఖరిదీ అయిన రచన అనీ భగవంతరావు ప్రకటించాడు. ఆయనలోవున్న రచనాచాతుర్యాన్ని గొప్పగొప్ప రచయితలు కూడా ప్రశంసించారు.

భగవంతరావు పేరున వెలువడ్డ ఆ నవల తనతండ్రి రాసినదేనని ధర్మారావు అభిప్రాయం. శైలి, వాక్య నిర్మాణం వగైరాలన్నీ పోల్చి చూసుకున్నాక అతనికా విషయంలో ఇంకేమీ సందేహం మిగలలేదు.

భగవంతరావు పేరుప్రఖ్యాతులపట్ల చాలా మోజున్న దని అంతా చెప్పుకుంటూరు. చరిత్రలో తనపేరు చిరస్థాయిగా నిలిచిపోవడంకోసం ఆయన ఏమైనా చేస్తాడంటూరు.

అందుకే ఆయన శంకర్రావుని ఓ చారిత్రాత్మక నవలను వ్రాయమని వుంటాడు. నవలనైతే వ్రాశాడు కానీ శంకర్రావుకు దాన్ని భగవంతరావు రచనగా ప్రజల ముందుంచడం ఇష్టముండి ఉండదు. భగవంతరావు నయానా భయానా చెప్పిచూసి విఫలుడయ్యాక-తను రచయితగా ప్రజలదృష్టిలో నిలిచిపోవడంకోసం- శంకర్రావుని హత్య చేసివుండాలి.

ఇది ధర్మారావు అనుమానం. అయితే ఒక నవలను స్వంతం చేసుకోవడంకోసం భగవంతరావు హత్యవరకూ వెడతాడంటే ధర్మారావుకు తన ఆలోచన అసందర్భంగా వున్నదేమోననిపించేది.

భగవంతరావు స్వంతడబ్బులో ఓ సినిమా తీసి అందులో తనే కథానాయకుడిగా వేశాడు. ఆ చిత్రానికి దర్శకత్వ బాధ్యతకూడా స్వీకరించాడు. డబ్బిచ్చి ఎవని చేతనో డైరెక్షన్ చేయించాడని కొందరు చెప్పుకున్నా

కాగితాలపైన మాత్రం ఆయన పేరే వుండిపోయింది.

అలానే ఓ చిత్రానికి సంగీత దర్శకుడిగా కూడా ఆయన పేరు వేయబడింది. మరో చిత్రానికి ఆయనే కథకుడు. అంతటితో ఆయన సినిమాఫీల్డుకి స్వస్తి చెప్పాడు. అదృష్టమో, దురదృష్టమో—ఆయన వేలు పెట్టిన చిత్రాలన్నీ ఘనవిజయం సాధించాయి.

రాజకీయాల్లో కూడా భగవంతరావు చెప్పుకోదగ్గ పేరు సంపాదించాడు. రూపాయనోట్లు పంచిపెట్టి ఎమ్మెల్యే అయ్యాడు. కట్టలు పంచిపెట్టి మంత్రి అయ్యాడు. పత్రికలవాళ్ళను తృప్తిపరచి సమర్థుడైన మంత్రి అనిపించుకున్నాడు.

ఒక సంవత్సరం మంత్రిగావుండి పదవికి రాజీనామా ఇచ్చాడు. తనబోటివాడు పదవిలో లేకుండా యింకా ఎక్కువ ప్రజాసేవ చేయవచ్చుననిపించి అలా చేశాడట. పత్రికలన్నీ ఆయనకు పదవీ వ్యామోహం లేదంటూ ఆకాశానికెత్తిపారేశాయి.

భగవంతరావు ఏమేంచేసినా ధర్మారావుకు బాధలేదు. ఆయన తన తండ్రిని పోగొట్టుకున్నాడు. ఆ బెంగతో ఏడాది తిరక్కుండా తల్లి చనిపోయింది. అతను ఏకాకి అయిపోయాడు.

ధర్మారావు, భగవంతరావును కలుసుకుని నవలగురించి తన అనుమానాలు బయటపెట్టాడు. నోరు మూసుకుంటే లక్షరూపాయలిస్తానన్నాడాయన. దాంతో ధర్మారావు అనుమానం బయటపడింది. అతను అప్పటికింకా ఉగ్రవాడు కాబట్టి ఆవేశపడి భగవంతరావుని నానామాటలూ అనేసి బయటకు వచ్చేశాడు.

తర్వాత ధర్మారావుమీద అయిదారు హత్యా ప్రయత్నాలు జరిగాయి. అన్నీ కాఫీ, టీల రూపేణా జరిగాయి. అన్ని ప్రమాదాలనుంచీ అతను తప్పించుకుని కాఫీ, టీలను విసర్జించాడు.

అందుకు కారణం నిజంగా విషప్రయోగ భయం కాదు. చాణక్య శపథంలాంటిది పట్టాడతను. భగవంతరావు అంతు చూసేవరకూ—కాఫీ, టీలు తాగకూడదని అతని నిర్ణయం.

ధర్మారావుకున్న దొక్కటే అనుమానం. భగవంతరావు తీయించిన ఆ గోతుల్లో నిజంగా ఏదైనా రహస్యమున్నదా? ఉంటే అది ఏమిటి? దాని విలువెంత?

# 11

"నా అనుమాన నివృత్తికోసం మిమ్మల్నుపయోగించుకున్నాను. ఇరవై లక్షలకు తక్కువ కాకుండా విలువ చేసే రహాశ్యమా గోతుల్లో వున్నదని తేలిపోయింది. ఇంక తేల్చవలసిందా రహస్యమొక్కటే!" అన్నాడు ధర్మారావు.

నేను,వసంత కూడా నోళ్ళు తెరుచుకుని వింటున్నా మీ కథను. వినడానికి చాలా పసందుగానే వున్నప్పటికీ— అది ఒక మనిషి జీవితానికి సంబంధించిన చేదునిజం అన్న విషయాన్ని గుర్తించగలిగాను నేను.

"అయితే యిప్పుడు మనమేం చేయాలి?"

"మీ వంతు మీరు చేశారు. ఇంక నా వంతు నేను చేయాల్సివుంది. అందుకుపాయం ఆలోచించే వుంచాను. నా పని అయ్యేవరకూ మీరు కొంతకాలం రహస్యంగా వుండాలి..." అన్నాడు ధర్మారావు.

"ఏంచేస్తారు మీరు?"

"భగవంతరావు చాలా పలుకుబడిగల మనిషి. అతన్నెదిరించి అతని దొడ్లో గోతులు తీయించడమంటే మాటలు కాదు. అందులోనూ సామాన్యమైన గోతులు కావు— కనీసం యాభై అడుగులైనా ఉండాలవి. ఈ విషయంలో నాకో ప్రొఫెసర్ గారు సహాయపడుతున్నాడు. ఆయన నా తండ్రికి స్నేహితుడు. భగవంతరావు రచన ఆయన చూసి అది తప్పక మా నాన్నగారు రాసిందే అయుంటా లన్నాడు. ఆయనకు అంతర్జాతీయ ఖ్యాతి వుంది. ఆర్కియాలజీ ఆయన సబ్జెక్టు. ఆయన ఇప్పుడు భగవంత రావు ఇంట్లో ఏవో పురాతన కట్టడాలకు సంబంధించిన శిధిలాలు లభించగలవని అనుకుంటున్నట్లూ, అందుకు ఆధారాలు లభించినట్లూ చెబుతాడు. ఆయన తన బృందంతో, పరికరాలతో భగవంతరావు దొడ్లో మకాం వేస్తాడు. ఆయనకు పోలీసు రక్షణ కూడా వుంటుంది."

"ఈ పని మీరెప్పుడో చేయవలసింది..." అన్నాను.

"చేసేముందు ఆ గోతిలో రహస్యముందో లేదో తెలుసుకోవాలిగదా—కొన్ని సంవత్సరాలుగా ప్రయత్నిస్తూ ఏమీ తెలుసుకోలేకపోయాను. మీద్వారా ఆ గోతి విలువ తెలిసింది."

"కానీ..." అంది వసంత అదోలా "ఏ రహస్యం దాచాలని ఇరవైలక్షలు ఇవ్వడానికి భగవంతరావు సిద్ధపడ్డాడో—ఆ రహస్యాన్ని ఆయనదగ్గర ఇరవైలక్షలూ పుచ్చుకున్నాక కూడా బయటపెట్టడానికి ప్రయత్నిస్తున్నాం. ఇది అన్యాయం కదూ..."

"చూడండమ్మా—మీరింకోలా కూడా ఆలోచించాలి.

జీవితకాలం మీరు రెక్కలు ముక్కలు చేసుకున్నప్పటికీ ఓ పాతిక వేలైనా కూడబెట్టలేరు. రెండు మామిడిచెట్ల కోసం ఇరవై లక్షలు క్షణంలో ఇచ్చేశాడు భగవంతరావు. ఎక్కడిదీ డబ్బు? ఎలా వస్తోందింత డబ్బు? అన్యాయాల వల్లనే కాదా. అలాంటివాడికి ఏం చేసినా అన్యాయం కాదు.

అసలు నేను మిమ్మల్ని ప్రోత్సహించడానికి కారణం తెలుసా? ఎలాగూ భగవంతరావు బ్రతుకు బయట పెట్టబోతున్నాను నేను. ఈ లోగా మీకు కొంత వుపకారం చేయాలనిపించింది. తన బ్రతుకు బయటపడ్డాక ఆయ నెలాగూ డబ్బివ్వడు. ఇది మనకు అదనపు లాభం అన్నమాట..." అన్నాడు ధర్మారావు.

"మీరు చాలా విచిత్రమైన మనిషిలాగున్నారు..." అన్నాను.

"ఒక విధంగా అలాగే అనుకోవచ్చు. తలిదండ్రులకు ఒక్కగానొక్క కొడుకుని నేను. అల్లారు ముద్దుగా పెరిగాను. బుద్ధిగా చదువుకున్నాను. ఒక్క సంవత్సరం తేడాలో తల్లీ తండ్రీ దూరమయ్యారు నాకు. అందు కారణం భగవంతరావే అయినప్పటికీ, నా జీవన ధ్యేయం అతనిమీద పగతీర్చుకోవడమొక్కటే కాదు. అలాంటివారిని వెతికివెతికి పట్టుకుని ప్రభుత్వాని కప్ప గిస్తాను. ఆ ప్రయత్నంలో కొందరు మీలాంటివారికి సహాయపడడానికి ప్రయత్నిస్తాను. నా పదిలక్షలతో నేను ప్రజాసేవకు పాటుపడతాను. మీ పదిలక్షలలో మీరు మంచిగా బ్రతకండి" అన్నాడు ధర్మారావు.

అప్పటికప్పుడు మామధ్య డబ్బు పంపకాలు జరిగాయి.

"మనం మళ్ళీ కలుసుకుందాం. మీరెక్కడున్నా నేను చెప్పిన చిరునామాకో ఉత్తరం రాసిపారెయ్యడం మరిచిపోకండి..." అని తన చిరునామా చెప్పి వెళ్ళి పోయాడు ధర్మారావు.

పదిలక్షల రొక్కంతో నేనూ, వసంతా కలకత్తాలో ఆ ఇంట మిగిలాము.

# 12

రెండురోజులు మేమిద్దరమూ ఆ ఇంట్లో గడిపాము. తర్వాత ఇంటివారికి ధన్యవాదాలు చెప్పి, ఆ ఇంట్లోంచి బయటపడ్డాం.

ఇప్పుడు మా వేషాలు కొద్దిగా మారాయి. నేను మధ్యపాపిడి తీసాను. లాల్చీ, సరాయీ ధరించాను. నొసట బొట్టు పెట్టాను. గడ్డం గీయడం మానేశాను.

వసంత బెల్ బాటమ్ వేసుకుంది. రెండు జడలు వేసుకుంది. ముఖానికి మేకప్ పెంచింది.

ఇదివరలో మమ్మల్నెరిగున్న వాళ్ళు యిప్పుడు చూస్తే వెంటనే గుర్తుపట్టడం కష్టం.

శనికి భయపడి పరమశివుడు చెత్తఆకుల మధ్య దాక్కున్నాడుట. పదిలక్షలకు స్వంతదారులమైన మేమూ శివునంతటి వాళ్ళమే! తాత్కాలికంగా రహస్యజీవనం చేయాల్సి వస్తోంది. అందుకే డబ్బున్నప్పటికీ విమానం ఎక్కలేదు. రెండవ తరగతి రైలుప్రయాణం రెండు రోజులు చేసి తెలుగుదేశంలో పడ్డాం. మా ఊరు మాత్రం వెళ్ళలేదు.

మా దగ్గర డబ్బున్నట్లు ఎవ్వరికీ అనుమానం రాకుండా చాలా జాగ్రత్తగా దాన్ని కాపాడుకుంటూ వస్తున్నాం. కానీ ఎప్పటికప్పుడే మాకు భయంగా ఉంటోంది. ఏ బ్యాంకులోనో ఆ డబ్బు చేరేవరకూ మాకు చాలా బెంగగా ఉంటోంది.

ఒక ఊరు చేరాక నాకో ఉపాయం తోచింది. నగల దుకాణానికి వెళ్ళి వసంతకు ఏడెనిమిదివేలు విలువచేసే నగలు కొన్నాను.

తర్వాత ఆ షాపు యజమానితో—"అయ్యా! మీరు నాకో చిన్న సాయంచేయాలి. మేమిప్పుడు తీర్థయాత్రలు చేస్తున్నాము. మీ షాపులోని నగలు ఆకర్షించిన కారణంగా అనుకోకుండా కొనేశాం.అయితే దూరప్రాంతాల ఇలాంటి ఖరీదైన నగలతో తిరగడం మా కిష్టంలేదు. ఈ ఊరు మాకు కొత్త. మీరు రికమండ్ చేసి ఏ బ్యాంకులోనైనా మాకో లాకర్ ఇప్పించగలిగారంటే చాలా సంతోషిస్తాం..." అన్నాను.

షాపు యజమాని చాలా సంతోషంగా అంగీకరించి మాకటువంటి ఏర్పాటు చేశాడు. నా తెలివితేటల్నీ, అదృష్టాన్నీ అభినందించుకుంటూ డబ్బునీ, నగల్నీకూడా లాకర్ లో దాచేశాను.

ఆ తర్వాత ఇద్దరం కలసి ధైర్యంగా మాకు కాస్త దగ్గర చుట్టాలున్న ఓ గ్రామం వెళ్ళాం. ఆ ఊళ్ళో మా అత్తయ్యుంది. మా వేషాలు చూసి అత్తయ్య తిట్టడమే కాక చీదరించుకుందికూడా.

ఇద్దరం తేలికగా ఊపిరి పీల్చుకుని ధర్మారావుకో ఉత్తరం రాసిపారేశాం.

తిరుగుటపాలో ధర్మారావు స్వయంగా మా దగ్గరకు వచ్చి "మరో అదృష్టం మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చింది!" అన్నాడు.

అతని మాటలు మా కర్థం కాలేదు—"ఏమిటది...—?"

"భగవంతరావుని పట్టుకుని అప్పగించినవారికి లక్ష రూపాయల బహుమతి..."

"ఏమిటీ?" అంది వసంత.

"అయితే మీరు పేపర్లు చూడడంలేదా?" అన్నాడు ధర్మారావు ఆశ్చర్యంగా.

"లేదు..." అన్నాను.

"భగవంతరావు దొడ్లో మామిడిచెట్ల తవ్వకం జరిగింది. సుమారు యాభై అడుగుల లోతున తీసిన గోతుల్లో దొరికినవేమిటో తెలుసా?"

"ఏమిటి?" అన్నాం నేనూ వసంతా ఆత్రుతగా.

"మీరుకానీ నేనుకానీ మరెవ్వరు కాని ఊహించలేనిది..."

మా ఇద్దరికీ ఆత్రుతాగడంలేదు.

"వరదరాజు, మా నాన్న ఎందుకు మాయమయ్యారో ఆ సంఘటనతో అర్థమయింది. దుర్మార్గుడు—నా తండ్రిని అన్యాయంగా పొట్టబెట్టుకున్నాడు..."

"ఆ గోతుల్లో ఏముందో చెప్పండి..."

"రెండింటిలోనూ శతాబ్దాల తరబడి చెక్కుచెదరకుండా నిలువగల కంచు పెట్టెలు. ఆ పెట్టెలలో రాగి రేకులు. ఆ రేకులపై చరిత్ర. అది భారతదేశపు చరిత్ర.

ఆ చరిత్ర ప్రకారం మహాత్మాగాంధీ, జవహర్ లాల్ నెహ్రూ, లాల్ బహదూర్ శాస్త్రి, జయ ప్రకాష్ నారాయణ్, ఇందిరాగాంధీ, మొరార్జీ దేశాయ్‌లు ఈ దేశంలో పుట్టనేలేదు.

ఈ దేశ స్వతంత్ర్య పోరాటం భగవంతరావుకుటుంబం జరిపింది. ఈ దేశానికి నాయకత్వం భగవంతరావు కుటుంబం వహించింది. దేశపు రాజ్యాంగం భగవంతరావు చేత వ్రాయబడింది. ఇది భారతదేశంకాదు. భగవంత దేశం. ముందు తరాలవారికి భగవంతరావు అందజేయ దల్చుకున్న సమాచారమది. దీని కారణంగా భగవంత రావు పేరు చరిత్రలో ఒక స్థాయిగా నిలిచిపోతుంది...

ఈ గోతుల త్రవ్వకం మొదలుపెట్టగానే భగవంత రావు మాయమయ్యాడు. దేశం, ప్రజలు, ప్రభుత్వం— ఎవ్వరూ ఆయన్ని క్షమించరు. ఇప్పు డాయన్ను పట్టు కోవడమే నా ధ్యేయం. అయితే అందువల్ల నాకు డబ్బు రానక్కర్లేదు. గొప్పవాడు కాగల లక్షణాలున్న మరో మనిషిని పట్టుకుంటాను...'' అని ఆగాడు ధర్మారావు.

''అంటే, భగవంత్ పరారీలో ఉన్నాడన్నమాట'' అంది వసంత ఆలోచనగా.

''తన నేరం బయటపడడానికి ముందే ఆయనకు విషయం తెలిసిపోయింది. కాబట్టి తప్పించుకుపోయాడు. నేను మళ్ళీ గొప్పవాళ్ళను వెతుక్కుంటూ బయల్దే రాలి...''

''మేము కాదా గొప్ప వాళ్ళం...'' అన్నాను నవ్వుతూ.

"నేను చెప్పేది కాబోయే గొప్పవాళ్ళ గురించి. మరి మీరు గొప్పవాళ్ళయి పోయారుగా..." అన్నాడు ధర్మారావు.

"అయితే ధర్మారావుగారూ-మేము ఇక తిరిగి మా ఇంటికి వెళ్ళిపోతాం. మీరు మాకు చేసినమేలు ఈ జన్మలో మరువలేను. మరువలేని ఆతిధ్యం మీకివ్వాలనుంది మాకు" అంది వసంత.

"దానికేముంది? మీ చేత్తో కాస్త కాఫీ కలిపివ్వండి" ఆ పానీయ సేవనం మళ్లీ ప్రారంభిస్తాను" అన్నాడు ధర్మారావు తృప్తిగా నవ్వుతూ.

—: ఐపోయింది :—

## "మ చిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## "హోం డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది.

సభ్యత్వం కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియూ సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషాలు

## కొనడం-అమ్మడం

(ప్రథమ బహుమతి రూ. 15/- పొందిన రచన)

ఒక బిజినెస్ మాగ్నెట్ వ్యాపార నిమిత్తం సరుకు కొనడానికి బొంబాయి వెళ్ళాడు. అన్నప్రకారం ఆరు రోజులలో తిరిగిరాకుండా అక్కడ ఒక అమ్మాయికి అలవాటుపడి ఇంటికి "ఇంకా సరుకు కొంటూనే ఉన్నాను. రావటానికి మరో పదిరోజులు పడుతుంది" అని ఒక టెలిగ్రాం యిచ్చాడు.

అది చదివి అసలు సంగతి తెలిసికొని భార్య అతనికి వెంటనే రిప్లై టెలిగ్రాం యిలా యిచ్చింది. "మైడియర్! త్వరగా యింటికి వచ్చివేయడం మంచిది. ఆలస్యంచేస్తే మీరు అక్కడ ఏదో కొంటున్నాను అనుకునేది నేను యిక్కడ అమ్మడం ప్రారంభించవచ్చు."

—ముద్దా రమేష్- చాగల్లు.

## ఆక్సిడెంట్—?

(ద్వితీయ బహుమతి రూ. 10/- పొందిన రచన)

"హెల్ప్! హెల్ప్!" ఓ మహిళ అరుస్తూంది.

"ఏంటమ్మా! ఏంజరిగింది?" ఓ బీట్ కానిస్టేబులు అడిగాడు.

"అదిగో, ఆ దూరంగా వెళ్ళిపోతున్న కారు నాకు డాష్ యిచ్చిందండి."

"ఆ కారు ఏ కంపెనీదో చెప్పగలరా?"

"తెలీదండి"

"పోనీ ఎవరిదో తెల్సా?"

"తెలీదండి"

"నెంబరు....?"

"చూడ్లేదండి"

"కార్లో ఎందరున్నారు?"

"ఒక్కతే ఉందండి"

"ఆమెలా ఉంటుందో చెప్పగల్రా?"

"తెల్లని శరీరచ్ఛాయ. అట్టే పొడుగూకాదు, అట్టే లావూకాదు, మామూలుగా ఉంటుంది. బంతిపువ్వు రంగు చీర కట్టింది. చీరకు అంచు చిలక పచ్చరంగు. చీరనిండా మల్లెమొగ్గల డిజైను, గులాబీరంగు వి నెక్ జాకెట్టు. జాకెట్టుకి బటన్స్ బాక్ సైడు ఉన్నట్టున్నాయి. ఉంగరాల జుట్టు. తలలో కుడిప్రక్కనున్న గోల్డు నెలవంక. మెడలో ఒంటిపేటచైను. చెవులకు రింగులు. చేతికి రెండే రెండు చింతాకు డిజైను బంగారు గాజులు...."

"? ? ? ?"

—ఎల్. సత్యం, కొత్తూరు.

